సరస్వతీ గ్రంథమండలి: ౨౧
రాఘవరావు సంపాదితము

# మణిహారము



బులుసు వెంకటసుబ్బారావు బి. ఎ., బి. యల్.

Non - detailed Text Books for S. S. L. C. and
Matriculation Examinations 19·6, Fort St. George Gazette,
Part I - B, D/22-5—45 Page 210 and D/26-6-45 Page 246



Te
894.8132
Ve 367

1½
రూ

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

సరస్వతీ గ్రంథమాల :-౨౧
రాఘవరావు సంపాదితము.

# మణిహారము

బులుసు వెంకటసుబ్బారావు బి. ఎ., బి. యల్.

(Non-detailed Text-Book for S. S. L. C. and Matriculation Examinations 1946. Fort St. George Gazette, Part 1-B, D/ 22-5-45 Page 210 and D/ 26-6-45 Page 246)




సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# అంకితము

ఆదిమధ్యాంతరహితంబును,

విశ్వమందలి వివిధపరివర్తనముల కాకరంబును,

కారణంబును,

భగవత్స్వరూపంబును

నగు

“ కాలమునకు ”

దీని నంకితము చేయుచుంటిని.

# ఉపోద్ఘాతము

చదువరులకు గ్రంథకర్త విన్నవించుకొనున దేమన నీకథ ముఖ్యముగ నాంగ్లదేశకవి యగు "టెన్నిసన్" (Tennyson) వ్రాసిన "Lancelot and Elaine" అను కథ నాధారముగఁ జేసికొని కల్పింపఁబడినది. ఇందు యవన [గ్రీకు] పాత్రములకు పేరు లిడు నవసరమునఁ బదములకు భారతీయ నామధేయములకుఁ బోలిక యుండులాగున మార్పులు చేసితిమి. ఇందు చారిత్రక యాథార్థ్యము కంటెఁ గథాకల్పనా సౌందర్యమునకే నెక్కువ ప్రాముఖ్యత యీయఁబడినది. కావున గుణగ్రహణ పారీణులగు పాఠకమహాశయులు దీనిని సాదరముగఁ జదివి గుణము లేమైన నున్న గ్రహించి, దోషముల నా కెఱింగించినచో, మున్ముం దట్టి దోషములు కలుగకుండులాగునఁ బ్రయత్నించెదను.

దీనియందు స్నేహభావమున నాకు జాల దోడ్పడిన శ్రీయుతు లగు కాండ్రేగుల రామచంద్రరావుగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

1—11—1923<br>
వల్లూరు.

బులుసు సుబ్బారావు.

# మణిహారము

## ౧

సర్వకారణములకుఁ గారణం బయిన పరమేశ్వరుని దివ్యహస్తముచే వినిర్ముక్తమైన విశ్వచక్రము కాలము చాలునుబట్టి యెన్నియో పరిణామము లొనర్చి యుండలేదు. నాఁడు ప్రకృతి బాల్యయౌవన మధ్యస్థయై నవ లావణ్యశోభితయై హృదయమునకు నిర్మలానంద మొసంగుచుండెను.

ఒక చక్కనివనము. వేకువజాము. నల్దెసలఁ బండువెన్నెల నిండి యుండె. అరుణకాంతులు తూర్పుదిక్కున నించుకించుక దోఁచుచుండెను. తీయమామిడిగున్నపైఁ గూరుచుండి యాగియాగి యొకొక్కమాఱు కంఠ మెత్తి పాడుచుండిన కోకిలసుస్వనము నరుని హృదయముఁ బ్రేమార్ద్రింబుగ నొనర్చి యానందరసానుభవమునకుఁ దగు నటులఁ జేయుచుండెను. రంగురంగులగులాబిపూ లెన్నియో వికసించి కన్నుల పండువుగ నుండెను. ఆకులేకుండఁ బూచి వికసించిన పారిజాతములు, పోకవృక్షముల నంటి ప్రాఁకుచున్న బొండుమల్లియలు, మొగలిడొంకఁ జుట్టివచ్చిన సన్నజాజులు, దవ్వులనుండి జీడిమామిడి పండ్లు, గుమ్మనునువాసన వెదఁజల్లుచున్నవి. వన్యవృక్షము లన్నియుఁ జుట్టును గోడపెట్టినటు లున్నవి. నలుఁగు రాశ్వికులు ఖడ్గపాణులై చుట్టును నిలువ నడుమ సాక్షాత్రిజగన్మోహిని యనఁ బఱగు నారీమణి నిండుజవ్వని నిలిచి యున్నది.

మొదటి యాశ్వికుఁడు :—నేను పెండ్లియాడెదను.

రెండవ :—నన్ను వలచినది.

మూఁడవ :—నాసొత్తిమె. మీ రెవ్వరు తాఁకినను మువ్వురి తలల నెగురవేసెదను.

నాలుగవ :—నేను మొదటఁ గోరితిని.

జవ్వని :—బాగుబాగు నే నేమి చెప్పగలను.

నలుగు రాశ్వికులు :—మాలో నెవ్వరిని వరింతువు ?

జవ్వని :—కడుఁ జిక్కని స్వయంవరము కాదా యిది. నే నొక్కర్తెను.

మూఁడవయాశ్వి :—నన్నుపేక్షించుటకే చెలికత్తె వెంట లేదనియా ?—నాది పశ్చిమ ఖండము. నేనే చెప్పుచుంటి నని సిగ్గుపడకుము. నాయది భోగభూమి. ఐహిక సౌఖ్యపరమావధి. అట సూర్యుఁడైనను దీక్ష్ణముగా వెలుగబోఁడు.

నాలుగవయాశ్వి :—చాలు. చాలు. వాని దేశము వట్టి చలిముద్ద. కుంపటి నొడుకుఁ గట్టుకొని తిరుగవలెను. నేను నలు పైనను నాయది సువర్ణ ఖండము. వింతవింత పుష్పములు—చల్లనివనములు—తియ్యనిపండ్లు...

మొదటియాశ్వి :—వట్టిబూటకములు. వానిదేశ మగ్నిగుండము. వానిప్రజ లనాగరికులు. మృగప్రాయులు. మా దేశము చూడ వేడుకగు దేశము. నేలయంతయు సదా వెండి రేకులతో మలామాచేసి నటులుండును. నేఁ బొట్టివాఁడ నని యెంచకుమా ! సూర్యుఁడైనను మాతలదాఁటి పై కెన్నఁడును జేరఁ నేఁడు. ఆఋతుమానము లోక రీతిగఁ జేయుటవల్ల భూమి నంటియె బంతివలె మా దేశమునట్టును బ్రదక్షిణము చేయుచుండును.

రెండవయాశ్వి :—నిజమె అవి యన్నియుఁ జూడదగిన దేశములే. నాయది పృథ్వీమండలమున నివాసయోగ్యమైన కర్మభూమి. సుజల, సుఫల, మలయజశీతల, సస్యశ్యామల.

జవ్వని :—తన మెడలోని రత్నహారమునుదీసి చేతులతోఁ బట్టుకొని " ఈహార మెవ్వరికంఠ మలంకరించునో జన్మాంతరమున నైనను వాని సేవలఁచి వాని దేశమున వసించుదానను," అని తలవంచి చెప్పుచు

సవిలాసముగ నా హారము నంతరిక్షమున కెగుర వేసెను. పాలిపోవు చున్న పండువెన్నెలలోఁ దళుక్కున మెఱసి రత్నహారము పైకెగసెను. తోడనే యాయువకులు మాత్సర్యమున నొండరులపై ఖడ్గములు దూసిరి. నల్గురియువకుల శిరములునుగూడ దానివెంట నంటి పైకెగరి క్రిందఁ బచ్చికపైఁ బడి దొర్ల సాఁగెను. చేతులందు రక్తము కారుచున్న కత్తులుండ నాలుగు మొండెములుకూడ నేలపైఁ బడి కొట్టుకొనుచు ముత్యములఁబోలు మంచుబిందువులతో నలంకరింఁబడిన పచ్చిక నేలను గన్నుచెదరు నెఱ్ఱని రక్తము మడుగులుకట్టఁ దడుపుచుండెను. అఱువదినాలుగు మణులతోఁ గూర్పబడిన రత్నహారము డొంకలనడుమ నన్నజాజితీవతో నెమ్మికలిసికొని నేలఁబడక నిలిచియుండె. ఆత్రిజగన్మోహిని—దివ్యసుందరవిగ్రహము—మంచిసీటిపై దేలియాడెడు మంచుబిళ్లవగిది యచ్చటిప్రకృతిలో లీనమైపోయెను.

బల్లునఁ దెల్లవాఱెను. నిర్మలవినీలాకాశమున నుదయభానుడు వెలుఁగుచుఁ దన వేయికరములతో భూమ్యాకాశముల బంగరుపూఁత పూయుచుండెను. కొన్నిగడియలక్రిందట నాస్థలమున నాలుగు నరహత్య లేకత్రుటి నొకనారీమణికై జరిగె నని యెవ్వరును నమ్మజాలరు. అంతయు మేల్కాంచిన వెనుక కలయొ కల్లయో నిజమో యను సందేహము కలుగునటు లున్నది. కాని నేలఁబడియున్న నాలుగు మకుటములును, నాలుగుశిరములును, నాలుగుమొండెములును, నరవధ నిజ మని నచ్చఁజెప్పుచున్నవి. దూరమున నన్నజాజిలతలఁ దగుల్కొని వ్రేలాడుచున్న యఱువదినాలుగు రత్నముల సరము తన్ను ధరించిన లతాకుసుమ సుకుమారి యగు సుందరి యుండెనని నిదర్శనముగా నున్నది. కాని యిప్పుడంతయు నిర్మానుష్యము. నిశ్శబ్దము భూదేవి తొలికాను పగు వృక్షలతాగుల్మాదులే నాఁటి యుదయమున నిట్టటు లాడుచుఁ బడుచు లేచుచు నల్లారుముద్దుగఁ దోఁచుచుండెను.

౨

నరునికన్నులు భూమికి మిక్కిలి చేరువగనుండుటచే దాని నిజస్వరూప
మును బ్రత్యక్షము చేసికొనఁ జాలకున్నవి. పుడమి చాపఁవలె బఱచి
నట్లు కనఁబడుచున్నది. కాని చంద్రమండలము దూరమున నుండుటచే
దాని వర్తులాకారము సులభముగఁ బ్రత్యక్షమగుచున్నది. సంసార
మునం బడి వెనుకముందు కీసులాడుచుఁ గష్టసుఖముల మునిగి తేలు
చుండెడివాడు నిర్మలదృష్టితో లోకతత్త్వము సమగ్రముగ గ్రహింపఁ
జాలఁడు. కావుననే పూర్ణతత్త్వజ్ఞానాభిలాషులు లోకసామాన్యము
నుండి దూరము చని యేకాంతారణ్యమధ్యమున నుండియో యేయున్నత
పర్వత గుహాగర్భమునుండియో, తత్త్వము తెలియ ధ్యానము చేయు
చుందురు. ఎవరు నీవు? యని యడుగఁగనే నాపేరుఫలానా యని
లోకములో సాధారణముగా నెల్లవారును దెల్పుచుందురు. కాని
యొకనాఁడు శ్రీరాముఁడు వసిష్ఠులవారి యాశ్రమమున కరిగెనఁట.
ఆ పర్ణకుటీరము తలుపు లోన గడియవేసికొని ముని జపముచేసికొను
చుండెను. రాముఁడు తలుపు తట్టెను. వసిష్ఠుఁడు "ఎవరు వా"
రనెను. అప్పుడు శ్రీరామచంద్రుఁ డేమనెను? "మహాత్మా ఆసంగతి
తెలిసికొనఁగోరియే మీసన్నిధికి వచ్చితి" నని బదులు చెప్పెను.
మన కన్నులకే చెట్టు లిండ్లు నావులెటుల నిస్సంశయముగఁ గనుపించు
చున్నవో, ఋషుల దృష్టిపథమున నఖిలంబునకు మూలము పునాది
బీజమునగు సత్యము సదా నిశ్చలముగ నిలిచియుండును. ఆ దివ్యసత్య
ప్రకాశమున భూతవర్తమాన భవిష్యత్తుల నన్యోన్యమును బంధించి
యుంచుకారణపాశపరంపరలు స్పష్టముగ నుద్యోతక మగుచుండును.
ఈవిశాలబహుజీవ సంకీర్ణవిశ్వములో మానవునిస్థానము, వానికిని
నన్యజీవులకును గలసంబంధము మానవుని గమ్యస్థానముఁగూడ, ఋషు
లకు నిస్సందేహముగఁ గనఁబడుచుండును. వినఁబడుచు సర్వదా

శాంతి ప్రబలి యుండును. కావున నేఁడును ఋషివాటికలకు రాజుండడు. న్యాయస్థానము లుండవు. ప్లీడర్ల యవసరము లేదు. జబు లధికారులు పోలీసుఠాణా బనిలేదు. తహశీల్దారువచ్చి పన్నులు వసూలు చేయరు. నిర్బంధకశాసనముల నచ్చట నెవ్వరు నమలులో పెట్టువారు లేరు. అయినప్పటికిని వందలకొలఁది వేలకొలఁది ఋషులు కుటీరములు నిర్మించుకొని దార పుత్త్రాదులతో సుఖముగ శాంతముగ వన మధ్యమునఁ గాపురము చేయుచుందురు. ఏదినమున కాదినము పుత్త్రుఁడో లేక శిష్యుఁడో తలయొకమూఁడు గుప్పెడుల నివరిధాన్య మునో లేక క్రిందరాలినపండ్లనో లేక కందమూలములనో సమిత్కు-శాదులతోఁ బాటు సేకరించుకొని వచ్చును. ఋషిపత్ని నాఁటికి వానినే పచనము చేసి దేవతలపాలు దేవతలకు, నతిథులపా లతిథులకును వేఱుపఱచి తక్కినది భోజన సమయమునకు సిద్ధపఱచును. ఈలోపునఁ కూఁతురు పెంచుచున్న లేడిపిల్ల యాధాన్యము తినివేయుచుండుటఁ జూచియు దానినెవ్వరుఁ గొట్టరుకద! హోమద్రవ్యముల కొఱకొక ధేనువుగూడఁ బ్రతిపర్ణకుటీరము పంచను బెంచఁబడును. ఋషిబాలిక లక్కచెల్లెండ్రవలె మక్కువతో ననుదినము దేవతార్చన కొఱకేర్పఱుపఁబడిన పూలమొక్కలను గడవలతో నీరు తెచ్చి పోసి తడుపుచుందురు. ఎచ్చటఁ జూచినఁ బ్రేమ యానందము నిండి నిబిడీకృతమై ద్వేషాహంకారములకుఁ జోరఁ జోటీయకుండును. వృక్షపాదమున కూర్చుండుటకై విశాలముగ మట్టితో నరుగులు కట్టఁబడిన మారేడు, రావి, మఱ్ఱి, మామిడి మొదలగువృక్షము లచ్చటచ్చట నెన్నియో కలవు. వానిపచ్చనియాకు లన్నియుఁ గమ్మనిహోమధూమములచే నించుక నొగబాఱి యుండెను. ఆ చెట్లక్రిందఁ దిన్నెలపైఁ గూరుచుండి ఋషులు శిష్యులకు వేదశాస్త్రములు పాఠము చెప్పుచుందురు. అటకు సమీపముననె గంగానది హిమవత్పర్వతములలో నుండి క్రిందకు దిగి సన్నముగా వడిగాఁ బ్రవహించుచున్నది. అరు

ణోదయ కాలమున ఋషివాటిక యంతయు స్నానజపాదు లొనర్చు చుండఁ జూచినయెడల నెంతటిపాపకర్మున కైనను హృదయము మాఱి పవిత్ర మగును ఈ భూలోకమున నెచ్చట నేని యనాధశరణాలయ మున్నచో నది ఋషివాటికయే యని తెలియ నగును. ఈ యనాధ శరణాలయము లక్షలకొలఁది రూప్యములు కర్చుపెట్టి నిర్మించినది కాదు. అమూల్యమగుసాత్త్వికగుణశక్తిచే నది నిర్మితము. ఒక్క మానవునికొఱకే యేర్పడినది కాదు. ఎనుబదినాల్గుకోట్ల జీవరాసుల కిందు శరణ్యము కలదు. వేటకాని బాణము వేడి నీ యాశ్రమప్రాంతమున దగుల నేరదు. కిరాతునివల యీపరిసరముల నెచ్చటను బక్షులఁబట్టదు. పిల్లి చిలుకను జంపదు. కుక్క పిల్లిపై కురుకదు. పులి లేడికిచన్నిచ్చును. ఏనుఁగు సింగముజూలు నిమురును.

అట్టి యీ ఋషివాటికలో నొకనాఁడు శారదరాత్రియందు షోడశ కళాపూర్ణుఁడై పున్నమచంద్రుఁడు గగనమార్గమునుండి రజతతుల్య చంద్రికామృతము చిక్కఁగఁ గురియుచుండెను. బహుసస్యతరులతో నిండినపృథివి శుభ్రజ్యోత్స్నాపానమున నెంతయు సేద దేర వికాస ములో వెలయుచుండె. అట్టియెడ నొక పర్ణకుటీరము ముంగిట వెన్నెలలోఁ బచ్చికొబ్బరిచాపపైఁ గాషాయవస్త్రము పఱచి యొక తెల్ల గడ్డపు ముసలితాత దానిపై నడుము వాల్చియుండెను. పదియేండ్లలోపు బాలుఁ డొకఁడు చనువుగా వచ్చి యా తాత పజ్జను గూర్చుండెను.

తాత :—ఏమిరా నీవు మునుపటివలెఁ గాక నీతోడివారలపై నధికారము చేయుచుంటివఁట! అందఱును సమానముగఁ సోదరులవలె నుండవలెను. గాని యిట్టిది తగునా?

బాలు :—లేదు. తాతయ్యా, మామూలుగనే యీ వేళ నందఱము కలసి సమిధలకై పోయితిమి. నేనొక చెట్టుచివర కెక్కి తిని. మన "వెయ్యితుమ్మల" కవ్వలనుండి యెవ్వరో గుఱ్ఱములమీఁద

బట్టపగలు కాగడాలు పట్టుకొని విచ్చుకత్తులతోఁ బలుగు పలుగున
పోవుచుండుట జూచితిని. వారి వేషములు చాలవికృతముగ నున్నవి.

తాత :— కనుక,

బాలు :—అందఱును దిగండి, దిగండి, పదండి, మాతమేదో
దండు నడుచుచున్న దన్నాను. అనుగుకొమ్మల మీఁది వారికిది
యేదియుఁ గనఁబడలేదు. నేనబద్ధము చెప్పితి నన్నారు. నేనబద్ధము
లాడుదునా? యని పట్టరాని కోపము వచ్చి యుండఁటను క్రిందకు
దిగిన వెనుక నెల్లవారిని పట్టుకొని కొట్టితిని. నాది తప్పా?

తాత :—( చిఱునగవుతో) లేదు. లేదు. రాచబిడ్డకుండవలసిన
పౌరుషము చూపితివి.

బాలు :—అందొకటి. అందఱు నన్ను నామకుఁ డనుచున్నారు.
నాకు సరియైన పేరు లేదఁట. ఆమాట విన్నపుడు నాయొడలు మండు
చుండును. నేనెవరిని? నీవిప్పుడు చెప్పవలెను. ఊరక తాత యని
పిలుచుటయే గాని నాకేమియుఁ దెలియుట లేదు. నాతల్లి యెక్కడ?
తండ్రియెక్కడ? అందఱు నిది నాకు మాయమ్మ యిచ్చిన దని
యేదో యొకటి నాకు జూపి ఊరించు చుందురు.

తాత :—( ఇంచుక గొంతుక సవరించుకొని ) నాయనా!
ప్రభాకరా! చాలరాత్రి యయినది. ఇంకను నీకు నిద్ర వచ్చుటలేదా!
సరే చెప్పెదను. విచారింపకుమా తండ్రీ! నీవెందు నెవ్వరికిని దక్కు
గాదు. నీవు సూర్యాంశసంభూతుఁడవు నీ తండ్రి సర్వలోక బాంధవుఁ
డగు పరమపావనుఁడు. ఆదిత్యుఁడు. ఈ పృథివియం దార్యావర్తము
కర్మభూమి. కావుననే పుణ్యభూమి. చాలకాలమునుండి మహర్షులును
మహాయోగులు నీ దేశమును ధర్మప్రవర్తకులై కాపాడుచుండిరి.
కాని క్రమక్రమముగ జనబాహుళ్య మధిక మగుచున్నది. శత్రు
భయము వృద్ధి యగుచున్నది. ఇట్టిచోఁ గేవలము కైవల్యపదవిఁ
గోరుచున్న సర్వసంగపరిత్యాగులకు సదా లౌకిక వ్యాపారము లంద

నిమగ్నులై యుండుట భారముగఁ దోఁచుచున్నది. కావున ధర్మపరిపాలనావిధి వేఱొకని భుజములపై నిడి తాము ధర్మోపదేశికులుగ నుండుట సర్వవిధముల యోగ్యమని యెంచి అట్టిపురుషుని గోరి యా మునులు గంగాతీరమున మహాయాగము సంకల్పించిరి. ఆ యాగము పూర్తియైనది. వారవభృథస్నాన మొనర్చుచుండగా నిన్నుఁ దన గర్భమునఁ దాల్చి యొక పెద్ద తమ్మిమొగ్గ మాలోనికి నీటివేగమునఁ గొట్టుకొనివచ్చినది. అప్పుడే తూర్పుదిక్కునఁ బ్రభాకరుఁ డుదయించి తన పుత్రుని మే మెటుల గారవించెదమో యని చూచుచుండెను. నేనె యాపద్మమును జేతఁబట్టికొని విప్పి చూచునరికిఁ జిన్ని బాలుఁడవు నీవందుఁగనఁబడితివి. అప్పుడే దత్తస్వీకారమునకు సాక్షి యైయున్న ప్రభాకరుని నామముననే నిన్నుఁ బిల్చుచుండుటకు మే మంగీకారము చేసుకొంటిమి. ఇది నీ జన్మవృత్తాంతము. తరువాత నా దివ్యభగవానుని యంశచే నీ వాపద్మమునందే జననం బయితివని మాకుఁ దెలియవచ్చె.

బాలు :—నేఁ డుదయమున నాకంటఁబడిన క్రూర మగు దండెవ్వరిది? ఆ మండుచున్న కాగడాలతో నెవరి కొంప ముట్టించెదరో? యీ దేశమును వారె పాలించుచుండిరా? ఇఁక మఱి పాలింతురా?

తాత :—ఈ లోకమున నింతవఱకు సుస్థిరసామ్రాజ్య మొక్కటియు నేర్పడి యుండలేదు. ప్రస్తుత మంతటను నేఁ డొకఁడు తేపొకఁడుగనున్నది. కావుననే లోకము—అందు ముఖ్యముగా భరతవర్షము—ఆర్యావర్తము—సామ్రాట్టుకొరకు పరితపించుచున్నది. కాని నీకు నేఁడు రాజ్యవిషయమై యింతగఁ గావలసివచ్చుచున్నదే?

బాలు.—ఆ యశ్వపుదళమును నేను బాఱిదోలలేనా? కాని తాతా! అందఱకన్ని ప్రశ్నలు చెప్పుచుందువు. నాకొక ప్రశ్న చెప్పెదవా?

తాత :—[స్వగతము] అదృష్టము బయటపడుచున్నది. మహాయోగము, రాజయోగము పట్టనున్నది. మా తపము ధన్యంబయ్యెను. [ప్రకాశముగ] అడుగుము ఏమడిగెదవో చూచెదను.

బాలు:—మనయుది భరతవర్షము కదా? ఇందు సుస్థిర సామ్రాజ్య మెవరు స్థాపించి పాలింతురు?

తాత:—పట్టుమని పదేండ్లు లేవు నీకిప్పు డావిషయము కావలెనా?

బాలు.—పోనిమ్ము అడుగకూడనిచో మఱియొకటి చెప్పుము. ఈపైన మినుకుమినుకు మనుచున్న గ్రహములు ఈక్రిందిభూమిపై జరించుచున్న నాయొక్కయు నీయొక్కయు జీవితము నిర్ణయించి నడిపించుచుండు నని చెప్పితివికదా! అది యెట్లు?

తాత:—నీ వడుగరా దనలేదు. దాని కేమి? చెప్పెదను. శ్రద్ధగా వినుము. స్వారాజ్యలక్ష్మి భూలోక సంగ్రహార్థమై నుండుగ నవతరించెను. ఆలక్ష్మిస్వయంవరమునకు నాలుగు దిక్కులనుండియు రాజు లేతెంచిరి. ఆమె తన కంఠస్థమైయున్న రత్నహారమును బైకెగుర వేసి యది యెవ్వనికంఠ మలంకరించిన వానిని జన్మాంతరము నందైనను తప్పక వరించెద నని బాస చేసెను. తనయెదుటి వానికంఠమున నెక్కడఁబడునో యారత్నహార మని ప్రతిమనుష్యుఁడును దనయెదుటి వానితలఁ ద్రుంచెను! ఇట్లేక కాలమునందే పలుగురి శిరములు నేలఁ గూలెను.

బాలు:—ఛాలఁ జిత్రముగ నున్నది. మఱి యారత్నహార మేమైనది లక్ష్మియెవరిని వరించి యున్నది.

తాత:—(నవ్వుచు) నీకొఱకై వేఁచి యున్నది. ఎవ్వరిని వరింపలేదు. నీ వారత్నహార మెచ్చట నున్నదో గ్రహించి కంఠమున దాల్చుకొనగలవా?

బాలు:—ఆ హార మెచ్చట నున్నది?

తాత:—ఒక వనములో నొకచోట మొగలిడొంకలనడుమ సన్నజాజిలతలను దగుల్కొని వ్రేలాడుచున్నది. ఆహారమున నలువది నాలుగు రత్నములు కలవు. ఒక్కొక్కరత్న మొకవిద్య. అందు

నాయకమణిగ నున్న వజ్రము బ్రహ్మజ్ఞానముతోఁ గూడిన కర్మయోగము. త్రేతాయుగమునందలి జనకుఁడు దానికధిష్ఠాత. ఆ మణిహారము నెవ్వరు స్థిరముగ నిడనాల్గురో వారి నీ సామ్రాజ్యలక్ష్మి తప్పక వరించి యనుసరించును. ఎల్లవారికి యజ్ఞాధికారము లేనటులే ప్రతిమనుష్యుఁడు నా మణిహారము ధరించుట కర్హులు గాఁజాలరు. నిష్కళంకము నీతియుక్తమునగు సత్ప్రవర్తనము నిక్కిలి యవసరము. జాతి కులధర్మముల కట్టి సాంకర్యము కలుగకుండఁ గాపాడుకొనుచుండవలయును."

పదిసంవత్సరములు పూర్తిగాలేని బాలకుఁ డీయుపదేశ మెంత వఱకు గ్రహించెనో యూఁడవలయు. తొల్లి గర్భస్థుఁ డైన ప్రహ్లాదుఁడు నారదోపదేశంబున హరిభక్తశిఖామణి యయ్యెను. తల్లియుదరమున నుండియే అభిమన్యుఁడు తండ్రి యుపదేశమునఁ బద్మవ్యూహాభేదనా కౌశలము గ్రహించె. కావున నందఱకును వయసుతోఁ బనిలేదు. అయినను నిజము నిలకడమీఁదఁ దేలఁ గలదు.

బాలు:—తాతా! జాతికులధర్మము లంటివి. అవియెట్టివి? అన్ని దేశములలో నిట్టిధర్మములు లేవా? ఈశ్వరుఁడే మానవకోటి నంతను సృష్టించె నందువుగద? ఈశ్వరుఁడు నిష్పక్షపాతి యనికూడఁ జెప్పుచుందువుగద.

తాత:—(సానందముగ స్వగతము) ఏమి! యీ బాలకుని వాదము. (ప్రకాశముగ) వర్ణాశ్రమధర్మము లీజాతి వ్యక్తిత్వమునకు లక్షణము. మానవజాతియంతయు నొక్కటే గోజాతియంతయుఁగూడ నొకటే. కాని గోజాతియందువలె మానవజాతియందును యంతర్భాగములు పెక్కులు గలవు సగుణబ్రహ్మము త్రిగుణాత్మకము. సత్వరజస్తమోగుణములు మూఁడు.

బాలు:—ఉపమానమే సుబోధకమగుచున్నది. తెలిసినది. ......ఎంతనిశ్శబ్దముగనున్నది. (యించుక ప్రక్కకుఁజూచి) వెన్నెల రంగు తాతా! తెలుసా? ఎఱుసా?

తాత :—తెలుసే.

బాలు :—ఆ మఱ్ఱిపై నుండి యెఱ్ఱని వెలుఁగగుపడుచున్న దేమి ?

తాత :—(అటుచూడకయే) ఏదేని యడవి తగులఁబడుచున్నది కాఁబోలు—పులులు సింహములు నొకవేళ చెదరి పఱుగెత్తుకొని వచ్చునేమో నీవు లోనికిఁబోయి పరుండుము. రెండుజాములు తిరిగినది. నక్షత్రమిదిగోఁ ప్రక్కకు వ్రాలినది.

బాలు :—అదిగో పొగకూడఁ జేరువగ వచ్చుచున్నది. జనుల సందడియగుచున్నది. అయ్యో స్త్రీలు ! బాలురు ! ఏడ్పులు బొబ్బలు వినవచ్చుచున్నవి. చూడు మిదిగో యెవ్వరో గుంపులుగుంపులుగ నిటుఁ బఱుగెత్తుకొని వచ్చుచుండిరి.

తాత :—[తటాలున లేచి నిలువఁబడి] ఎవరో రాక్షసులు ఋషివాటికకు నిప్పంటించిరి. అందఱు చెల్లాచెదురై పారిపోవుచున్నారు. ఇక్కడ నిలుచుటకు సమయము కాదు."

ఇంతలో ఋషికుటుంబములు మండుచున్న కుటీరములు విడిచి తాటియాకు గ్రంథములు నెత్తినిఁబెట్టి మోసికొని పఱుగెత్తుకొనివచ్చి ప్రభాకరుని వనము జేరిరి.

ఒకముని :—అన్నా ! యేమి మనగతి.

తాత :—మన కేమి ? వనాంతరము చూచుకొందము.

ఒకశిష్యుఁడు :—గురూ ! యవనుఁడు నా నెత్తిమీఁద పుస్తకములకు నిప్పంటించెను. మండిపోవుచున్నవి. నాతల వెండ్రుకలుగూడ కాలిపోవుచున్నవి.

ఇట్లు కేక లిడుచుండఁగనే గాని శిష్యుఁడు గ్రంథములు క్రిందఁ బెట్టఁడుగద ! ఏమి శిక్షణ ! సైన్యాధిపతియాజ్ఞ సైనికుఁడింత విధేయతతో నిర్వర్తించునా ? కాని యా గురువు వేఱొకచోట యవనునిచే దెబ్బతిని ప్రాణములు విడిచెను.

ప్రభా:—"భయములేదు గర్గా! పాఱిపోకు జాబాలీ! అత్రీ! అగస్త్యా! నా మాట వినిపించుకోరేమి? అమ్మా శత్రువు నరికట్టెద మఁడలకుఁడు."

కాని యవనాశ్వికదళము పఱుగెత్తుకొని వచ్చుచున్నది. ఋషులు సకుటుంబముగ వనాంతరమ్మునకుఁ బఱుగెత్తుచుండిరి. ప్రభాకరుని వాక్యము లెవ్వరును వినఁజాలకుండిరి. అందఱు నాస్థలమును వదలి వేయుచుండిరి. చెట్లయాకులు జవ్వుమని కాలిపోవుచున్నవి. పెళపెళా రావములు. చిటపటలు. నిద్రనుండి యులికిపడి పక్షులన్నియు లేచిఁ యాకసమున నిరాశ్రయములై వలయములు తిరుగుచు వాపోవు చున్నవి. మృగములన్ని దిక్కులకుఁ బఱుగెత్తుచున్నవి. పైకప్పు గోడ లోనికిఁ గూలి నేలపై నాలుగు గోడలమధ్యను మండుచున్నది. అంతయు దట్టముగ పొగ యలముకొన్నది. కంటికేమియుఁ గనపడుట లేదు. నాశన చిహ్నములగు భయంకరధ్వనులు మాత్రము చెవులకు వినవచ్చుచుండెను. ప్రభాకరుఁడు మాత్రము వెనుకడుగు వేయలేదు. అందఱుఁదన్ను విడిచిపోయిరనికూడ నాతనికిఁ దెలియదు. పొగ యంతదట్టముగ నున్నది. చేతనొక దండము ధరించి శత్రుసంహారమున కెదురుచూచుచుండెను. కట్టకడనున్న హోమధేనువుల మెడత్రాటిని విప్పినవారు లేరైరి. పొగయించుక తగ్గుచున్నది. ప్రభాకరుఁడు తోడన చావ మిగిలియున్న గోవులను లేగలను విప్పి సంరక్షించు చుండెను. ఇంతలో యవనదళ మరుగుదెంచెను. ఇంక నెవ్వరైన నా ప్రాంతమున ప్రాణములతో మిగిలిరో లేక వారిశాస్త్రము లెవ్వి యైన దొరకునేమోయని యవనులు ప్రతిస్థలమును వెదుకుచుండిరి. తల్లి వెనుకఁ దానుగూడ బఱుగెత్తఁ దొందరతో గింజుకొనుచున్న లేగమెడ త్రాఁటిని బలమంతయు వినియోగించి విప్పుచున్న ప్రభాకరుఁడు వారి కంటఁబడెను. వెంటనే వా రాతనిఁ బట్టుకొనుటకు వేగముగ మీఁదికివచ్చిరి. తోడనే బాలకుఁడయ్యును జంకక, యొక

కట్టుకొనియు నూఁచఁబెఱికి వారిమీఁదికెత్తెను. రెండవచేతితోఁ గన్నెఁ త్రాఁడు పుచ్చుకొని యువనుఁడెక్కిన గుఱ్ఱముముఖపై గట్టిగఁ గొట్టెను. ఆ దెబ్బతో గుఱ్ఱము తన ముందుకాళ్ళను రెంటిని పైకెత్తి త్రొక్కి వేయవలెనని ముందునకు వచ్చెను. ఇంతలో మఱియిద్దఱు యవనయోధులు గుఱ్ఱములఁ దిగివచ్చి వెనుకనుండి వానిని బట్టుకొని కాలుచేతులు కట్టివేసి తమ నాయకునియొద్దకుఁ గొంపోయిరి. "ఓరీ నీ వెవరు?" అని నాయకుఁడు యవనభాషను బ్రశ్నించెను. బాలుఁ డుత్తరముచెప్పక నిరత్తృయముగఁ జూచుచుండెను. అంతట యవన యోధులు బాలుని ధైర్యసాహసములు తాము చూచినది చూచి నట్లుగ వర్ణించి చెప్పిరి. అంతట నాసంఘములో నున్న యొక యార్యుఁ డీవలకువచ్చి "ఓరీ! బాలక నీ వెవ్వరని యవన ప్రభువు లడుగు చున్నారు." అని సంస్కృతమునఁ జెప్పెను.

ప్రభా:—నే నెవ్వరినో చెప్పెదను గాని మీ రార్యులు కారా?

ఆర్యు:—ఆర్యుఁడనే. దాని కేమిగాని నాయకుఁ డడిగిన ప్రశ్నకు జవాబు చెప్ప వేమి? లేనిపోని పెంకెతనము చేయక వినయ ముగ మాటలాడి ప్రాణముఁ దక్కించుకొనుము. కుఱ్ఱవాఁడవు. ఇంకను బదికాలములపాటు బ్రదుకదలఁచినవాఁడవు.

నాయ:—ఆర్యా? వదు త్తరము చెప్పుట కిచ్చగింపఁడా?

ఆర్యు:—బాలకా? నాయకుండుకోపము చెందుచుండిరి. వెంటనే సవినయముగ సమాధానము చెప్పికొనుము.

బాలు:—నన్ను ప్రభాకరుఁ డందురు. నాయ దీయార్యా వర్తము. నే నార్యుఁడను. నా తాత యీరాజమాన్యముక్రిందట నీ వాటిక నేఁటివరకు సుఖముగ నున్నది. కాని నేను వచ్చి దానిబుగ్గిచేసిన యీనాయకుఁ డెవ్వరో యేల దానిని ధ్వంసము చేయవలసివచ్చెనో నాకుఁ దెలియదు. ఆసంగతి నే వినఁగోరుచుంటిని.

ఆర్యు:—ప్రభూ! పిఁడిచ్చటియొక ఋషిపుత్రుండు బాలుఁడు అజ్ఞుఁడు తెనిచోఁ దామెవ్వరని భయములేక యడుగ సాహసించునా?

మీరుమిక్కిలి యీవాటికను బుగ్గిపాలుచేసిన కారణముకూడఁ దెలియ వలెనఁట. వాఁడు కుఱ్ఱవాఁడు. క్షమింతు రని నాప్రార్థన.

నాయ:—"బాలకా! యిటురమ్ము. వానిబంధములు ఛేదింపుడు" సేవకు లట్లు చేసిరి, ప్రభాకరుఁడు గంభీరసింహగమనముతో నాయకుని సమీపించెను. నాయకుఁడు వచ్చియు రాని సంస్కృతంబున బాలునితో నిట్లు ప్రసంగింపఁ దొడఁగెను.

నాయ:—నిన్నుఁ జూచిన నాకుఁ జాలవిచారముగ నున్నది. నీవయ సెంత?

బాలు:—నాకుఁ బదియేండ్లు నిండలే దన్నాఁడు మాతాత. నను వీ రేల కట్టిపెట్టిరి? మా వారికుటీరముల నేల మంటఁగలిపిరి? మీ రందఱెవరు? మిమ్ముల నెవ్వరీపని చేయుమనిరి? ఇట్లు చేయుట వలన మావా రందఱెక్కడకో చెల్లాచెదరై పోయిరి కద. తల్లిదండ్రులఁ గానక బిడ్డలు చెట్లక్రిందఁబడి యిప్పుడెట్టుల నేడ్చుచుండిరో? వారిని వారితలిదండ్రులకడఁ జేర్చువా రెవరు? ఇంతమంది యుంటిరి కదా! వెంటనేపోయి కొందఱీపాటి యుపకారము చేసిపెట్టరాదా! నేనే వెళ్లి యాపని చేయుదును గాని వీరు నాకాలు సేతులు గట్టిరి. గట్టుటలో నా రెండుగుత్తులు నా రెండుమణములు బెణికినవి. వీరు నన్నెందులకుఁ గట్టిరి.

నాయ:—నీవు వారి గుఱ్ఱమును ద్రాఁటితో గట్టిగఁ గొట్టితి వఁటకాదా? దాని కంటివెంట నూరక నీ రెట్లు కారుచున్నదో చూడుము.

బాలు:—ఆవిరిఁబట్టి బట్టతో నొత్తిన వెంటనే కట్టును. (అని తన పైబట్టతీసి యొత్తబోవుచుండ)

నాయ:—అక్కరలేదు. ఆపని వారు చూచుకొందురులే. కాని నీవు దానిని మొదట యెందుకు కొట్టితివి?

బాలు:—నేను మొదట కొట్టలేదు. వారే మొదట మా ఋషిపల్లెకు నిప్పుపెట్టిరి. అప్పుడుగూడ మావారు మీమీఁద దిరుగఁబడ

లేదు. శాంతముగ స్థలమును విడిచి వేటాకపోటికిఁ బోవుచుండితి. వారు గ్రంథములు నెత్తిమీఁదఁ బెట్టి మోసికొని పోవుచుండగా మీలో నొకఁడు నెత్తిమీఁది పుస్తకములకు నిప్పు పెట్టెనఁట. పాపము! వాని తలవెండ్రుకలుగూడఁ గాలిపోయెను. ఈ దుండగము చూచి నేను మిమ్ముల నరికట్టుట కంపతి నాఁగు మంటి. కాని మీవారు మీతోఁ జేయిచేసికొనుట కిష్టపడలేదు. సరే పోనిమ్మని నేనావులు దూడలు మంటలోఁ బ్రాగ్గిపోకుండ విప్పుచుండఁగ నన్నుఁ బట్టుటకుఁ బదిమంది కలిసి వచ్చిరి. అదు దానివలె నేనప్పుడు వాపోదునా! చేత నున్న త్రాఁటితోఁ గొట్టితిని. అనమయమునఁ జేతకానివారివలె నక్రమముగ వెనుకనుండి వచ్చి నన్నుఁ బట్టుకొనిరి. నాయుడు తప్పా! ఇదంతయుఁ జేయుట మీకిష్టమా? మీరే యీ పాపముల నన్నిఁటిని జేయించితిరా?

ఆర్య:—పిట్టకొంచెము కూఁత ఘనముగా నున్నదే.

నాయు:—సరే జరిగినదేమో జరిగినది. నీవు చాలఁ దెలివిగల వానివలెఁ గనఁబడుచుంటివి. ఇఁక ముం దేమిజరుగ నున్నదో గ్రహించితివా?

బాలు:—నాకుఁ దెలియదు. యేమిజరుగును?

నాయు:—మేము యవనులము. మీకు శత్రులము. మీ యార్యావర్తముపై దాడివచ్చితిమి. ఇప్పు డార్యావర్తము మా వశమై యవనాక్రాంతమైనది. మీ దేశమునుండి ధనము విద్య మాకు బ్రతి వీరులై నిలచిన శూరులను మా దేశమునకుఁ దీసికొని పోవుచున్నాము. నీవు మా వీరులతో నెదుర్కొని పోరాడితివి. కనుక నీవు వారిచేఁ గట్టబడితివి. ఇప్పుడు నీవు మాఖైదీ వైతివి. ఇదిగో నీ యార్యుఁడు మమ్ములనే శరణుజొచ్చెను. మాకు సాయముఁ జేయుచుండెను. ఇతని యెడ మేము కృతజ్ఞులమై యుందుము. సమయము వచ్చినపుడు ప్రత్యుపకార మొనర్చెదము నిన్నుఁ జూచిన, నాకు జాలియగుచున్నది. విజ్ఞపీగి

యీ మరణాంతము చెఱసాల నేలయుండెదవు. నీవు చేసిన తప్పిదము నకు క్షమార్పణ చెప్పికొని నీ యార్యావిపత్తిచే నీవు స్వమ్ముత్ర శరణు జొచ్చినచో నిన్నుఁగూడ బందినుండి విముక్తునిఁ జేసెదము. గౌర వించెదము. సమయము వచ్చినపుడు ప్రత్యుపకారము జేసెదము. నీవు బుద్ధిశాలివి. ఒకవేళ నీవే యార్యావర్తమునకుఁ బట్టభద్రుఁడవు కావచ్చును. ఆలోచించుకొనుము.

బాలు:—మీ దేశముపై బరు లెవరైనఁ నొకవేళ నాక్రమించి దండెత్తి రనుకొనుఁడు అప్పుడు మీరు శక్తిమాత్రము మమ్మెదిరి పోర కుందురా? అట్లు పోరాడకుండుట ధర్మమా? దేశద్రోహము కాదా? మీరు పోరాడిరి కదా యని మిమ్ములను మేము నేరస్థులుగాఁ బరిగ ణింతుమా? అట్లు చేయుటకు మా నీతి యెన్నఁడు నంగీకరింపఁదు. అట్టిచో నా చేసినది మాత్ర మధర్మ మెట్లైనది. నేను క్షమార్పణ చెప్పవలసిన యకార్య మేమిచేసితిని. క్షత్రియునకు దాసోహమనుట క్షత్రియున కధర్మమని చెప్పుదురు. నే నట్టిపని చేయఁజాలను. చేయను. ఏమయినఁ గానిండు.

నాయ:—సరే భటులారా వీనికిఁ దిరిగి సంకెలలు తగిలింపుడు. వీనివిషయమై మహారాజుగారే యోజింపఁగలరు.

భటులు తిరిగి ప్రభాకరునకు సంకెలలు తగిలించిరి.

ఆర్యు:—ఢింభకా! తెగనీలుగుట కట్టిపెట్టు. ఇప్పుడైన నను మించినది లేదు. బ్రతుకుఁ తెరవు చూచుకో. నీవే మహాశూరుఁడ ననుకొనకు. మేమందఱమును గాజులు తొడిగించుకొనలేదు. చూడుము గాజులో—మణికట్టో నీ చేతులకే తొడుగుచుండిరి గాని నా చేతుల కేమియు లేవు. ఇటు చూడు.

ఒక భటుఁడు:—(రహస్యముగ) పాప మతగట్టిగా బిగించ కురా లేతచేతులు.

రెండవ భటుఁడు వదులుచేసెను.

ప్రభా:—(మందహాసముతో) భయము లేదు. మీ కెట్టి శిక్షయైన నన్నే చేయుఁడు.

నాయ:— వీనిని కూడ "పద్మిని" "చంద్రహాసుఁడు" "ప్రతాపుఁడు" మొదలగు వారితోఁ జేర్చి తీసికొని రండు. (ఆర్యుని దిక్కు మొగంబయి) దురదృష్టవంతుని బాగుచేయువాఁ డుండునా?

ఆర్య:—ఎవరి యదృష్టమునకు వారే కర్తలు. నేను కూడ చెప్పి చూచితిని. కుజ్జకారునకుఁ బొగరు పచ్చికాయకు వగరు పొమ్మనినఁ బోదు.

నాయ:—ఇఁక మనము గంగాతీరమును వదలి వెనుకకు మరలి సింధుతీరమున కరుగవలెను.

ఒక్కసారి జయఘోషలు మిన్నుముట్టె. భేరీమృదంగాది వాద్యములు మ్రోసె. హయహేషలు చెలంగె. ఫౌజుబారులుదీరి నిలిచెను. త్రొంటికాలములో గుఱ్ఱపుడెక్కలు కదముచప్పుడు దూరము నుండి వినఁబడుచుండెను. భూమ్యాకాశముల కొక్క తెర వేసినటులు ధూళి క్రమ్ముకొనెను. యవనదళము సింధునదీతీరమును జేరుచున్నది. వెనుక దేశమెల్ల శ్మశానతుల్యము చేయఁబడుచున్నది. ధనమును గొనిపోవుచున్నది. శాస్త్రములను బట్టికొని పోవుచున్నది. చేఁజిక్కినవీరుల నెల్ల బంధించికొని పోవుచున్నది. అన్నిటికంటె ముఖ్యముగ వరప్రసాదుని ప్రభాకరుని గొనిపోవుచున్నది. తెల్లవారిన తరువాత బెంపుడులేళ్ళు తిరిగి వచ్చి మొండిగోడలలోఁ దమ నెచ్చెలు లుండిరేమో యని యాశతో వెదుకుచున్నవి. అనుదినము క్రొత్తనిపచ్చిక చిగుళ్ళు నోటి కందిచ్చెడి ఋషికుమారులఁ గానక మృగశాబకములు బెంగగొని నీరు మేత మాని కృశించుచున్నవి. కొన్ని లేగలు తల్లులఁ గానలేక పాలు లేక చచ్చిపోవుచున్నవి. కాని రెక్కలు కాలిపోనిపక్షులు మాత్రము క్షేమముగ వేఱుస్థలమున వృక్షముల నాశ్రయించినవి. మఱునాఁ డుదయమున గంగాతీరమున స్నానఘట్టమునందు నిశ్శబ్దముగ భయంకరముగ నున్నది. వృక్షతలమందలి వేదిక లన్నియు నలికిన వారును ముగ్గుపెట్టిన వారు లేక కలకలలాడుట తప్పి పాడుపడిన ట్లుండెను.

3

యవనభూమి భోగభూమి అది కర్మభూమి కాదు. అచ్చట నార్యావర్తమునందుఁ బోలె వర్ణాశ్రమధర్మనిర్ణయము మత సాంప్రదాయాను సారముగ లేదు. జను లందఱును సోదరభావమునఁ గలిసి మెలసి తిరుగుచుందురు. ఐహిక సౌఖ్యము వారి పరమావధి. దానికి వలయుఁ బ్రయత్నము లన్నియు దీక్షతో నలిపి యెన్నిగో సౌకర్యములు చేసికొందురు. అచ్చటి స్త్రీలకు ఘోషాపద్ధతి లేదు. పురుషులతో ధారాళముగఁ గలసి మెలగవచ్చును. పాడవచ్చును. నృత్యము చేయ వచ్చును. రజస్వలా వివాహము విధవా వివాహమును దూష్యములు కావు. మద్యమాంసము లెవ్వరికిని నిషిద్ధములు కావు. అది మన దేశముకంటె శీతలప్రదేశము కావున జనులు దీర్ఘశరీరులుగను దృఢకాయులుగను శ్వేతవర్ణులుగను మిక్కిలి సుందరముగను నుందురు.

యవనదేశాధీశుఁ డగుసలకసుందరుఁ డార్యావర్తముపై దాడివెడలి సిన పటాలములతో వచ్చి తన కాపురముండైన యార్యానితో ముచ్చటించు చుండెను.

అలక :— మిత్రమా! కమలాకాంతా! పది సంవత్సరములు కావచ్చినవి. ఎన్నిసారులైన నుప్పెనకెఱటమువలె ముందునకుఁ బోవుటయుఁ దోడనే వెనుకకు మరలవలసి వచ్చుటయు తటస్థించు చున్నదేకాని యచ్చట స్థిరముగా రాజ్యము స్థాపించుట నమకూడ కున్నది. ఏమికారణమో తెలియకున్నది. చాలఁ జిత్రముగ నున్నది.

కమలా :— సైన్యాధిపతు లేమి చెప్పెదరో.

అలక .— వారు చెప్పుట కేమున్నది. సైన్యము నిరాఘాటముగ నెంతదూరమైన బోవుచుండును. కాని యేమిలాభము. యవనుఁ డాభూమిపై నిల్చి యున్నంతకాలము నెవ్వరును సన్యము వేయరు. ఇండ్లలో నున్నపట్టున నుండి కాపురముచేయరు. మే మున్న చోటికిఁ

జట్టును బదిమైళ్లు ఖాళీచేసి లేచిపోవుదురు. ఎవ్వఁడైన నొకరాజు గలఁడేని వానిని జయించిన దేశము లొంగుబాటునకు వచ్చుననిన నట్టి యేలికయు జూపట్టఁడు. అట్టి పరిస్థితులలోఁ జేయవలసిన దేమి? ఆర్యుల నెల్లఁ దలనరకి భరతఖండము మేము స్వాధీనము చేసికొన వలయు. లేదా యమితవ్యయము కాకుండ దోడనే తిరిగి రావలయు కాని యీ యార్యుల నెవరు నడిపించుచుండిరో!

కమలా:—హైందవ సమాజముయొక్క కట్టుపాట్లతిచిత్రములే. దానిని సన్యాసులును, ఋషులును, యోగులును నడిపింతురు. వేదశాస్త్రములు వారికి ప్రమాణములు.

అలక:—అవును నేనటులే వింటిని. వారి కెట్టి యైహిక వాంఛ లుండ వటకాదా? ఎట్లయినను వారిని మనము సామమునఁనో దానమునఁనో భేదమునఁనో వశపఱచుకొనవలసిన దని చెప్పి చూచితిని. కుదరక వారు నయమునను భయమునను గూడ లొంగువారివలెఁ కనుపింపలేదు. వారి శాస్త్రములనెల్ల గొల్లగొట్టి తెప్పించితిని. ఇచ్చట పండితులకు వేతనము లిచ్చి వాని సారము తీయించుచుంటిని. ఈసాధనమున వారిని వారి సంఘమును గూడ వశపఱచుకొనవలెనని ప్రయత్నించుచుంటిని.

కమలా:—బాగుగనే యున్నది. పురుష ప్రయత్నము చేయవలసినదే కాని భారతసామ్రాజ్యము వశపఱచుకొనుటకు...

అలక:—మాయొద్ద నున్న బలము చాలదా?

కమలా:—సామ్రాజ్యము సుస్థిరముగ స్థాపించుట కెంతబలమున్నను జాలదు.

అలక:—మఱి యేమి యుపాయము?

కమలా:—ఉపాయ మొకటి యున్నది—కాని—నేను—

అలక:—చెప్పరానిదా? నాకు ఇదివరలో మన కిరువురినడుమ నెట్టిరహస్యములు లేవను కొనుచుంటిని. రంజని నిజముగ యదృష్ట

వంతురాలనుకొంటిని. ఆపె భరత సామ్రాజ్ఞి యగుననియే తలంచు చుంటిని. నీ వింకను 'కాని' యందువనుకొనలేదు.

కమలా:—మీరు వేఱుగ దలఁపవలదు. నే నాపరమరహస్య మెఱిగింపఁగలను. కాని దానిని నిర్వహింపఁ జాల నని చింతిల్లు చుంటిని. భరత ఖండములో నొక వనములో నొకచోఁట మొగలి డొంకల నడుమ సన్నజాజిలఁతలలో దగుల్కొని మణిహార మొకటి వ్రేలాడుచున్నదఁట. దానిని గంఠమున ధరింపఁగలవాఁడు భరత సామ్రాజ్యమును స్థాపింపఁగలవాఁడగును. ఈవిషయ మాప్రభాకరుని తాత వానికి తెలుపుచుండఁగా నొక రాత్రి నేను వినుట తటస్థించెను. ఆ మణిహార మెచ్చటనున్నదో వెదకింపవలయు.

అలక:—నాకీకథ బహువిచిత్రముగఁ దోఁచుచుండును. ఒక రాతిలో నొక లతలో నొక పువ్వులో నేమేమో మహాత్మ్యమున్నదని చెప్పు కొందురు. ఈవిషయమున నార్యులు పిచ్చివారనియే నా నమ్మకము.

అలకసుందరుఁ డిట్లనుచుండగ నే వేషభూషాలంకృతయై రాజకుమారి యగు రంజని వారికడ కరుదెంచెను.

అలక:—ప్రియకుమారీ? ఏమమ్మ, నీ యభిప్రాయ మేమి? ఆర్యులొక్కకయెడఁ గేవలము పిచ్చివారుగఁ దోఁచుచుందురు కాదా?

రంజ:—లోకమునకు వెఱ్ఱివాఁడు మతిభ్రష్టుఁడుగఁ గానుపించు వెఱ్ఱివానికి లోకమంతయు బిచ్చిదిగ కనుపించును.

అలక:—కావున నార్యులాచారములు, నభిప్రాయములన్నియు గౌరవనీయములనియే తలఁతువా?

రంజ:—గౌరవయోగ్యములగునో కావో చెప్పలేను గాని మనోహరము లగుట మాత్రము నిశ్చయము. నా కెప్పుడు నవిచూడ విన ముచ్చటగుచుండును.

అలక:—కావున నే కాఁబోలు యవనపరిచారికల నెల్లఁ దప్పించి. నీయంతఃపురమును నార్యనారులతో నింపుచుంటివి. నీవు సదా మంతన

ప్రియవు. నరేకాని భారతసామ్రాజ్యము స్థాపించువిషయమున నేదో మణిహారమున్నదనియు నేదో వారికొక కథ యున్నదఁట. అది నీ వెప్పుడైన వింటివా?

రంజ:—లేదు! లేదు! ఏమది? మణిహారమా!

కమలా:—మనచే ఖైదీగఁ దీసికొని రాఁబడిన ప్రభాకరుఁడను వాఁడా విషయమై విశేషముగ నెఱుఁగును. అతనివలన నీ రహస్యము వెల్లడి కావలెను.

రంజ:— అవును. ప్రభాకరుఁ డను పేరు వింటిని. అతఁడు మిక్కిలి రూపసియఁట. తేజస్వియఁట. మఱి వాఁడే ముందార్యావర్తమున సామ్రాజ్యము స్థాపించుటకై యవతరించె ననికూడ వారు చెప్పుచుందురు. నా కామాటలు వినినప్పుడెంతయో నవ్వువచ్చుచుండును. జాలి కలుగుచుండును.

అలక:—అట్లయిన నా ప్రభాకరు నిటకు రప్పింతుమా?

రంజ.—నాకును వాఁడెటులుండునో చూడవలెనని యున్నది.

కమలా:—అదియే కార్యము.

అలక:—ఎవ రక్కడ?

సేవకుఁడు తోడనే ప్రవేశించి మోకాళ్ళపై నిలిచి తలవంచి కుడిచేతితో భూమినిఁదాఁకి యటనుండి నెమ్మదిగ చేతినెత్తి నన్నుదురు చేర్చి మిక్కిలి వినయముగ సలాముచేసి నిలువఁబడి యాజ్ఞకై వేచి యుండెను.

అలక:—(సేవకుని కొకచీటి నిచ్చి) దీనిని గొనిపోయి రాజకీయపుఁ జెఱసాలాధికారికిం జూపి, ప్రభాకరుఁ డను వాన్ని సగౌరవంబుగ నిటకుఁ దీసికొని రమ్ము.

సేవకుఁడు చిత్తమని వెడలిపోయెను.

అలక:—అతఁడు వచ్చిన వెంటనే మన మాతనితో నెటుల మాట్లాడవలెను. సరాసరిగ యా మణిహారవృత్తాంతము నీ వెఱిఁగిన

దంతయు చెప్పెదవా లేదాయని యడిగి బెదరించిన వాఁడు రహస్యము బయటఁ బెట్టునా ?

కమలా :—బెదరించిన బెదరువాఁడు కాఁడు.

అలక :—అవును. వాఁడు మిక్కిలి ధైర్యసాహసౌదార్యవంతుఁడఁట. అంతేవాసికుఁడు వానిని గురించి చాలఁ జెప్పినాఁడు. వానిని నయమున సాధింపవలెను గాని వేఱుమార్గము లేదు.

కమలా :—స్నేహధర్మమున వాని కడనుండి మెల్లగా రహస్యము బయటికి—

అలక :—ఆభారమంతయు రంజని వహింపఁగలదు.

కమలా :—"నాకదంతగా రుచించుట లేదని" తనలో ననుకొనును. ప్రభాకరుని సగౌరవముగా, రాజసేవకుఁడును కారాసాలాధికారియుఁ గొనివచ్చి, యలకసుందరుని ప్రవోాల దిగవిడిచి రాజాజ్ఞఁ బొంది పోయిరి.

అలక :—ప్రభాకరా ! నీకిదె మాస్వాగతము.

రంజ :—సోదరా ! ఇటు రమ్ము నా చెంత నీ యాసన మలంకరింపుము. (తండ్రివంకఁ దిరిగి) ప్రియజనకా ! ఇట్టి కుసుమగాత్రునిఁ జెరనుంచుట మీ మనసెట్లొప్పె.

ప్రభాకరుఁడేమియుఁ బలుకక, యూరక యుందఱ మొగములను జూచుచు నిలువఁబడి యుండెను. రంజని లేచి యాతనిచేయి తన రెండు చేతుల సంధించి మెల్లనఁ దీసికొనివచ్చి తనపరన నొక సోఫాపైఁ గూర్చుండఁ బెట్టెను.

అలక :—ప్రభాకరకుమారా ! ఇంతవఱకుఁ గొంత తెలిసియుఁ గొంత తెలియకయు నీకుఁ గడుకష్టము లొడఁగూర్చితిని. ఆ కీడు నీమనమున నిలిచి యుండనీయకుము. ఇదిగో నాముద్దుల రంజని నిన్ను సోదరాయని పిలుచుచున్నది. నాకును బుత్రసంతతి లేదు. నీ కొక ప్రాసాదమును బ్రత్యేకముగ స్థిరపఱిచింతిని. నీవందు సుఖముగ నుండ వచ్చును.

ప్రభా :—ఇదినిజమా ? కల్లయా ? నేఁగలఁ గాంచుచుంటినా ?

కమలా :—వత్సా ! లేదు. లేదు. ఇది సత్యము. ఈ రంజనీదేవి పట్టువలన యవనాధీశుడు తనపట్టిముద్దు చెల్లింపకఁ తీరకఁ నిన్నాచెర నుండి విముక్తినిఁ గావించి నీకిట్టి వైభవము కలుగఁజేయుచున్నాఁడు.

ప్రభా :—మన మిదివఱకెన్నఁడో కలిసికొన్న ట్లున్న దే ! లేదు... కాని యవనరాజకుమారీ ? ఈదురదృష్టవంతుఁడగుదీనునిపైఁ నీకింత కటాక్షము కలుగుట కితఁడేమి పుణ్యము చేసెను.

రంజ :—అన్ని విషయముల సావకాశముగ మాటలాడుకొన వచ్చును. ముందు నీకు మిక్కిలి యాకలిగ నున్నటులున్నది. లోనికిఁ బోవుదము రమ్ము.

అని ప్రభాకరుని లేవదీసి యాతనిచేయి పట్టుకొని సవిలాసముగా లోనికిఁ గొనిపోయెను. తోడనే యలకసుందరుఁడుకూడఁ దనకొఱకై దండనాథులు వేచియుందురని చెప్పి కొలువు కూటమునకు బోయెను.

కమల :—వ్యాయంకృతాప రాధమున కెవరి నేమందును ? నా రంజని ప్రభాకరునితో సంతమచ్చిక నుండుట చూచి, నేనోర్వఁ జాలను. నా హృదయముడికిపోవుచున్నది. నా కన్నులు మండిపోవు చున్నవి. రంజని నాయది. ప్రభాకరునిదికాదు. కానేరదు. కాసీయను. భారతసామ్రాట్టును నేను. సామ్రాజ్ఞి యామె" అని యనుకొనుచుఁ దానుకూడఁ గొలువుకూటమును జేరెను. ద్వారము వెలుపల రాజసేవ కుఁడును, చెరసాలలోని పహారా జవాను నిట్లు మాటలాడికొనుచుండిరి.

జవా :—అందఱి మొగాలు దిగాలుపడియుండేవి. గాని వీని ముఖము మాత్రము నవ్వుతూన్నట్లే కనబడేది.

సేవ :—విచారములేదు కాఁబోలు.

జవా :—విచారమేమిటి ? రాజులా కూర్చునేవాఁడు. ఒక నాఁడొక సాహసముచేసినాడు. తన కెదురుగదిలోఁ బద్మిని యనునామె పెట్టబడి యుండెను. నాఁటిరాత్రి వల్లత్రాచు బాగుగ రెండుబారలు

పైగనున్నది పిల్లయున్న గదిలోనికి దూరుచున్నది. వెంటనే యాతఁడు దానితోఁక బట్టుకొని లాగెను. తోడనే యది వెనుకదిరిగి యాతని గదిలోనికి పడగవిప్పుచు దుమికెను. వెంటనే తనపై యుత్తరీయమును దీసి యాపడగపైఁ బడవేసెను. దానిని గాటు వేయగాఁ గోర లందుఁ జిక్కుకొనెను. కండ్లమీఁద గుడ్డదట్టముగ నున్నది. నగములోనికి నగమీఁవలకు జాలకములమధ్యనుండి కొట్టుకొనుచున్నది. ఆయలుకుడు విని బాలిక లేచి భయముచే నేడువసాగెను. అనందడి విని మేము వచ్చునరికి బాలుడు "అమ్మా భయములేదులే. భయములేదు. యేడువకని" యా బాలిక నూఱడించుచుండెను.

సేవ :—అబ్బ యెంత యుపాయముచేసినాఁడు ?

జవా :—ఆ పిల్లను రక్షించెను. తన్నుఁ గాపాడుకొనెను. అతని చర్యలు గుణములుయెన్ని రాత్రులు చెప్పికొనినను తరుగవు. తనివి తీరదు—ఇటుపై నీవే చూచెదవుకదా స్వయముగ—దానిని జెఱసాలనుండి రాజప్రాసాదమును జేర్చుట మాదురదృష్టము. మీ యదృష్టము. నేఁబోయెద. తీసికొనరమ్మన్న విశేషమేమో యని యచ్చట నాస్నేహితులు నాకొఱ కెదురు చూచుచుందురు.

సేవ :—నేనును రాజప్రాసాదము మా నూతన ప్రభువుగారికై యలంకరింప వలయును. అయ్యో! యేమంటిని అనరాని మాటంటిని.

జవా :—సరే దానికేమిలే.

అని పరిహాసము లాడుకొనుచు వారిరువురుఁ దమ నియమితకార్యములోనర్చుటకుఁగా నాప్రదేశము వీడిపోయిరి.

౪

సూర్యోదయ మగుచున్నది. రాజప్రాసాదోపరిభాగ మరుణకాంతుల పూఁతలచే మెఱుఁగెక్కి శోభాయమానముగ నుండెను. పూర్వదిక్కున రంగురంగుల బెడగొండలు మనోహరముగనుండెను. పక్షులన్నియుఁ గిలకిలారావములు చేయుచు శ్రేణులుగట్టి నభోంతరాళమున బఱుఁగు

లిడుచుండెను. పొగమంచంతయు నంతరింపఁ బ్రభాతవేళఁ బ్రకృతి యభ్యంగన మొనర్చినటుల నినుమడించిన లావణ్య వికాసములతోఁ గెంజియుచుండెను. నూతనజీవనము నూతనవికాసము ప్రతివృక్షము నందును—మొక్కయందును-లతయందును—బువ్వునందును—బండు నందును—వానిపై నిలిచియున్న హిమబిందువునందును—వానిలోఁ బ్రతిఫలించుచున్న యరుణకిరణములందును—నిండి నిబిడీకృతమై పొంగి పొరలుచున్నవి. వినీలాకాశము నిర్మలమై వికసిత నీలోత్పలమువలె వెలయుచుండెను. ప్రకృతిసతి చేతిముకురమన నొప్పు సరోవర జలములం దీరామణీయకమంతయుఁ బ్రతిఫలించుచుండెను.

అట్టిసమయమున రంజనీ ప్రభాకరులు ప్రాసాదమును వీడి యుద్యాన వనముఁ జొచ్చి మెల్లగా నడచుచు నీసరోవరతీరమును డాయుచుండిరి.

ప్రభా :—యవనరాజ కుమారీ !...

రంజ :—అట్లు పిల్చిన నేఁబలుకను.

ప్రభా :—రంజనీ !

రంజ :—నీవు నన్ను బేరు పెట్టి పిలుతువా ?

ప్రభా :—సోదరీ !

రంజ :—( స్వగతమున ) నా కీసంబోధనము గూడ నంత సరసముగఁ దోఁచుట లేదు.

ప్రభా :—చూచితివా ! ఈ గడ్డిపూలు నీమృదుపాదస్పర్శ నెంత యాతురతతోఁ గూడి యూగులాడుచున్నవో ! నీ పాదాంగుళిని ముద్దు బెట్టుకొనుచున్నట్లున్నవి సుమీ !

రంజ :—( ఒక వృక్షమునుండి వ్రేలాడుచున్న పండువంకఁ జూపుచు ) నీ వాపండు నందుకొనగలవా ?

ప్రభా :—అందుకొందును గాని దాని పేరేమి ?

రంజ :—యాపిల్, ( Apple ) అందురు. రేగుపండ్లలో నొకజాతి,

ప్రభా:—(కోసి) ఎంతకోమలముగ నున్నది. మనోహరమగు సువాసనగదా!

రంజ:—నా కందనిది నీ కెంతసులువుగ నందినది.

ప్రభా:—మఱి నీకంటె పొడవుకాదా!

రంజ:—చాలబాగుగఁ జెప్పితివి. "చూడు ఇదిగో" యని సరసను నిలిచి కొలచూచి "యేదీ పొడుగు!"

ప్రభా:—ఇదిగో మూఁడువేళ్ళ పొడుగు.

రంజ:—(కొంచెము మొగము వాల్చి చూచుచు) నీకు వయసెంత!

ప్రభా:—నీకు?

రంజ:—నాకు పదునెనిమిది. నేను జెప్పితినా! మఱినీకు!

ప్రభా:—(ఊరకుండును)

రంజ:—నాచేతఁ జెప్పించి నీ వూరకుందువా?

ప్రభా:—నెచ్చెలీ! నిజముగా నా కెన్ని యేండ్లో నే నెఱుంగను. మఱచిపోయినాను. నన్ను మీ యవనుఁడు ఖైదుచేయునాఁటికిఁ బది యేండ్లు నిండుగలేవు. తరువాతఁ జెఱసాలలో నెన్ని సంవత్సరము లుంటినో లెక్కచూచుకొనుట మానివేసితిని. ఆమరణాంతము నన్ను ఖైదుననే యుండుమని చెప్పినారు. కనుక దినములతో మాసములతో సంవత్సరములతో నా కేమి పని యని యూరకుంటిని. లెక్కచూచుకొనుట మానివేసి—నాకు విడుదల నిచ్చు మరణమునకై యెదురు చూచు చుండెడివాఁడను.

ఈ మాటలు చెప్పుచుండగనే వాని నేత్రములనుండి నీరు కారుచుండెను. రంజని కూడ నప్రయత్నముగ నశ్రువులురాల్ప మొదలిడెను.

రంజ:—విచారింపకుము ప్రియసఖా! కన్నీరు తేకుము. నేఁ జూడఁజాల" ఇట్లనుచుండగనే రంజనికి దుఃఖము మఱింత పొంగి వచ్చుచుండెను.

ప్రభా :—(రంజనిని దగ్గఱఁ జేరఁ దీసి పజ్జఁ గూర్చుండఁ బెట్టి కొని) సోదరీ! నీహృదయ మతికోమలము. ఏడువకుము. (తనకొంగు చే నామెబుగ్గలపైఁ గన్నీట దీఁటుచు) ప్రియసఖి! నన్నుఁ జూడుము. నేను విచారించుట లేదు. ఇదివఱ కెన్నఁడు నాకంట వేఁడి కన్నీరు కార్చి యెఱుఁగను కాని నేఁ డేమొ దుఃఖ మాఁగినది కాదు. అది కేవలము దుఃఖ మనియుఁ జెప్పలేను. అపరిమిత దుఃఖము పోయినది. అపరిమితానందము కలిగినది. కష్టసుఖముల సంధిలోఁ గన్నులనీరు గ్రమ్మెను. నీయెదుట నే నానందాశ్రువులు గాక యన్యంబు లెట్లు రాల్తును!

రంజ :—(ఉదయించుచున్న సూర్యునివంకఁ జూచుచు) ప్రభాకరా!

ప్రభా :—నీ విశాలబాష్పార్ద్రనయనంబు లీ ప్రభాకరుని తేజమునకు వింతసొబగు గూర్చుచున్నవి. నే నీవింతరంగులపూలఁ గోసి తెచ్చి నీయొడి నింపుదునా?

రంజ :—వలదు. ఆ గులాబిపొదనిండ ముండ్లుండును.

ప్రభా :—అటు లయినచో యీ సరస్సునందలి యీ సహస్రదళపద్మము తెచ్చి నీ మృదుహస్తములఁ బెట్టెదను. నీ వేమిచేయుదువు?

రంజ :—ప్రభాకరునికి సమర్పింతును.

ప్రభా :—నీచేతులతో మహాతేజస్వియగు ప్రభాకరునిఁ దాఁక కలవా?

రంజ :—ఇతరులకుఁ దేఱిపాఱఁజూడ నైన శక్యముగాని వాఁడు కాని, భక్తుల కందరానివాఁడా? ప్రభాకరుఁడు భక్తవత్సలుఁడనెదరు. అది యసత్యమా?

ప్రభా :—భక్తియనగా నేమి?

రంజ :—ప్రేమ.

ప్రభా :—నీవు సూర్యోపాసన చేయుదువా?

రంజ :—దానిని గురించి చాల వినియున్నాను. ఆ విధివిధాన మంతయు నా మనమునకు మిక్కిలి సుందరముగా నానందదాయక ముగాఁ గనబడుచున్నది. ఎట్టిని పువ్వులఁట-ఎట్టిని యక్షతలఁట-ఎట్టిని చందనమఁట-చుక్కచుక్కల నందమగు చక్కని కృష్ణాజినము-మనో హరమగు సుప్రభాతము—

ప్రభా :—నిష్కల్మషమగు మనసు-ఆమాట వదలివేసితి వేమి? అదియే ముఖ్యము.

రంజ :—ఆ సంగతి వేఱ చెప్పెడిదేమి? ఆ సమయమునఁ బూజాద్రవ్యముల నెదుటఁ బెట్టుకొని సవితృమండలముపై దృష్టినిలిపి నపుడు కల్మష మెచ్చట నుండగలదు?

ప్రభా :—నెచ్చెలీ! నాకు నీసంగతి చూడ మిగుల వింతగ నున్నది. మీరు యవనులుగద-నీకీయార్యాచార సాంప్రదాయములపై నింతప్రీతి కలుగుటకుఁ గారణమేమి?

రంజ :—ప్రియసఖా! తన కాధార భూతమగు జలమునే శోషింపఁజేయు సూర్యునిఁ జూచినఁ గమలమున కంత ప్రీతియేల?

ప్రభా :—లోపలను వెలుపలనుగూడ నెంత నిశ్శబ్దముగ నున్నది? ఈ ప్రకృతియంతయు నిశ్చలమై మనవెనుక నొక జవనికవలె నున్నది. తెరముందు నిలిచి నిన్నటి నాటకమందలి పాత్రలవలె, మన మిరువుర మేమో కథాకలాపము వినిపించుచుంటిమి. కాని మన నాటక మునకు ప్రేక్షకు లెవ్వరును గానవచ్చుటలేదు. ఇది బహిరంగ ప్రదర్శ నము కాదుకాఁబోలు!

రంజ :—కాదు. అంతరంగికాభ్యాసము. మన మిరువురము నటీసూత్రధారులము.

ప్రభా :—అటులయిన నార్యావర్తయవనావర్తములు రెండును నంతసింపఁగల నాటకము ప్రయోగింపవలయు.

ఇట్లనుచు నిరువురు నుద్యానవనము వీడి రాజప్రాసాదము చేరిరి.

మన్మథుఁ డా మహానాటక రాజమును రచించుటకుఁ బ్రారం భించెను.

## ౫

కమలాకాంతుఁడు రంజనియందు బద్ధానురాగుఁడై యుండుటయుఁ గొన్ని రాజకీయకారణముచే నలకసుందరుఁడు కమలాకాంతుని కిచ్చి వివాహము చేయ నంగీకరించుటయుఁ బిదప రంజని ప్రభాకరుని యెడల నధిక గౌరవానురాగములఁ జూపుటచేఁ గమలాకాంతునకు సహింపశక్యముగాని యీర్ష్య జనించుటయు నిదివఱకే సూచింపఁబడి యుండెను. నేఁడు యువనదండనాథుఁడగు నంతియోధుఁడు కమలాకాంతుని దర్శింపరాఁగా వారిరువురకు రహస్యాలోచనాగారమున నీక్రిందివిధముగ మంతనము జరుగుచుండెను.

కమల :—మూఁడు దినములలో దుదముట్టింపవలెను. నేను కన్నులారఁజూచితిని. వాఁడు కృతఘ్నుఁడై యిచ్చటి గుట్టెల్ల బయటకుఁ జేరవేయుచున్నాఁడు.

అంతి :—అట్లయినచో నాతనికి గఠిన నరకము తిరిగి యేల వేయరాదు. ?

కమల :—అందలిరహస్యము నేఁ జెప్పితిని గాదా-తేఁడు కూతునకు వశ్యుఁడు కూతురు వీనికి దానురాలు. గోడలకుఁ జెవులుండును. ఎవరికిని దెలియరాదు. చక్రవర్తి తల్లిలేని ముద్దుబిడ్డకుఁ గష్టమును చేయఁజాలఁడు. అతనితో నీవిషయములు ముందుచెప్పి యాతని మనస్సునకు క్షోభకలిగింపు టేల ? జరిగినతరువాత జరిగిపోయినది. జరిగిపోయినదానికి విచారించిన ఫలమేమి యని యేదో రీతిగ సమాధాన పెట్టవచ్చును. నే నిన్ని మాటలవాఁడను గాను. నీ కీయువన దేశమాక్రాంత మగుట కిష్టములేదేని మూఁడు దినములలో నీయనిష్టమును దెలియఁ జేయుము.

అంతి :—అట్లే చేసెదను.

కమల :—నేనుగూడ తేని దర్శించెద నని చెప్పి

యిరువురును స్వకార్యనిర్వాహణార్థమై యేగిరి.

## ౬

మేడపై విశాలమగు నొకగదిలో దంతపు కుర్చీలును మేజాలును బట్టుతివాసులపై సమర్పఁబడి యుండెను. నారీమణు లారతి పట్టుచున్నటుల నేపుగ లేచి పూచినపూలతిలాగున, మానికము తలఁదాల్చి పడగవిప్పి యాడుచుండిన కృష్ణసర్పము పోలిక, పోతపోయఁబడిన దీపస్తంభములయందు సుగంధతైలదీపములు బాగుగఁ బ్రకాశించుచున్నవి. శృంగారముగఁ బైకప్పునకమర్పఁబడిన గులోబులును, రంగు రంగుల చిత్రవర్ణములతో శోభిల్లుచుండెను. గవాక్షమునుండి యవ్వలి యంధకారమున మినుకు మినుకుమని మెఱయుచున్న నక్షత్రములు గానవచ్చుచుండెను. ఒక సోఫాపై నలకసుందరుఁడును చెంతనే యొక కుర్చీపై రంజనియు నాసీనులై యుండిరి.

అలక :—ఏమి గ్రహించితివి ?

రంజ :—(ఊరకుండును)

అలక .—ఇన్ని దినములనుండియు నీ వతనికడ నేమేమిగ్రహించుచుంటివి ? .

రంజ :—ఆర్యుని సత్ప్రవర్తనోత్కృష్టతను గ్రహించుచుంటిని.

అలక :—మనకు గావలసిన విషయమేమైన—

రంజ :—పర దేశములపై దండెత్తుట పాపమనికూడ నతనివలన గ్రహించితిని.

అలక :—(మందహాసముతో) ఎందుచేత ?

రంజ :—"ప్లేటో" యుపదేశించినను. "సోక్రటీసు" వాదించినను, "యేరిస్టాటిల్"; బోధించినను, సృష్టి పశుబలముపైఁ గాక, ధర్మముపై నాధారపడియున్నదని కదా చెప్పుదురు.

అలక :—కనుక ?

రంజ :—ఒకరు మఱియొకరికంటె బలముగ నున్నంత మాత్రమున, బలవంతులు బలహీనులకడనుండి వారి సర్వస్వమును, గ్రహిం

చుట పాడియగునా? దోపిడిగాండ్రు శిక్షాపాత్రులు గదా? వారిని శాసించి దండించు రాజులే దండోత్తుదుంటె మను మాటుపేరు పెట్టి దోపిడిచేయఁ జూచినఁ జెప్పవలసిన దేమి? కంచెయే చేను మేసిన దిక్కు కలదా?

అలక:—అనాగరకులును మృగప్రాయులు నైన వారియెడల గరుణ వహించి వారికిఁ గొంచెము క్రమశిక్షణ మొసంగఁబూనుటయుఁ బాపమే కాఁబోలు?

రంజ:—ఎవ్వరైనను వచ్చి "గురువులుగాఁ దయచేయుండవలె" నని వేడి, శిష్యత్వమును గోరి వచ్చినప్పు డుపాధ్యాయత్వమునకుఁ బూనుట సరసముగాని లేనిచో నీబలాత్కారనాగరకతా విద్యాదాన ప్రహసనము నవ్వులాటగ నుండును. అదియును గాక యార్యులు మన యొద్ద నభ్యసింపఁ దగినవిద్య యేదైన నున్నచో, నార్యులకడ మనము గ్రహింపవలసిన సంగతులు పెక్కులుండును. అట్టి సందర్భములో యుద్ధముకన్న వేఱుమార్గమే ప్రయోజనకారి.

అలక :—ఇఁక నీ శిష్యునకు సెలవొసంగెదవా? మణిహార వృత్తాంతము మన కవసరముకాదా? నీ యుపన్యాసమున కంతకును సారాంశ మిదియనియే నాబుద్ధికి దోఁచుచున్నది. కానిమ్ము. నేను నీకొకకటియే చెప్పదలచుకొంటిని. శ్రద్ధగ విని బాగుగ నాలోచించు కొనుము. కాకికి కాకిపిల్లయే ముద్దు గానిఁ గోకిల మొన్నటికిని గాదు. రామచిలుక యూరపిచ్చుక నెన్నటికిని వలవదు. స్వజాతి స్వధర్మము లపై నభిమానము జీవులకు సహజలక్షణము. నేఁబోయి వచ్చెదనని కఠినముగఁ బల్కుచు వెంటనే యామందిరము వీడి చనెను.

రంజ :—"స్వజాతి—స్వధర్మము— బుద్ధిహీనంబులగు మృగ పక్ష్యాదుల సాదృశ్యము లప్రస్తుతములు—ప్రేమ దివ్యాంశము. కౌముదీ ప్రసారమువంటిది. ప్రేమ ప్రసారము.—నాహృదయపద్మ మాప్రభాకర సందర్శనంబున వికసించినది. అదియు సహజలక్షణ మెట్లగును? సహజము

కానిమ్ము—అసహజము కానిమ్ము—నాతండ్రి మెచ్చనిమ్ము—తిట్టనిమ్ము—బంధువులును దోడివారును హర్షింపనిమ్ము—దూషింపనిమ్ము—పుణ్యమైనను సరే—పాపమైనను సరే, నాహృదయము ప్రభాకరునకు దత్తమైనది. నామనోనాయకుఁడే నన్ను దిరస్కరించినను నే నాతని ప్రేమించుచు బ్రహ్మచారినిగా నైన నుండుటకు మనోనిశ్చయము చేసికొంటిని. ఇఁక వేయిసంధియములతోఁ గుశంకలతోఁ బనియేమి నాహృదయేశ్వరుఁడు సత్యవంతుఁడు. నే సావిత్రి నయ్యెదను!" ఇట్లు చింతించుచుండఁగనే ప్రియంవద యను రంజనీదేవి చెలికత్తె ఖిన్న వదనయై మెల్లగ నామెను సమీపించెను.

రంజ:—ఏమమ్మ—ఇట్టి సుందరమగు చల్లని రాత్రివేళ ఖిన్న వదనవై చూపట్టుచుంటివి? ఒక్కసారి నవ్వివేసినచో నిలిచియుండు కష్టములు గావి, దుఃఖములు కాని, యెవ్వియైన జూపట్టునా?

ప్రియం:—ఏమని చెప్పుదును? నేనిక్కడకు వచ్చుచుండఁగా—ఆ—కమలుఁడు నను బిలిచి "మీరంజని లోన నున్నదా?" యని యడిగెను.

రంజ:—బాగు.

ప్రియం:—"నే నిదే బోవుచుంటిని. చూడలేదు. ఉండిన నుండవచ్చును. అయిన నిప్పు డామె ప్రభాకరునిఁ జూడఁబోవు సమయమైనది." అంటిని. తోడనే యాక్రూరుఁడు "పాప మీయొక్క రాత్రియే కదా!" యని యింతలో మాటనాపి తెల్లబోయి యది కప్పిపుచ్చుట కెంతయో తంటాలు పడఁజొచ్చె. ఏమి! అట్లనుచుంటి వేమి యని యూరుకొనక తిరిగి యడిగితిని. అంతట వాఁడు ముఖమున నకస్మాత్తుగ వింత తెలివి పొడచూప "ఔను. వాని కింక నీ రాత్రియు తేపువగలుతో నాయుర్దాయము నిండునఁట—ఒక కాలజ్ఞుఁడు నాకు జెప్పినాఁడు. సరే దాని కేమి? ఇప్పుడు నేడు మీ రంజనిని జూచుట కనియే బయలుదేరితిని. పద. నే వచ్చుచుంటి నని చెప్పు" మని

ముందుగ వెళ్లుమని తొందర పెట్టెను. ఇంతలో నీకడనుండి మీా తండ్రి గారు వచ్చుచు నెదురుపడిరి. వా రిరువురు మాటలాడుచుండిరి. నే నిటు వచ్చితిని. ”

ప్రియంవద యిట్లు చెప్పుచుండఁగనే రంజని సోఫాపైఁ దేరగిలఁబడి మూర్ఛపోయెను. ప్రియంవదకు సంగతి తెలియక యూరక చెప్పుచుండెను. తరువాతఁ దన ప్రియసఖ యవస్థ తెలిసికొని శీత లోపచారములు చేయ మొదలు పెట్టెను.

రంజ :—(కొంతవడికిఁ దెలివివచ్చి) హా! ప్రభాకరా! మన్మనోహరా! జీవితేశ్వరా! నన్ను విడిచి, యీ లోకమును విడిచి పోవ సంసిద్ధుఁడవై యుంటివా! ఏమిగతి!

ఈ మాటలు ముగియకపూర్వమే రంజని యంతఃపురమునఁ గమలా కాంతుఁడు ప్రవేశించెను. ఆమె మాటలు విని.

కమ :—రంజనీ! నీ కేమిలోటు. ఈ లోకమునపుట్టిన వెన్నిగిట్టుటలేదు. అన్నిటికొఱకును మన మీారీతి వాపోవుచుండుట తగునా! ఊరడిల్లు మూరడిల్లుము.

రంజ :—ఎవరు మీారు? నా ప్రభాకరుని ప్రాణములు తరలించుకొని పోవ వచ్చిన ధర్మమూర్తులా? అయ్యా! మీాకు స్వాగతమిచ్చుచున్నాను. కాని నేను మిమ్ములను గొన్ని ప్రశ్నలడుగఁ దలఁచి యుంటిని. దయయుంచి వానికి యథార్థములగు సమాధానము లిత్తురా?

కమలాకాంతుఁడును బ్రియంవదయు తెచ్చబడి చూచుచుండిరి. కమలాకాంతుఁ డుండి యుండి యెవ్వరును గూర్చుండు మనకయే, స్వతంత్రముగ నొక కుర్చీని రంజని సోఫాప్రక్కకు లాగుకొని కూర్చుండెను.

రంజ :—ఓహో! నీవా! ప్రియంవదా! నేటికి మన నాటకము ముగించెను. ఇఁక నీకిచ్చట నేమిపని? నీవు పోయి హాయిగఁ బండు కొనుము. చాల రాత్రి యయినది.

తోడనే ప్రియంవద యాస్థలము విడిపోయెను.

రంజ :—నిద్రఁ బోలుసుఖదాత మఱియొందు లేదు. కావున నీ యవిచ్ఛిన్నమగు దీర్ఘనిద్ర యవిచ్ఛిన్నమగు దీర్ఘసౌఖ్యము నొడఁ గూర్పునందురు ఏమందువు కమలాకాంతా!

కమల :—నిజమే! నీవు చెప్పిన దానియం దసత్యమేమియు లేదు.

రంజ :—అయినచో నీకట్టి నిరంతరసౌఖ్యము కలుగుగాక! అని మొలనుండి బాకుతీసి మహాకాళివలె విజృంభించెను. నిరాయుధుం డగు కమలాకాంతుఁడు భయముతో గజగజ వడఁక మొదలిడెను. ఇంతలోఁ జాటుననుండి యంతయు వినుచున్న ప్రియంవద, తలుపులు లోపలకు మూసివైచి, రెండుచేతుల రెండు తెల్లత్రాచులవంటి మహాయుధములఁ బూని యాస్థలమునకుఁ జేరెను.

రంజని :—(కమలునితో) కూర్చుండుము!

కమలాకాంతుఁడు మాఱుమాటాడక కుర్చీలోఁ జతికిలఁబడెను. ఆయుధపాణియై యెదుట రంజని మహాశక్తిస్వరూపముఁ దాల్చి నిల్చెను. ఆయుధముల సిరుగేలఁ బూని వెనుక మెలఁకువతో నప్రమత్తురాలై నిల్చియుండెను. కమలాకాంతునకు భయముచేతను రంజనికిఁ గోపముచేతను, నోట మాటరాకుండెను. ఇట్లు కొన్ని నిమిషములున్న పిదప—

రంజ :—కమలాకాంతా! అట్లు వణకుచుంటి వేమి! ఒకరికి మంచివని చెప్పిన సౌఖ్యము నీకనుభవించుటకు భయమగుచున్నదా! కాలజ్ఞుఁడు నీకింక నాయుర్దాయ మున్నదని చెప్పెనా! మాటాడ వేమి! నోట మాట వచ్చుటలేదా యేమి? ప్రియంవదా! ఈతని మాటలాడింతమా!

ప్రియం :—అదెంతపని!

యని కత్తి ఝుళిపించుచున్నది. కమలాకాంతుఁ డెలుఁగెత్తి కేకవేయ మొదలిడెను,

రంజ :—కిక్కురుమనక నోరుమూసికొనుము. లేనిచో నిప్పుడే నీ కంఠనాళమున నాకత్తి దించెదను. నీకవకాశ మొసంగితిని. ఈశ్వర ప్రార్థన చేసికొనుము.

లోకమంతయు నిద్రించుచున్నది. అర్థరాత్రమైనది. గదియందు స్వచ్ఛముగు దీపకాంతి దట్టముగ నిండియుండెను. గవాక్షమున కవ్వల గగనవీధిని తెల్లమబ్బులు వేగముగఁ బఱుగులిడుచున్నవి. చంద్రోదయమైనది. చల్లనిగాలి సోరణగండ్లనుండి లోనికి వీచుచున్నది. క్రోధభయావేశముచేఁ గలిగిన స్వేదజలమును బూర్తిగ నార్చుచుండెను.

కమలా :—రంజనీ! దైవప్రార్థన చేసికొను మని నాకుఁ గొంత యవకాశము కలిగించితివి కదా! నాకు దేవుఁడు లేఁడు. ఉన్నచో నేఁ జేసిన మహాద్రోహములలో నొక్కదాని నైనను నేఁ జేయఁ జాలి యుండను. నే చేసిన ద్రోహములన్నియుఁ దలఁచుకొనగ నాకుఁ జావనగ భయమగుచున్నది. ఆర్యుఁడను. స్వరాజ్యమునకు నాశనకారణుఁడ నైతిని. స్వధర్మమును వీడి యవనులలోఁ గలిసిపోయితిని. నీవు ప్రభాకరునియెడ మిక్కిలి ప్రేమ చూపుచుంటి వని మత్సరమున నే నంతి మోహనతోఁ గలిసి కుట్రచేసి ప్రభాకరుని రేపు రాత్రి, తుదముట్టింప నిశ్చయించితిని. అంతి మోహనపంపున రేపురాత్రి ప్రభాకరుని శయనాగారమునఁ బాలలో విషము కలుపఁబడును. కృష్ణసర్పము విడువఁబడును. అవసరమైనచోఁ దెల్లవారులోపునసే పంకా లాగువాఁడు పుణ్యముకట్టుకొనుటకు సంసిద్ధుడై యుండెను. ఇట్టి ఘోరపాపములు చేసినట్టియుఁ జేయఁదలఁచినట్టియు, నాకు చచ్చుటకు భయమగుచున్నది. కావున నన్నుఁ బ్రాణములతో విడిచిపెట్టు మని దేవునకు మాఱుగా నిన్నే ప్రార్థించుచున్నాను. అం బాలునివలె రోదనము చేయుచు రంజని పాదపద్మములపైఁ బడి రెండు చేతులుఁ బట్టుకొనెను.

రంజ :—ప్రియుంవదా! ఈతనికిఁ బ్రాణదానము చేయవచ్చునా!

ప్రియం :—ఏదానమునకైనను సత్పాత్రము కావలెను గదా!

కమలా:—ప్రియంవదా! నీవు గూడ నార్యయువతివి. నే నార్యుఁడను, రాజపుత్రుఁడను. ప్రియముఁ బలుకుము.

ప్రియం:—మన యీ యార్యత్వము రాజత్వము మంటగలిసి నట్లే యున్నది. ఆ మాటె త్తకుము. సిగ్గుచేటు.

రంజ:—నిన్ను మేమిప్పుడు వదలిపెట్టినచో నేమిచేయుదువు?

కమలా:—మీ కిరువురకు నిరువదివేల నమస్కారములు చేసి మాఱు మాటాడక మఱియొకని మొగము చూడక మా దేశము పోయెదను.

రంజ:—వట్టిమాట కేవలమబద్ధము.

ప్రియం:—వెంటనే యా యంతిరాముకునికడ కరిగి మాఱు మోజసలు చేయును.

రంజ:—అగునా? కాదా?

కమలాకాంతుఁడు మాటలాడ కూరకుండును.

రంజ:—ప్రియంవదా! ఈ రెండవ యంతస్తునం దీగోడగదిలో నితనిఁ బెట్టి తాళము వైతము. ఎల్లుండి ప్రొద్దునఁ దీయుదము. చెప్పిన మాటలు ఋజువైనచో నెల్లుండి వాని దేశము పోవచ్చును. లేనిచో యముని దేశమున కరుగవచ్చును. ఈ లోపుగ వీఁడు చెప్పినదాని సత్యాసత్యములు విచారించి నిర్ణయింతము.

ప్రియం:—అగు నది మంచి యాలోచన (గోడతలుపుతీసి) 'రావోయి' నీచుఁడా యిందులోనికి.

రంజ:—కమలాకాంతా యేమిచేయుదువు? తప్పదు నడువుము. కమలాకాంతుఁడు మాఱుమాటాడక తలవంచుకొని యరుగఁజొచ్చెను. ప్రియంవద యెప్పటియట్లు తలుపుమూసి తాళము వైచెను. పైకది మామూలుగోడవలెఁ గనబడుచున్నది.

రంజ:—ఇఁక నెంతరాత్రి యున్నది.

ప్రియం:—[గవాక్షమునుండి చూచి] అదిగో వేగుచుక్క పొడిచినది.

రంజ:—ఒక కాగితమును కలమును దెమ్ము.

ప్రియంవద వానిని బట్టుకొని వచ్చును.

రంజని వాని నందుకొని యాలోచించి యొక లేఖను వ్రాసి "ప్రియంవదా! ఇది విను"

"ప్రియసోదరా! నేనీరాత్రియంతయు రంజని కడను ప్రభాకరుని కడను గడపితిని. వా రెటులనో మనకుట్ర గ్రహించిరి. అందుకుం దగినప్రతీకారము చేయుంబోవుచున్నారు. కనుక నేను రేపు పగలంతయు వీరికడనే గడిపి, యానందమును గలిగించి, రేపురాత్రి వెన్నెలలో వేంట వేడుక పుట్టించి ప్రభాకరుని నడవులలోనికి గొనిపోవుదును. రేపు రాత్రి ప్రభాకరుని నెవ్వరు నచ్చట నాటంకపఱుప కుండులాగున కావలివారలకు నాజ్ఞ యిమ్ము. ఎల్లుండి యుదయముననో, మధ్యాహ్నముననో కాని నీకుం గనంబడంజాలను. కావున నీయుత్తరము వ్రాయుట యైనది. నేజెప్పిన చొప్పున ననుజ్ఞ వ్రాసి ప్రభాకరుని కనుకూలముగ—కాదు నా కనుకూలముగ—ఈవార్తావహునిచేత నంపెద వని నమ్ముచున్నాను.

ఇట్లు

నీ నమ్మిన ప్రియసోదరుఁడు,

కమలాకాంతుఁడు."

ఎట్లున్నది!

ప్రియం:—బాగుగ నున్నది.

రంజ:—మఱచితివి. పామునుబట్టి మణియొక మాఱు తీయుము.

ప్రియం:—అవును. మణితీయుట మఱచితిని, అది గోడ తలుపు తెఱచెను.

కమలా :—ఎల్లుండి అయినదా! నేఁడోవచ్చునా?

ప్రియం :—ఆగుము. కదలిన మొదల సీతల మొగురఁగలదు. ముద్ర వేయు నంగర మిటు తెమ్ము.

రంజ :—ఇయ్యనిచో చేయి నఱికి యిటు తెమ్ము. మనమే తీసికొందము.

కమల :—వలదు తీసి యిచ్చెదను. (ఉంగరమిచ్చును.)

ప్రియం :—పిరికిపందా! ఇఁక గొందెము లోనికి జరుగుము. అని తలుపు మూసి బిగించెను.

రంజ :—[ఉత్తరముపైఁ గమలాకాంతుని ముద్ర వైచి] ప్రియంవదా! ఇదిగోఁ తీసికొనుము.

ప్రియం :—సరే పోయి వచ్చెదనని యాలేఖను గైకొని యంతిమోహిని గృహమువైపు చనియె.

రంజ :—శుభమగుఁగాక. అదిగో యిప్పుడే యరుణోదయమగుచున్నది. ప్రభాకరుని దర్శనమై యెన్నాళ్లైనదో! యనుచుఁ గాలకృత్యములఁ దీర్చుకొనుటకై యుపవనమునకుం జనియెను.

ఎన్నియో నాళ్లు కాలేదు. ఒక రాత్రియే వియోగము కలిగినది. ప్రేమగలవారి కదియే పెక్కుయుగములై తోఁచును గాఁబోలు!

౭

ప్రభాకరుఁడు యవనదేశమున రాజప్రాసాదమునఁ బంజరములోఁ బెట్టఁబడిన రాకుమారి ముద్దుచిలుకవలెఁ బెంపఁబడుచుండెను. అతనికి సమస్తసౌకర్యములు కూర్పఁబడెను. ఏమియుఁ గొఱఁత లేకుండెను. ఆయాటలు, పాటలు, నాటక ప్రదర్శనములు నుద్యానవనవిహారములు, నిరంతరము సాగుచుండెను. ఒక యవనవృద్ధు వచ్చి ప్రభాకరునకు యవనభాష నేర్పుచుండెను. రంజనియుఁ బ్రభాకరుఁడును యవనభాషలోనే ముచ్చటించుకొన మొదలిడిరి. చిత్రకారిణులువచ్చి యార్య

యువనయువతుల వేషరూపసౌందర్యముల హెచ్చుతగ్గుల గూర్చి ప్రభాకరునితోఁ జర్చించి పోవుచుండిరి. అప్పు డప్పుడు చక్రవర్తియుగు నలకసుందరుఁ డేవో వింతవింత పుష్పములను ఫలములను నలంకారములను, ప్రభాకరుని కంపుచుఁ దాను స్వయముగవచ్చి యిష్టాగోష్ఠి సలిపి పోవుచుండెను. రంజని వచ్చి యానూతనపుఁ గానుకలగురించి సరసముగఁ బ్రసంగించి యువనదేశముయొక్క యౌన్నత్యము సంచుక గర్వముతో నుగ్గడించుచుండును. మఱియొకప్పుడు తలవంచుకొని "ప్రియసఖా! ప్రభాకరా! నిజమునకు మా వారివి పై మెఱుగులే సుమా! ఇది యుత్తరువ్రాసిన చేతిపువ్వా? కాని మీలో నట్టివి లేవు కదా!" అని మెల్లగఁ బ్రభాకరుని హస్తమునఁ దన మోము కప్పుకొని పలుకుచుండును.

మేడపైని గదిలోఁ గమలాకాంతుని కంఠముపైఁ దనబాహు మొన పెట్టి మాటలాడుచున్నపుడు ప్రభాకరుఁ డులికిపడి నిద్రనుండి మేల్కాంచెను. గదిలో సుగంధతైల దీపములు నిశ్చలముగ వెలుఁగుచుండెను.

ప్రభాకరుఁడు తటాలున లేచి గవాక్షముకడ కరిగి యవ్వలి యంధకారములోనికి దృష్టిఁ బ్రసరింపఁ జేయుచుండెను. దూరమున రంజని మేడజాలకములనుండి వెలుఁగు కనఁబడుచున్నది. ఆకసమున రంగు రంగు పొగడపువ్వు బుడ్డవలె నక్షత్రకోటి మెఱయుచుండెను. ఈరీతిగా నతఁడు తనలో నసుకొన జొచ్చెను. "ఏమిది! ఎన్ని సంవత్సరములైనది? వత్సా! మేలుకో" అని మా తాత వచ్చి నన్నుఁ దట్టి లేపినటులు కల వచ్చినది. కలకాదు. ఇంకను నిజముగా వచ్చి తట్టినటులే తోఁచుచున్నది. ఈ గవాక్షమునుండి గగనమార్గమున వెడలిపోయెను. జాలకము లడ్డురాలేదు. కాఁబోలు? ఇంత పిచ్చివాఁడ నగుచుంటి నేమి? కలఁగంటిని! కల్లయా? నిజమా? అని సందేహమా! నేను మేలుకొన్నను నిద్రించుచున్నను సర్వము స్వప్న కథవలెనే

యున్నది. ఇది వఱలో మూఁడంకములైనది. ఋషివాటిక మొదటి యంకము. రెండవ యంకము చెఱసాల. ఇది మూఁడవ యంకము రాజమందిరము. మొన్న రంజనితోఁ గలిసి వేషమువేసి చూడ లేదా? వటుని సౌఖ్యము నా సౌఖ్యము నొక్కతీరున నున్నవి. నాటకము చూచువారి కానందము కాని వేయువారి కాయానంద ముండదు గదా? ఎక్కడ చెల్లెక్కడుండె నాసాటి ఋషిబాలురతో గంగా తీరమున నాటలాడికొనిన కాలము తిరిగి యెన్నఁడైన వచ్చునా! పాలఁబోలునా గంగ, పావన మగునా గంగలోఁ బావనిగద! ఆ గంగా నదిలోఁ దిరిగి నే నెన్నఁడైన స్నానము చేయుదునా! పందెమువేసి యద్దరికాఁకి వెంటనే యిద్దరికి వత్తునా? ఆహా! ఎంతోపాపినై నఁటిచితిని. శ్రావ్యమగు సామగానము నా కర్ణముల స్పర్శవఱచి యెన్ని సంవత్సరములైనది? ఆ కమ్మని హోమధూమము నే నెన్నఁడైనఁ దిరిగి యాఘ్రాణింతునా? నా కీయుత్తరువులు, పక్షులు, చందనములు, పట్టుపరువులు, వెండిగిన్నెలు, మరబత్తులు, ఆటపాటలు, హాస్యములు, వనవిహారములు, ప్రేమగోష్ఠులు, వెగటై మొగము మొత్తుచున్నవి. ఇనుముతోఁ జేసినను బంగారముతోఁ జేసినను సంకెల సంకెలయే గాని మఱేమగును? నేను దిరిగి యార్యావర్తములోఁ బడిపోవలెను. మొట్టను బడినచేప గిజగిజఁ గొట్టుకొని నీట బడుచుండుటలేదా? ఎవరిస్థానమున నెవరి దేశమున వారుండుటయే భగవంతుని సృష్టినియమము కాని రంజని నాతోఁ గూడ వచ్చునా? ఆమెయే నా కీరూపతృష్ణ కలిగించినది. పాల సముద్రము కంటెను, జేనెసముద్రము కంటెను, ప్రియమగు నిజసౌందర్యసాగరము నాకెడ్డు చూపుచున్నది. స్నేహమాత్రమునఁ బ్రియవచనోపచారములచేఁ ముందడుగు పడకుండులాగున దానితో బంధించుచున్నది. ఆ మచ్చిక, యాచూపులు, యామాటలు, యా స్నేహము, స్నేహితురాలికంటెఁ సాక్షాత్సోదరికంటెఁ నెక్కువగా నాయందుఁ గనఁబఱచు నా ప్రేమ

సర్వమును శోధించికొని పోవలయును. నాకడ బనిలేకయే యేమేమో మాటలాడుచు నూరక సంభాషణము పెంచుచుండును. ఇంతింతనరాని యానందమునొందు నాకస్య—ఇదిగో వచ్చుచున్నది. ”

రంజని దూరమునుండి చిఱునగవుతో వచ్చుచుండెను. ప్రభాకరుఁ డామెను సమీపించెను.

రంజ:—ప్రియసఖా! అట్లు చూచుచుంటి వేమి? నీ కన్నులెఱ్ఱఁ బాఱినవి. రాత్రినిదుర సరిగ పట్టలేదా?

ప్రభా:—రాత్రులు నాకు నిద్ర సరిగపట్టుట లేదు. నీ కంటి కొలుకులఁగూడ నెఱు వున్న దేమి?

రంజ:—నాకును గన్ను మూతపడదు. త్రాగలేక బోర్ల తన్నినపాలవలె వెన్నెల యెంతవ్యర్థముగాఁ గాయుచున్నదో యని తోఁచుచుండును. అందఱు హాయి నిచ్చుచున్నదను చల్లగాలి నా హృదయములో నేమో రగులుగొల్పుచుండును. స్తబ్ధమగు ప్రకృతి యందలి సౌందర్యమును రేపి దానిముందర నా రూపము డిందుపఱచి నాకు నిస్పృహత కలిగించుచుండును. నా యుద్యానవనమునకుఁ బోయితినా యందలి పూలత లప్పుడే వికసింప నేలయని నాకుఁ గోపము గలుగుచుండును. నీ కడకు వత్తునా యన్నియు మఱచి పోవుదును. ఒక్కొకతరి నన్ను నేనే మఱచి పోవుచుందును.

ప్రభా:—నీ విచ్చటికి రానపుడు నేనును మా యార్యావర్తము పోవలెనని యెన్నియోసార్లు కోరుకొనుచుందును. మనోనిశ్చయము చేసికొనుచుందును. కాని నిన్నుఁ జూచినతోడనే నా కోరికలు సంకల్పములు నన్నియు నీడేరినటులనే హృదయమున కెక్కడలేని శాంతియుఁ గలిగి బాలునివలె నీ సల్లాపముల నెంతకాల మైనదియు నెఱుఁగకుండ విందును. మనోరంజకమగు కలయందువలె నెన్ని సంవత్సరముల యనుభవమో యొక త్రుటికాలములోఁ గలుగుచుండును,

ఎన్నిగంటల కాలమో యీ సల్లాపసౌఖ్యమున మునింగి తేలియాడు చుండు మనకుఁ దెలియకుండఁగనే జరిగి పోవుచుండును.

రంజ:—మనసుకలసినవారి కది సహజమేకద.

ప్రభా:—కాని నేఁడు నాకొక కల వచ్చినది.

రంజ:—కలవచ్చిన వచ్చుగాక! అందుకు నీవు 'కాని' యననేల? చూతము. ఏమనివచ్చినది చెప్పుము.

ప్రభా:—దైవమున కసూయ మెండుగదా యని నేను 'కాని' యనవలసి వచ్చినది.

రంజ:—(మోమున నించుకదిగులుపాటు పొడసూప) నీ మాటలు నా కేమియు బోధపడుట లేదు. ఏమైనను మన మిరువుర మొకటే కాని రెండు కాదు. నేనట్లు కానేరను. నీవు కావలదు. పాపిష్టి దైవము మనల నేమిచేయగలఁడో చూతము? ఏమందువు?

ప్రభా:—రంజనీ! నిన్నరాత్రి నీవు వచ్చెద వని నేను 'పేరిస్' తీర్పు దీసిపెట్టుకొని చదువక నీకొఱకై యెదురు చూచుచు వేచి యుండియుండి యెప్పుడో నిదురఁబోయితిని.

ఆ నిద్రలోను కలవచ్చినది. ఋషివాటిక భస్మమైన తరువాత మఱునాఁడు మా తాత నన్ను వెదకికొనుచుఁ గాలిపోయిన గుడిసె లలో దిరుగుచుండెను. ఈ మేడపైనుండి నే నతనిని జూచితిని. అతఁడు పెన్నెలుఁగెత్తి ప్రభాకరా! అని పిలుచుచుండెను. ఆ పిలుపు నాకు వినఁబడుచుండెను. కాని కంఠస్వరము మునుపటివలె లేదు. నేను 'ఓ' యని పలుకఁబోయితిని కాని నా కంఠము మందారమాలతో బిగించఁబడెను. నా కనులనుండి కన్నీరు వరదవలె నా ర్యావర్తము మీఁదుగాఁ బ్రవహింపఁ జొచ్చినది. ఇంతలోఁ గమలాకాంతుఁడు వచ్చి "ఓరీ! కులభ్రష్ట! నీచా! యని యేమేమొ మనము నోటితో నుచ్చరించుటకూటుండ మనసునఁ దలఁపనైనరాని మహాపాతకము మనయిరువురపై మోపి నా కంఠముపైఁ దన బాకు దీసి పొడువఁ

బోయెను. ఇంతలోఁ బెద్ద మెఱుఁగు మెఱసిన ట్లయ్యెను. నేఁ గనుల మూసికొంటిని. కనులా కాంతుఁ డేమయ్యెనో నే నెఱుఁగ. నా తాత వచ్చి తన చల్లనిచేతులతో నన్నుఁ దట్టుచుఁ "ధర్మము కాపాడుకో—నాయన! ఆపదలుపొందకు వత్సా! మేలుకో" యని నన్ను లేపెను. తోడనే నాకు నిజముగా మెలఁకువ వచ్చి లేచి కూర్చుంటిని. ఆ వృద్ధ ఋషియు వెనుదిరుగకయే—తన నెరసిన కనుబొమలు భ్రూమధ్యమునఁ గలియ నా ముఖముపైఁ దన నిశ్చలదృష్టి నిలుపుచు నీగవాక్షమునుండి దూదిపింజవలె దాఁటి తెల్లమబ్బువలె నంతరాళమునఁ దేలియాడుచు జరిగిపోయెను. కడుదూర మేఁగుటయు నేను నిశ్చేష్టుఁడనై కన్ను మూయక చూచితిని.

"ఏమందువు? అని నన్నడిగితివి. అంతయుఁ జెప్పితిని. ఏమందువో చెప్పుము."

ప్రభాకరుఁ డిట్లు తన స్వప్నవృత్తాంతమంతయు సన్నని కంఠస్వరముతో నవిచారంబగు మోముతోఁ దనచేతులతో యవనరాజకుమారి రెండు చేతులు పట్టుకొని తలవంచుకొని చెప్పి ముగించుచుండ రంజని తన బాహులతలు సాచి యాతనిఁ గౌఁగిలించుకొని మోము పైకెత్తి నయనంబులతోఁ బ్రార్థించుచు, "హృదయేశ్వరా!" అని సంబోధించెను. ఆ కంఠస్వరముకూడ దీనాలాపమునే సూచించుచుండెను. ఇదివఱకెన్నఁడును బ్రభాకరుఁ డట్టిచర్యలనుగాని, సంబోధనను గాని చూచి యుండలేదు. విని యుండలేదు.

ప్రభా:—ఏమిటిది?

రంజ:—ఏమందు వని యడిగితివికదా! నన్ను బ్రియా! యనుము. ఇదివఱకెన్నఁడును నేను నిన్నుఁ గోరలేదు.

ప్రభా:—(రంజని బాహుపాశములను మృదువుగాఁ దొలఁగించుకొని యావల నిలిచి) రాజకుమారీ! ఇది పాడియా!

రంజ :—ప్రభాకరా! నామాట లొక్కింత శాంతముగ నాలింపుము. నీకు నేనును నాకు నీవునుగాక మఱియెవ్వరు కలరు! ఇంతవఱకు మనలో మనకిట్టి ప్రవృత్తియే రాకపోయినను నా తండ్రి నాపైఁ గ్రోధమువహించెను. కన్నుకుట్టి కమలాకాంతుఁడు నంతిరోహితుఁడు మొదలగువారందఱుఁ గూడ నేడ్చుచున్నారు. నిన్నొకప్రశ్న నడిగెదను. మర్మము విడిచి నీవు నాకు నిజము చెప్పెదవా! చెప్పఁజాలవా!

ప్రభా :—నాకడ మాయ లెన్నఁడైనఁ జూచితివా? తప్పక చెప్పెదను.

రంజ :—నీవు నన్నుఁ బ్రేమించుటలేదా? ప్రేమింపవా!

ప్రభా :—నెచ్చెలీ! అది నీ వెఱుఁగవా?

రంజ :—"అట్లయిన మన మొండొరులఁ బరిణయమై" స్త్రీసహజమగు సిగ్గు, ప్రేమ జనియించి యామెనోటి కడ్డమై మాట వెడలనిచ్చినదికాదు. రంజని మొఱ్ఱబారిన తన మోమును బ్రక్కకుఁ ద్రిప్పి రెండుచేతులతోఁ గప్పుకొనెను. ప్రభాకరునకు స్వప్నమందు తాత చెప్పిన వాక్యముల కొక క్రొత్తయర్థము స్ఫురించుచున్నది. "ధర్మము కాపాడుకో—నాయనా! ఆపదలఁ బొందకు—వత్సా మేలుకో!"

ప్రభా :—మన మొండొరులఁ బెండ్లియాడుట యెట్లు?

రంజ :—ప్రేమ గలవారి కాప్రశ్న యర్థమే కాదు.

ప్రభా :—కేవలము నింద్రియములకు వశ మగుట మానవులకు హైన్యము కాదు! నే నార్యుఁడను. నీవు యవనయువతివి.

రంజ :—నా తండ్రియు నిట్టిదే కాఁబో లర్థములేని రెండు శబ్దములు ప్రయోగించెను. స్వజాతి యఁట—స్వధర్మమఁట! ప్రభాకరా! నీవే నా కనేక పర్యాయములు చెప్పితివి. అందఱకు భగవంతుఁ డొక్కఁడే. ధర్మము నొక్కటియే యని. మానవుల నందఱ నాదేవుఁడే కాదా సృజించినది?"

[ రంజని నేఁడు వేసినప్రశ్న యొకనాఁటిరాత్రి ప్రభాకరుఁడు తన తాత నడిగెను. అంధకారమున మెఱుపు మెఱసిన విధమున వాని తాఖుషీ చెప్పినయుక్తి సాదృశ్యపూర్వక సమాధానము జ్ఞప్తికి వచ్చెను. ]

ప్రభా :—గోజాతి యంతయు నొకటి కాని యందంతర్భాగము లున్నవి కావా! వర్ణాశ్రమధర్మము నాజాతి యొక్క వ్యక్తిత్వ లక్షణము! నే నిప్పటికే చాలవఱకు వాఁ డన్నట్లు కులభ్రష్టునైతి.

రంజ :—నా సహవాస మూలముననే?

ప్రభా :—ఎన్నటికిఁ గాదు. నే నాకర్మభూమిలోఁ బుట్టుటచేత నామన సిదివఱకే డోలాయమాన మగుచున్నది. నన్ను రెండుశక్తులు చెరియొకవైపునకు లాగుచున్నవి. నేనేమియుఁ జెప్పజాలను. నా హృదయ మూరక కొట్టుకొనుచున్నది. కాని మనసున యాలోచన లన్నియు స్తంభీకృతమయ్యెను. రంజనీ! నీవే నా హృదయరంజనివి? నిన్ను నేను ప్రేమించుచుంటిని. అది ముమ్మాటికి సత్యము. కాని—

రంజ :—చాలు నేజీవించి యుండెదను. ఇఁక నీ వేమియుఁ జెప్పవలదు. నా జన్మము ధన్యంబైనది. తుచ్ఛభోగములు తాత్కాలికములు. క్షణభంగురములు. ఆమరణాంత మిటులనే యుండవచ్చును. "ఒక్కసారి నా హృదయరంజనీ" అని పిలిచితివి. ఇఁక నాకుఁ బెండ్లి యనవసరము. ఈయున్నటు లున్నఁజాలును. కాని యీ పాపిష్ఠిదైవమునకు నీవు చెప్పిన ట్లసూయ మెందుకదా!

ప్రభా :—ఇదియేమి! నీవుకూడ నామాటయే యనుచుంటివి.

రంజ :—ఇంతవరకు నీకఠినచిత్తురాలు నీకు రానై యున్న మహాపద నెఱింగియు నీకడఁ జెప్పక జాగుచేసినది క్షమింప వేఁడుచున్నది. ఇదివఱకే లోకమంతయు మనలనుగూర్చి యనేకముగఁ జెప్పుకొనుచున్నది. నా తండ్రివచ్చి నిన్నుఁ బ్రేమింపవలదని యేమేమొ యుపన్యసించి మందలింపఁ జొచ్చెను. పిరికిపందయుఁ మదాంధుఁడును

నగు నా చెప్పరానివాఁ డంతియోకునితోఁ గలసి కుట్రచేసి నిన్ను నేఁటిరాత్రి——

ప్రభా :—చిరునగవుతో నిటుచూడు ఒక మనుష్యమాత్రుఁడు వేఱొకనిని సాధింపఁగలడన్నమాట కేవలము భ్రమ. "ధర్మఏవహతో హంతిధర్మోరక్షతిరక్షితః" అను మవయార్యోక్తినీ వెఱుఁగవా? ఆ శివు నాజ్ఞలేనిది చీమైనఁ గుట్టనేరదు. ఊరక దిగులుచెంద నేల? కాక యీ వచ్చెడివారి బలసాహసములఁ గొద్దియో గొప్పయో నేనును జూచెదను గాని వారి నూరక విడువను. ఇప్పుడు మనకు విచారమేల? నాకు సూర్యోపాసన చేయవలెనని కోరిక కలుగుచున్నది. అది నుంచి పని కాదా! మఱచితిని వెనుక దానినొకప్పుడు మిక్కిలి మెచ్చి పొగడితివి జ్ఞాపక మున్నదా?

రంజ :—అటులే చేయవచ్చును. (అని యిరువురు నిష్క్రమించిరి)

ఇంతలోఁ బ్రియంవద వచ్చి అమ్మా! అమ్మా! రంజనీ! అని పెక్కుసారులు పిలువగా——

రంజ :—తిరిగివచ్చి "యు దేమి? అప్పుడే వచ్చితివి?"

ప్రియం :—ఔ నౌను. కాదా మఱి.

రంజ :—నీ పరిహాసముల కేమిగాని కార్యమేమి చేసితివి?

ప్రియం :—ఎంత గడుసుదానవమ్మా! నే నడుగఁ దలఁచు దానిని ముందుగ నీవే యడుగుచుంటివి!

రంజ :—సిగ్గును మందహాసముచేతను, మందహాసము గోపము చేతను గప్పివుచ్చఁ బ్రయత్నించుచుఁ "జాలు చాలు! నీవు నాకేమి కార్యము నొప్పగించితివి?"

ప్రియం :—నే నొప్పగించితి నంటినా? నీయంతట నీవే యొప్ప గించుకొనుచుంటివి. నిన్నప్పగింత లప్పగించువా రెవ్వరు?

రంజ :—ఎక్కడను లేనిచిత్రము?

ప్రియం :—అదే నాకు మహావిచిత్రముగా నున్నది.

రంజ :—ఊరక యున్న నేమిప్రయోజనము? నే నెవరికి రాయబార మొనర్పఁగ
గించు కొనుచుంటిని?

ప్రియం :—పోసీగాని యెంతపిలిచినఁ బలికినావు కావేమమ్మా?

రంజ :—అవ లేమిజరిగినదో చెప్పవు. నాకిక్కడ జాగుసేయుట
కవకాశము లేదు. కార్య మేమి చేసితివి?.

ప్రియం :—ఇక్కడ జాగుసేయుట కవకాశము లేదా! నిజమే
యా మాట. ఎక్కడ జాగు సేయవలయునో!

రంజ :—(దానిచేయిపట్టుకొని) రా యాస్థలము చూపించెదను.
(అని యిరువురును వెడలిపోయిరి.)

## ౨

"వాయువశంబు లైరయఁగనీ వారిధరంబులు మింటఁ గూడుచుం బాయుచు నుండు
కైవడిఁ బ్రపంచము సర్వము కాలతంత్రమై పాయుచు గూడుచుండు నొకభంగి
చరింపదు."—భాగవతము.

వేఁటకాని వేషము ధరించిన ప్రభాకరుఁడును వానిసాగనంపుటకై
రంజనియు నగరము వెలుపలివఱకు వచ్చిరి. రాత్రి రెండుయామములు
జరిగిపోయినవి. నగరము విడిచి చాలదూరము వచ్చిరి. నగర సింహ
ద్వారముకడ పహరా నిచ్చుచు నిల్చినవారి సంకేతవాక్యము దవ్వుల
నుండి వినవచ్చుచున్నది. ఇరువురప్రక్క నొక్కొక గుఱ్ఱమున్నది.

ప్రభా :—ప్రియసఖీ! ఇఁక సెలవా పోయివత్తునా? గుఱ్ఱము
నెక్కుము.

రంజ :—తిరిగి రామొన్నటికో!

ప్రభాకరుఁడు తటాలున గుఱ్ఱము దిగి నీ వామాటఁ దలపెట్టిన
నా కడుగు పడుటలేదు. భావి యెల్ల నగమ్యగోచర మగుచున్నది.
మన మిక్కడనే హాయిగ నుందము, అట నాకొఱ కెవరేడ్చువారు!

రంజ:—ప్రభాకరా మత్ప్రాణాధికా! మన కట్టియదృష్ట
మెక్కడ? ఛీ! స్త్రీహృదయ మెంతదుర్బల మైనది. నీప్రాణాపాయ
మెఱింగియు నే నెంత స్వార్థపరాయణి నైతిని. నను మన్నింపకుము
పొమ్మని యనఁజాలకుంటివి. నన్నొకసారి గట్టిగా నిందించి మందలించి
నిన్నుఁ గాపాడుకొనుమా. ఏమన నీకపాయము కలిగిన నేఁ బ్రతుకఁజాల

ప్రభా:—పోనిమ్ము. నిజముగ రాఁదలఁచిన, మరణమునుండి
తప్పించుకొని మనమెందు పాఱిపోగలము? ఇంతకుఁ బూర్వ మెన్న
డును భయమన నేమొ యెఱుఁగను. నాకును లోకమునకును మిక్కిలి
స్వల్పానుబంధ ముండెడిది. నేఁ డాబంధము దృఢతరమగుటచేత నేమొ
కాని ప్రాణరక్షణార్థము పాఱిపోవుట మంచి దని తోఁచినది. అయిన
నేమి? భయము నేర్పిన నీవే తిరిగి ధైర్యము నేర్పుచుంటివి. నీకొఱకై
నేనిటనే యుండెద నేమగునో చూచెద.

రంజ:—వలదు - ప్రాణేశ్వరా! - వలదు. నేఁడు తప్పిన తేపైన
నున్నదే యీ యాపద—తేపు కానిచో నెల్లుండియైన నానీచుని
విడిచిపెట్టవలెను. వానిఁ దుదముట్టించినచో మొదటికే మోసము
వచ్చునుగద. వాఁడు నా మేడకు వచ్చుట నా తండ్రియే యెఱుఁగును.
ఇఁక విడిచినచో వారు కుట్రలు పన్నుచునే యుందురు. ఒకవేళ
జక్రవర్తితోఁ జెప్పి యేమిచేయింతురు - నా రెంతకైనఁ దగుదురు.
నాతండ్రియు మనకుఁ బ్రతికూలుఁడుగనే యుండెనుగదా. కావున
వలదు.

ప్రాణేశ్వరా! - వలదు నీ వాఁగవలదు. బ్రతికియుండిన నే
లోకమున...

ప్రభా:—లేనిచోఁ బైలోకమున...

రంజ:—తప్పక కలిసికొనఁగలము. తెల్లవారుచున్నది. అంతి పూఁడిచ్చిన చీటి నిటు తెమ్ము. ఇఁక దాసితోఁ బని యేమి యున్నది? పోనిమ్ము నీదగ్గఱనే యుంచుము. గుఱ్ఱము నెక్కుము.

ప్రభాకరుఁడు రంజనీ సహాయమున గుఱ్ఱము నెక్కెను.

"నీమందస్మిత వదనారవింద మీ ప్రభాకరునకు నొకమాఱు చూపవా?" యని ప్రభాకరుఁ డనెను.

రంజ:—సరసకుఁ జేరి యొక్క ముద్దు పెట్టవా! నాథా!

ప్రభా:—పాపము శాంతించుఁగాక!

తటాలున గుఱ్ఱము పరుగిడి పోయినది.

ఆకర్ణాంతము లాగి విడిచిన బాణమువలె సశ్వము వాయువేగమును మించి పోవుచుండెను.

రంజనీ చూపులును ప్రభాకరునియందు లగ్నమై వాని వెన్నంటి పోవుచున్నవి. ఆమె మనంబును నా చూపులయందె లీనమై మనోహరుని విడిచి రాలేకున్నది. కొయ్యబొమ్మవలె నారీతిఁ గొంతసేపు నిలిచి యుండి యెంతయణఁచికొనినను లోనాఁగక పైకి పొంగి వచ్చుచున్న దుఃఖవేగమునకు తేచి నిలువలేక తనగుఱ్ఱము మెడపై వ్రాలి మోము నానుకొని చిన్న బాలికవలె వెక్కి వెక్కి యేడువసాగెను. కన్నీరు కాల్వలు గట్టి యా యశ్వకంఠము నూరక తడుపుచుండెను.

అర్ధరాత్రమున నచ్చట పాప మా సుకుమారి నోదార్చువారెవ్వరు! దుర్భరవిచారము కలిగినప్పుడు మనసార నొకమాఱు కంఠమెత్తి కన్నీరు కార నేడ్చినచో నా దుఃఖము పొంగి కొంతవఱకుఁ జల్లారి యుపశమించును.

కొంత సేపటికి రంజనియే దుఃఖభారము తగ్గుటచే మోముపై కెత్తి చంద్రబింబమువంకఁ జూచుచు డాకేల నా యరబ్బీగుఱ్ఱము మెడ కౌఁగిలించుకొని నిలువఁబడి యిట్లు చింతింపసాగెను. "ఇప్పుడు మా యమ్మయే యున్నచో నేనిప్పు డేమిచేయుదును? కష్టము సుఖము చెప్పుకొని యాలోచన నడుగుద మన్ననాకు నా యన్నవారెవ్వరు

గలరు? లోకైకవీరుఁడగు యవనసామ్రాట్టున కేకపుత్రికను. గారాబు
తనయను. తోడు నీడ లేక యర్ధరాత్రమున నూరి వెలుపల నిల్చి యిట్లు
వాపోవుచుంటిని. నా కేమని నగరుప్రవేశింతునా? నేనా ప్రభాకరుని
శూన్యమందిర మెటులఁజూతును? ఆయుద్యానవనము లన్నియు
నానేత్రముల కిపుడు శ్మశానవాటికవలె భయంకరములై తోఁచు
చున్నవి. నా తండ్రిమోము తిరిగి చూచుటకుఁ గూడ నాకు మనస్క
రించుట లేదు. ఎందుఁబోవుదు? నాథునోహరుని వెన్నంటిపోవుదునా?
పాపము శమించుఁగాక! అతఁడు మాత్రము నన్నేల యాదరించును?
ఆదరించువాఁడేయైన చివర కామాటల యప్పగించిపోవును? ఇంక
నన్నియో చెప్పఁదలఁచుకొంటిని. ఏమియో యడుగఁ దలఁచుకొంటిని.
ఒండొరుల హృదయములు పెనవేసికొని సాగుచున్న స్నేహలత తటా
లున దెగిపోయినట్లయినది. తుదకు నే నేరికి నక్కఱలేనిదాన నైతిని.
అయినచో నీచుఁడగు నా మదాంధుని చేఁ బడనుంటినా? నీకు మఱికొంత
స్వాధీనమగుటకై నన్నా ఘాతకునికి స్వాధీనము చేయుదువా? నీసామ్రా
జ్యమునకు మేలగునెడల నన్ను వేయువిధముల బలి యీయరాదా?
నే నెంత అసహాయనైనను నా మానసంరక్షణము చేసికొనలేక పోను.
ఆర్యావర్తమున నే దీనబంధుని పాదముల నాశ్రయించినను నాకుఁ
దరుణోపాయము గలుగఁగలదు. ఆ మునులు, యోగులు, శరణాగత
త్రాణబిరుదాంకితులు. పాప మా కమలాకాంతుని తెల్లవారిన పిదపఁ
బ్రియుండవదయే విడుదలచేయును. నేనును రాజమందిరములను వీడి ఋషి
వాటికలనుఁ జేరఁ బోయెదను."

అని యనుకొనుచు నశ్వము నారోహించి రంజని తూర్పు దిక్కుగాఁ
బయనము గావించెను. ఆహా! యెంతచిత్రము! నిజముగఁ దాను
గోరుచున్న దేమో తానే తెలిసికొనలేక పోవుచుండెను. రంజని తాను
దన్నెంతచక్కఁగ మోసగించుకొనుచున్నది. తా నార్యావర్తము పోవు
చుండుట ప్రభాకరుని కొఱకు కాదఁట! ఏమిచిత్రము!

౬

ఎక్కడ విన్నను నొక్కటే మాట! "చక్రవర్తి కూఁతు రార్యునితో వెళ్లిపోయిన" దని యీవిషయమే స్థలకాలపాత్రల ననుసరించి వేర్వేఱు రూపములఁ దాల్చుచుండెను. అలకసుందరునకుఁ బట్టరాని కోపము దుఃఖము నావేశించెను. తన మేడపై నేమిచేయుటకును దోఁచక యూరక పచారుచేయుచుండెను. అంతిమోహుఁడు తేలు కుట్టిన దొంగవలెఁ దనమీఁద నెక్కడ విరిగిపడునో యని లోలోన నిక్కిలి భయపడుచుండెను. రంజని యంతఃపురమునఁ బ్రియంవద గోడ తలుపులు తెఱచి కమలాకాంతు నీవలకుఁ దీసికొని వచ్చినది. కమలుఁడు మిక్కిలి నలిగి వాడి పాలిపోయినట్లుండెను. ప్రియంవద యాతనితో నేమియు మాటలాడలేదు. ఆతఁడాయువతి నేమియు నడుగలేదు. తలవంచుకొని తనదారిఁ బోయెను. ఎట్టకేలకు నలక సుందరుఁడు తన కాప్తుఁడగు కమలాకాంతునితో మంతన మొనరింపఁ దలఁచి పిలువనంపెను. కాని "వాఁడు మందిరమున లేఁడు—నగరమున లేఁడు—ఎందును వాని జాడయే గానరాదని" సేవకులు వచ్చి రాజునకు భయపడుచు విన్నవించుకొనిరి.

అలక:—పోయినవారినిఁ బోనిందు! అంతిమోహునిఁ దక్షణమే తీసికొనిరం" డని సేవకుల కాజ్ఞాపించెను. వారు చనిన వెనుకఁ దనలోఁ దానిట్లాలోచించుకొనుచుండెను.

"ఒకవేళ నిదియెల్ల నా కమలుని కపటమే కాదు గద! మొన్న రాత్రి వాఁడు రంజనిమేడ కరుగుచు నాకుఁ గనఁబడెను. తిరిగి వాని జాడ లేదు. నిన్న రాత్రి యానీచులు పరారియైరని తెలియుచున్నది. ఈ రెంటికి నేమైన సంబంధ ముండితీరవలయును. మొట్టమొదటఁ బ్రభాకరుని విడుదలచేయించుటకును వాఁడే కారణము. ఒకవేళ నా దేశద్రోహికిఁ బశ్చాత్తాపము కలుగలేదుగద!—అతని కట్టి పాపము పోఁశకుండుటకేగద. భరతఖండమున కతనినే రాజుగఁ జేసెదననియు

రంజని నాతనికిచ్చి పెండ్లిచేసెద ననియుఁగూడ నానలు గొలిపితిని.— అయినచో నేమి యీచిత్రము! ఈమూఁడు పరారుల కేమికతంబు ? ” ఇట్లు వితర్కించుచుండ నంతియోకుఁడు రాజుమ్రోల .సాష్టాంగపడి “ ప్రభూ! యేమి యాజ్ఞ ” యనెను.

అలక :—[ముఖము నిదానించి చూచుచు] నీవు వినలేదా ? ప్రభాకరుఁడు నిన్నరాత్రి పరారి యయ్యె. రంజనియు నంతఃపురమున లేదు. కమలాకాంతుఁ డెచ్చటను గానఁబడఁడు.

అంతి :—ఏమేమి? ఇంతవఱకు నేమియు నెఱుఁగకుంటిని !

అలక :—మనజాగ్రత్త యీలాగున నున్నది. నిన్నను, నేఁడు, నగరద్వారమున నెవరు పహరా యిచ్చుచుండిరో ప్రభాకరుని మందిరముకడ నెవరు కాపుండిరో వారి నెల్లఁ దర్జనభర్జన చేసినఁ గొంత నిజము తేలఁగలదు.

అంతి :—ఏమని విన్నవించుకొందును ? ఇది యేదియో దైవమాయగ నున్నది. అవశ్యము కావలివారల నిలువఁదీసి కనుగొనియెదను. కాని కమలాకాంతునియందు మనము తగనివిశ్వాస ముంచితిమేమోయని తోఁచుచున్నది. గూఢచారులఁగూడ నీకార్యమందు నియోగించెదను.

అలక :—మంచిది. తూర్పుదిక్కునకుఁ గొందఱ జవనాశ్వములపైఁ బంపవలయు. వారు మఱొకదిక్కునకుఁ బోయి యుండరు. వెంటనే యీ పనులు జరుగవలయు.

అంతి :—“ సార్వభౌముని యాజ్ఞ యీక్షణముననే నిర్వర్తింపఁబడుచున్న ” దని సెలవు దీసికొని పోయెను.

అలక :—నాకేమియుఁ దోఁచుటలేదు. మతిపోయినట్లున్నది. కమలాకాంతా! నిన్ననవలసిన దేమున్నది ? ఎంతచేసితివే రంజనీ ! నాతనయురాలే శత్రువులలోఁ గలసిపోయినదా ?—నమ్మజాల ? ఎవరురా యక్కడ ?

ఒక సేవకుఁడు తత్క్షణమే ప్రవేశించి "జయము! జయము! మహారాజా" యనెను.

అలక :—రంజనీమందిరమున కరిగి ప్రియంవద యనునార్య యువతి నిక్కడకుఁ దీసికొని రమ్ము. సత్వరముగఁ బోయి రమ్ము. సేవకుఁడు సెలవు దీసికొని పోయెను. పిదప నలకసుందరుఁడు తిరిగి యాలోచనా నిమగ్నుఁ డాయెను.

అలక :—"అది నిజముచెప్పునా! కాని దానికిమాత్రమీకుట్ర తప్పక తెలిసి యుండును. ఏమైన నాశపెట్టి చూచెదను. అట్లు లొంగనిచో బెదరించి చూచెదను గాక! ఏమని యానగొల్పుదును? బంగారమును వారు చిల్ల పెంకులుగఁ జూతురుగద. ఆజాతివారికి స్వేచ్ఛయే ప్రాణము. గౌరవమే జీవనము. కావున యీ బానిసతనమునుండివిడుదల చేయించెద నని చెప్పి చూచెదను. ఏమనునో?"

అని యనుకొనుచుండ యువనతశిరస్కయు మితాలంకార శోభితయు సుందరగాత్రియునగు ప్రియంవద ప్రవేశించి "జయము జయము సార్వభౌమ! ప్రభువువారి యాజ్ఞానుసారముగ దేవరదాసి ప్రియంవద యిదిగో వచ్చి యున్నది.

అలక :—ప్రియంవదా! ఇటు రమ్ము. వచ్చి యీయాసనమునఁ గూర్చుండుము. నీతో మిక్కిలి ముఖ్యమగు విషయమును గుఱించి మాటాడఁ దలఁచి పిలిపించితిని - రమ్ము - సందేహించెద వేల? వచ్చి యీకుర్చీపైఁ గూర్చుండుము. నీవు నా ప్రియకుమారియగు రంజనికి నెచ్చెలివి కావా? నాకు మీయిరువురియెడ సమానానురాగమే కాని యెన్నఁడును వేఱు లేదు. ఆ సంగతి నీకుఁ దెలిసియే యుండ వచ్చును.

ప్రియం :—నన్ను మీరెక్కువగా మన్నించుచుండిరి. ఈగౌరవమునకు నే నెట్లర్హురాలను గాఁగలనో కదా! నాకట్టిశక్తి భగవంతుఁ డనుగ్రహించుఁగాక!" అని నిర్దిష్టాసన మలంకరించెను.

అలక :—ప్రియంవద! నీకది సార్థకనామము. నీకీనీచమగు బానిసతనము తగదు. నిన్నిందుండి తొలఁగించి నీకర్హమగు గౌరవస్థాన మీయవలెను. ఇటుపై నిన్నుఁ నా రంజనివలెఁ జూచుకొందును. నాకన్నకూఁతురు నన్ను విడనాడి పోయెనుగద! నీచెలి యెందేగెనో యెవ్వరికిని దెలియదఁట అయ్యో! యెందేగెనోగదా!

ప్రియం :—నిన్నరాత్రి నన్నుఁగూడ రావలదని వారించి ప్రభాకరుని మేడ కరిగినది.—తెల్లవారునప్పటి కిరువురునుగూడ లేరను గోల పుట్టినది.

అలక :—అంతగ వానినిఁ బ్రేమించుచున్నచో నేనుమాత్రమంత క్రూరుఁడనా! ఒల్లనన్నచోఁ గూఁతు మెడలు వంచి యన్యునకిచ్చి వివాహముచేయుటవలన లాభమేమున్నది? అది నేనెఱుఁగనా?

ప్రియం :—కమలాకాంతుఁడన్నచో నామె కేవగింపు. మాటిమాటికిని వచ్చి యేదో ప్రేలుచుండెడివాఁడు. ఆమె ప్రాణమెంతో కలకటం బడెడిది. పిదప మేమెంతయో యోదార్చినగాని యా దుఃఖముపశమిల్లెడిదే కాదు.

అలక :—నేఁడా కమలాకాంతుడుకూడ మాయమాయె నదేమి చిత్రమో! మొన్నరాత్రి వాఁడు మీమేడకు వచ్చుచుండఁగ నేఁ జూచితిని. కొంతసేపు మేమిరువురము మాట్లాడుకొంటిమి! మొన్నరాత్రి వాఁడు మీకడకువచ్చి యేమి ప్రసంగించెను?

ప్రియం :—మొన్న రాత్రియా? మొన్న రాత్రి కమలాకాంతుఁడు రంజని మేడమీఁదికి రానేలేదు. మొన్న తెల్లవారువఱకు మేమిరువురము కలసియే యుంటిమి. చాలరాత్రివఱకు "జానన్" బంగారు ఉన్నికొఱకు బయలుదేరుట "మేడియా సహాయమునఁ గృతకృత్యుఁడగుట" యనుకథ రంజని చదివి నాకుఁ జెప్పుచుండగ నేమేమిరువుర మెట్లో యెప్పుడో గాఢనిద్రం బడితిమి. తెల్లవారినపిదపఁ గూడ వానిని మేము చూడలేదు.

అలక :—మువ్వురు నేఁటి రాత్రి పాఱిపోయిరి. రంజనీప్రభాకరు లెందుఁబోయిరో! కమలాకాంతుఁ డెందరిగెనో!

ప్రియం :—ఎందుఁ బోయినను రంజనీ ప్రభాకరులు కలిసి యుందురనియే చెప్పఁగలను. రంజని తనతోఁగూడ నన్ను రావల దన్నది. లేనిచో వారిజాడ కొంచెమైనను గనిపెట్టఁ గలిగియుందును. మఱి కమలాకాంతుఁడు నిన్న యెఱింగియే వారి వెన్నంటి పోయి యుండును. వెంటనే నలుదిక్కులకుఁ జారులనంపినఁ దప్పక జాడతీయ వచ్చును.

ఇంతలో నొకప్రతీహారి ప్రవేశించి "జయము జయము. మహారాజా" సంగతి కొంత తెలియవచ్చినది. తెలిసినంతవఱకు విన్నవింప నాజ్ఞాపింపఁబడి దేవరసన్నిధి కరుదెంచితిని.

అలక :—మేలు! ఏమి తెలియవచ్చినది!

ప్రతీ :—కమలాకాంతుఁడు మొన్న రాత్రినుండి నేఁటియుద యమువఱకును రంజనీదేవిగారి మేడయందే యుండిరనియు, రంజనీ దేవిగారు నిన్నఁ బగలంతయుఁగూడఁ బ్రభాకరుని ప్రాసాదముననే గడపిరనియు, నిన్న నుదయము వారు సూర్యు నారాధించి, బీదలను సత్కరించిరనియు, రంజని దేవిగారి పనికత్తెయుఁ జెలికత్తెయు నగు ప్రియంవదమ్మగారు నచ్చటనే యుండిరనియు సప్రమాణముగఁ దెలియ వచ్చుచున్నది.

అలక :—కమలాకాంతుఁడు రంజని మేడయందు నేఁటి యుద యమువఱ కుండె ననుట కేమైన నిదర్శనములున్నవా?

ఈపై సంభాషణ జరుగుచుండఁ బ్రియంవద కాందోళన మిక్కుట మగుచున్నట్లు, యామె ముఖచర్యవలన స్పష్టమగుచుండెను.

ప్రతీ :—ప్రత్యక్ష ప్రమాణములున్నవి. నేఁటి యుదయముననే కమలాకాంతుఁడు రంజనీదేవి యంతఃపురమునుండి, దిగి వచ్చుచుండఁగా,

నేనీ నా రెండుకన్నులతోఁ జూచితి నని ప్రమాణము చేయుచున్నాను. ఆయన యేమికారణమో, కాని, జబ్బుపడినట్లు కూడఁ గన్పట్టెను.

అలక :—అఁగుము. ప్రియంవదా! వింటివా? ఏమి వీఁడిట్లు చెప్పుచున్నాఁడు? నీ వేమందువు?

ప్రియం :—మహారాజా! నిజము మీకే తెలియఁగలదు! నే నేమని చెప్పుదును. ఒక్కొక్కప్పుడు గూఢచారులు కూడ స్వలాభముకొఱకు లేనిపోని యసత్యము కల్పించి చెప్పుచుందురు.

అలక :—ఏమిటా?

ప్రతీ :—ఏలినవారికి నేఁజెప్పెడిమాటలయందు నమ్మకముచాలదేని నీయుత్తరము చూచినప్పుడైన నన్ను విశ్వసింపకపోరని తలంచెద నని జేబునుండి యుత్తరమొకటిదీసి మహారాజున కందిచ్చెను. అలకసుందరుఁడు దాని నందుకొని, చూడఁబోవుచుండఁ బ్రతీహారిక నిట్లు చెప్పఁ దొడంగెను.

"స్వామీ! యేమి! మీరు నేఁడు జబ్బుగ నున్నట్లగుపడు చుండిరని వినయపూర్వకముగ నేనడిగితిని. ఆయన నా ముఖమించుక పరిశీలించుచు, నాలాగున నొక్క నిమిషమాత్రముచూచి జేబులోనుండి యీలేఖను దీసి "దానిని నేలినవారి కందఁజేయుమని చెప్పి తమ యింటిదిక్కుగాఁ జనిరి. నేను నీలేఖను దమకందఁ జేయవలెనని వచ్చుచుండగా, సంతియోకుప్రభు నాజ్ఞయైనదని తెలిసి యటఁ బోయితిని. పిదప నింతవఱకు సంగతులు తెలిసికొని దేవరకు విన్నవించుకొనుటకై వచ్చియుంటిని."

ప్రతీహారి తనవృత్తాంతమును బూర్తిగఁ జెప్పి ముగించునరికి నలకసుందరుఁడును లేఖను బూర్తిగఁ జదివి ముగించెను.

అలక :—మంచిది. నీవు పొమ్ము. వారెచ్చటికిఁ బోయిరో యరసికొని రమ్ము.

ప్రతీహారి సెలవు దీసికొని పోయినపిదప నలకసుందరుఁడు ప్రియంవద దిక్కు మొగంబై "ఏమి! అట్లుంటివి" యని సెమ్మదిగఁ బ్రశ్నించెను.

ప్రియం:—ఎట్లుంటిని? రంజనిని బాసిన నాకేమియుఁ దోఁచుట లేదు. ఎట్లో విచారముగ నున్నది.

అలక:—పోనిమ్ము! నీకనుజ్ఞ యిచ్చిన నీవుకూడ మాయార్యావర్తము వెళ్లెదవా?

ప్రియం:—(కొంచెముసేపు మాటలాడక నేలఁ జూచుచు నూరకుండి) రంజనీప్రభాకరు లార్యావర్త మరిగిరని తెలిసినదా? ఆయుత్తరములో నా విషయమేమైన వ్రాయఁబడినదా? అది నిజముగఁ గమలాకాంతుఁడు వ్రాసినదేనా?

అలక:—ఇదిగో బాగుగఁ జదివి పరీక్షించి చూడుము.

ప్రియంవద కంపితహస్తముతో నాకమ్మ నందుకొనుచుండ,

అలక:—ఏమమ్మ నీ దేహమట్లు కంపించుచున్నది! దేహములో నేమియునస్వస్థత లేదుగద? ఉన్నచోఁ జెప్పుము. దాచకుము. రాజవైద్యులఁ బిలిపింతును. ఎవరక్కడ?

ప్రియం:—ఏమియు వలదు. నాదేహము సంపూర్ణారోగ్యస్థితియందే యున్నది. (అని వణకుచు) ఈయుత్తరము వానిది కాదని తోఁచుచున్నది. ఇది యంతయు నొక చక్కని కల్పితకథవలె నున్నది. ఒక మహావీరుని నిరువు రబలలు బంధించి రన్న నమ్మఁదగిన మాటయేనా? తనచేతి ముద్రికను బలాత్కారముగ లాగుకొనిరా? కథ కల్పించినను నమ్మదఁగి యుండవలెను. అబద్ధము చెప్పినను నిజమాండి నట్లుండవలదా? ఈయుత్తరమే నిజమైనచోఁ దాను నిరాయుధుడనని వ్రాయుచున్నాఁడు. మొన్నరాత్రి మీరు చూచునప్పటికి వాని మొలను ఖడ్గ మున్నదో లేదో మీరు బాగుగ జ్ఞాపకము చేసికొనుఁడు. ఇందలి యథార్థము మీకే బోధపడఁగలదు. ఆధుదానను,

అబలను. ఈచిక్కులు, పోలికలు, నాకుఁ దెలియవు. ఒక్కవిషయము చూడుఁడు. నేఁటియుదయముననే గదా మీరు నగర మంత్రియు గాలించి గాలించి వదలినది. అట్టి సందర్భమున రంజనీదేవిగారి మేడముంగిట నీప్రతీహారితోఁ గమలాకాంతుఁ డొక గంటసేపు ముచ్చటాడుచుండగ నెవ్వరును జూడలేకపోయిరా? అప్పటికిప్రతీహారి యొక్కనికే చూచు న్నది కాఁబోలు. మిగిలినవారి కన్నులు పోయెనా?

అలక:—అక్షరముల పోలికనుబట్టి చూడఁగఁ గమలాకాంతుని వ్రాఁతయే యని తోఁచుచున్నది. కాదా? నాకీమె మాటలతీరు చూడగ నీమె యీ కుట్రయందున్న దనియే తోఁచుచున్నది. తిరిగి వెంటనే యేమియు నెఱుఁగ దనికూడఁ దోఁచుచున్నది. నేనీమె యథార్థమే కనుఁగొనలేనిచో నాకీసార్వభౌమత్వ మేల? కాల్పనా! నాతలపైఁ గిరీటము దీసి యామెతలపైఁ బెట్టిన బాగుండు నని తనలోఁ దా ననుకొనుచుండెను. ప్రియంవద యింకను జెప్పుచునే యుండెను.

“దస్తూరీల పోలికయా? ఒకకలము కాగితము నిప్పింపుడు. మీరంజనియొద్దనుండి వచ్చినటుల నొక యుత్తరమును మీ యెదుటనే వ్రాసి చూపించెదను.”

అలక:—ఇఁక లోకములో సత్యమునకును నసత్యమునకును గల భేద మేమి!

ప్రియం:—ఏమియును లేదు ప్రజలనమ్మకమే! నలుగురు మేక యన్న మేకయే కుక్కయన్న నదికుక్కయే.

ఇట్లు ప్రియంవద దంభోక్తులాడుచుండ మఱియొక గూఢచారి తొందరతో మహారాజును సమీపించి. “జయం! జయం! మహా రాజా! ఈయుత్తర మంత్రిగారొకుని బాలు నాడించు దాది కుమారుని చేతిలో దొరకినది” అని చెప్పి, దానిని రాజున కందిచ్చెను.

అలకసుందరుఁడా యుత్తరమును జూచుచుండెను. అది మొన్న రాత్రి రంజని వ్రాసి ప్రియంవదచే నంతిమోకుని కంపిన యుత్తరము.

అలక :—మంచిది! నీవు పొమ్ము. నా కేచటనుండిరో నరసి రమ్ము. సెలవుదీసికొని గూఢచారి వెడలిపోయెను.

అలక :—ఇవి సరిగ రంజనియక్షరములె... కాదు. కాదు. కమలాకాంతుని యక్షరములపోలిక యున్నది. కమలాకాంతుఁడు వ్రాసినది కాదీయుత్తరము. ముద్ర తలక్రిందుగఁ బడి యున్నది.

ప్రియం.—(నవ్వుచు) అక్షరములకు రంజని యక్కరముల పోలిక యుండుట కేమిహేతువో! ముద్ర తలక్రిందుగఁ బడుటకు నదే హేతువు;

అని చెప్పి, యుత్తరము పుచ్చుకొని, పరిశీలించి చూచి,

మహారాజ! ఇది యంతయుఁ బెద్దపద్మవ్యూహమువలె నున్నది. కమలాకాంతుఁడే రంజని దస్తూరీతో నీయుత్తరమును వ్రాయునముకట్టి యుండవచ్చును. ఏది యెట్లైన నిది రంజని దేవిచే వ్రాయఁబడినదని నేనినమ్మఁజాల. పిదపఁ దమ యిష్టము."

అలక :—ఒకటి మాత్రము నిశ్చయము. మొన్న రాత్రి యాయక్షరముల నాకాగితముపై రంజనియో కమలాకాంతుఁడో వ్రాసి యుండవలయు. నేఁడు వ్రాయఁబడిన యుత్తరమే నిజమైనచో నీయుత్తరమును రంజనియు నీవు కలసి యాలోచించి వ్రాసినదనుట కిసుమంతయు సందియముండజాలదు. నేఁటియుదయమున కమలాకాంతుఁ డిచ్చెనన్న యీయుత్తర మబద్ధమైనచో నీవు చెప్పినదే నిజము కావచ్చును. కనుక ప్రధానవిషయ మీయుత్తర మెవరువ్రాసినదో తెలవలయును.

ప్రియం :—ఒకవేళఁ గమలాకాంతుఁడే వ్రాసె ననుకొందము. వాఁడు వ్రాసినదంతయు సత్యమేయని నమ్ముదురా! నమ్మదగునా!

అలక :—క్రమక్రమముగా విషయ మగాధమగుచున్నది. నీవు మిక్కిలి కుశాగ్రబుద్ధివి. సందేహములేదు. సార్వభౌముఁడగు నలకసుందరుఁడు నేఁడొక యార్యయువతిచే నోడింపఁబడియె నని యంగీకరించుచున్నాఁడు. కాని యింకను సాక్ష్యములు ఋజువగువఱకు నిన్ను స్వేచ్ఛగ విడువఁజాలను. నీకీకుట్రయం దెట్టిసంబంధమున్నను జెప్పుము. చెప్పి క్షమింపుమని వేడుకొనుము. నిన్ను క్షమించి నీ బానిసతనము కూడఁ దొలఁగించివేసెద. నీవు తిరిగి మీయార్యావర్తము పోవచ్చును. లేదా యిక్కడనైన గౌరవముగ నుండవచ్చును. అట్లుగాక నీవు సత్యము వచింపనిచో మాకు యాథార్థము దెలియువఱకు నీకిక్కడనే చెఱ విధించుచున్నాను. నీవు దోషివని ఋజువైనయెడల గఠినశిక్షకు బాల్పడుదువు. తప్పదు. నీయం దనుమానముండియే యిటకుఁ బిలిపించితిని. నయమున నడిగి చూచితిని. ఎక్కడి కక్కడికే యుక్తి చెప్పుచుంటివి. (నవ్వుచు) అబద్ధమునే నిజములాగునఁ జెప్పుచుంటివి కాబోలు. చాలు. ఇట్టి ప్రసంగము లిఁక జాలును. నీవు నిజము చెప్పి సుఖముఁ బడసెదవా? లేనిచోఁ గష్టముల పాలగుటకు సిద్ధముగ నుంటివా?

ప్రియం :—(చాలసే పూరకుండి చేతివ్రేలు నున్న వజ్రపుటుంగరమును మెల్లగఁదీసి నోటబెట్టుకొని గంభీరముగా) అలకసుందరా! నేను బానిసను. నిజమే. నాదేహముపైనే మీ యధికారము, కాని నా మనసుపై మీకించుకైన నధికారము లేదు. ఎట్టిసుఖమైనను, నెంతటి కష్టమైనను మరణమువఱకే. నేనార్యయువతిని. స్వామిద్రోహము చేయఁజాలను. రంజని నాప్రాణము. ప్రభాకరుఁడు మాపాలిటి దేవుఁడు. "పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం. ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" యని చేసిన వాగ్దాన ప్రకార మవతరించిన యవతారమూర్తి యాప్రభాకరుఁడు...

ఆరత్నహారము ప్రభాకరునిచేతనే పడును. మీరంజని మెడలో...
......వ.........డ.........." ఇట్లు పల్కుచుండగనే ప్రాణముల విడిచెను.

అలకసుందరుఁడు నిశ్చేష్టుఁడై తెల్లఁబోయి చూచుచు నిలువఁబడెను. బల్లపై రెండుత్తరములును తటతట కొట్టుకొని యెగురఁ జొచ్చెను.

## ౧౦

ప్రభాకరుఁడు నిరాటంకముగా స్వదేశాభిముఖుఁడై చనుచుండెను. వాని ఛాయవలె రంజనియు, వాని వెన్వెంటనే ప్రచ్ఛన్నముగఁ బోవుచుండెను. ప్రభాకరుఁ డామెకూడ వచ్చుచున్నదని యెఱుఁగఁడు. రంజని ప్రభాకరులఁ బట్టి తెండని యలకసుందరుఁడు నియమించిన సైన్యమున కంతలోనే వెనుదిరిగి రావలసినదని యాజ్ఞ యయ్యెను. యవనదేశ మంతఃకలహములలో మునిగిపోవుచుండెను. అలకసుందరుని పక్షమునఁ గొందఱును నంతియోకుని పక్షమునఁ గొందరును వహించిరి. ఘోర రక్తపాత మగుచుండెను. అంతియోకుఁడు కూడఁ గుట్రలోఁ జేరెనని యలకసుందరుఁడు నిశ్చయించెను. అలకసుందరుఁడు కూఁతుచేతి కీల్బొమ్మయై సామ్రాజ్యము ధ్వంసము జేయుచున్నాఁడని యంతియోకుఁడు ప్రజలలో రాజద్వేషముఁ బురిగొల్పుచుండెను. అంతియోకునకు వ్రాయఁబడిన యుత్తరమును ప్రభాకరుని మందిరమునఁ బంకాలాగు వానియొక్కయు, మఱికొందఱియొక్కయు సాక్ష్యమును అలకసుందరుఁ డంతియోకునిపై మోపిన నేరమును స్థిరపఱచుచున్నవి. కమలాకాంతునియం దలకసుందరుఁ డుంచిన విశ్వాసము, ప్రభాకరుని చెఱనుండి విడుదలచేయుట మొదలగు విషయముల నంతియోకుఁడు తన వాదమును బలపఱచుకొనుట కుపయోగించుచుండెను. దినదిన మరాజకత ప్రబలుచున్నది! చెఱసాల లన్నియుఁ

దెబ్బది వేయఁబడెను బందీకృతు లందఱు విడుదలలై పాఱిపోవు చుండిరి.

వృద్ధుఁ డగు ప్రతాపుఁడు తన కూఁతును, కొడుకును వెంటఁ బెట్టుకొని స్వదేశాభిముఖుఁడై యొకవనమునుం బట్టి పోవుచుండెను. అంత కొంతదూర మరుగునరికిఁ నొక కొండ యడ్డము వచ్చెను. దాని కిరువైపుల రెండు దారులున్నవి. ఏదారిని బోవలయునో ప్రతాపునకుఁ గానిఁ చంద్రహాసునకు గాని తెలియదు. పద్మిని యనలే యెఱుఁగదు గద! అప్పుడు నలువంకలు కలియఁజూడ దూరమున నొక చెట్టుక్రింద నాశ్వికుఁ డొకఁడలసటఁ దీర్చుకొనుచుఁ గూర్చుండియుండుట గాన వచ్చెను. ఆసమీపముననే వాని యశ్వము మేయుచుండెను. తత్క్షణమే వీరు మువ్వురును కాతని సమీపించి "అయ్యా! ఆర్యావర్తమునకు దారి యేది!" యని యడిగిరి.

రా:— మీ రెందుండి వచ్చుచుండిరి?

ప్రతా:—యవన దేశమునుండి.

రా:—మీరు యవనులా?

చంద్ర:—అయ్యా మేముచాలదూరముపోవలసి యున్నది. దయ యుంచి మీ రెఱిఁగిన మాకు దారిఁజూపి పుణ్యముఁ గట్టుకొనుఁడు. లేనిచో నాకుఁ జాల నాకలిబాధగ నున్నది. అనవసర ప్రశ్నల మమ్ము వేధింపకుఁడు. మా కర్మ మెట్లున్న నటు పోయెదము.

ప్రతా:—అయ్యా! కుఱ్ఱవాఁ డాకలి మొగమున నున్నవాఁడు. వానిమాటలు పాటిసేయకుఁడు. మే మెవ్వరమైన నేమి? మా నామ రూపములు మాసిపోయి చాలసంవత్సరము లాయెను. మే మిప్పుడు కడుదీనులము.

రా:—మిమ్ముఁ జూచిన నాకుఁ గడుఁజాలి యగుచున్నది. ఈమార్గము చీనా దేశమునకుఁ బోవును. ఇది యార్యావర్తమునకుఁ బోవును. నేనును నార్యావర్తమే పోవుచుంటిని. మన మందఱము కలసియే పోవచ్చును. మనము గాంధారము సమీపించితిమి.

ప్రభా :—మీరు గుఱ్ఱముమీఁద నే వత్తురనుకొనియెద.

రా :—లేదు. దాని కాలు మడతపడి బెణికినది. అది నరిగ నడువఁ జాలకున్నది. ఏమిచేయుదును? దాని నచ్చటనే విడిచి వేసెదను. ఇఁక నెవ్వరైనఁ దగినజట్టు దొరకునా యని నేను జూచుచుంటిని. దైవవశమున మీరు కనఁబడిరి. కాని మీ రిప్పుడు బయలుదేరుదురా! మీపిల్లలు చాల నాకొనినట్లున్నారు. మీ బాలిక సుందరవదన మెటుల వాఁడియున్నదో చూడుఁడు! ఈసమీపముననే యదిగో మంచినీటి కొలనొకటి యిక్కడనున్నది. అటకుఁ బోయి శుభ్రముగ స్నానము చేసికొని రండు! చాలవఱకు శ్రమ నివారణ యగును. పిదప నిదిగో నాయొద్ద నున్న ఫలముల భక్షింతము" అని యెంతో ప్రియముగఁ బలుకుచు వారి కాకొలనునకు దారిఁ జూపెను.

చంద్ర :—అయ్యా! క్షమింపుఁడు. నేఁ దెలియక నన్న మాటలను నరకు చేయకుఁడు. మీరు చాలఁ బుణ్యాత్ములు. అందఱా దుర్మార్గునివంటి మోసగాండ్రె యుండరుకద! అని పలుకుచుఁ దన తండ్రిని సోదరుని వెంబడించి చనియెను.

రా :— అమాయకుఁడగు నీబాలుని నోటినుండి వచ్చిన వాక్యములు నాహృదయమున నెంత గాఢముగ నాటుకొని వేధించుచున్నవి!. ఇంకను నాకీబాధ చాలదు. ఏమనఁ బ్రభాకరునిఁ దెగటార్చి, రంజనిని జేపట్టవలెనను నాశాపిశాచము నన్నింకను వదలకున్నది. అయిన నేమిచేయుదును? నాగుఱ్ఱమిఁక న్వారికిఁ బనికిరాకపోయె. నేనంతలో నగరువిడిచి వచ్చుట యువనరాజ్యమునంత కలహములలో ముంచనే! కాని నాకోర్కె యీడేరదాయె. రంజని దాఁటిపోయె. చేతులారఁ దీసికొనిపోయి వాని కౌగిలిఁ జేర్చి యిప్పుడూరక నాపోయిన ఫలమేమి? పాపము నామూలమున యువనసామ్రాజ్యము కూలిపోవుచున్నది కాఁబోలు, నామూలముననే పెఱిఁగినది కాదా?

నామూలముననే నాశనమగుచున్నది. సహజమే. అదిగో తండ్రియు నన్నయు చెరియొకవైపు చేరి నడుమ ముద్దులు మూటగట్టుచు నచ్చుచున్నది. జాతికాని—పై మెఱుఁగులవలన గులాబి పూవులలో రాణి యని పిలువఁబడుటయే కాని మల్లెపూవు మార్దవము, సౌరభము, సాత్విక సౌందర్యము దాని కబ్బునా!" యని రంజనీపద్మినుల సౌందర్యముల తారతమ్యము లరయుచుండెను.

ప్రతాపుఁడు, చంద్రహాసుఁడు, పద్మిని, స్నానమాడివచ్చి ఫలహారములు చేయుచుండిరి. ఆశ్వికుఁడును వారిసమీపముననే కూర్చుండి ప్రసంగించుచుండెను.

పద్మిని:—నాన్నగారూ! ఈయన యెవరో మనకు మార్గమధ్యమున దైవమువలె మహోపకారము చేయుచున్నాఁడు.

ప్రతా:—నిజముగనయ్యా! మిమ్ముఁబోలు పుణ్యపురుషు లక్కడక్కడ నుండనిచో లోక మిట్లేల నిలచియుండును? మీ నామధేయాదులు మే మడుగవచ్చునా?

రా:—ఈలోకమున బుణ్యజనుల కేమికొదువ? నా పేరులో నేమున్నది? పేరును బట్టియు, నూరును బట్టియు మనుజుని స్వభావము తెలియదుకద!

చంద్ర:—నిజమే! వంశమునుబట్టి కాని జాతినిబట్టి కాని నిర్ధారణ చేయఁజాలము.

పద్మిని:—కమలాకాంతుఁడును నార్యవంశ సంభూతుడేగదా!

ప్రతా:—వానిమాట నిప్పుడు తలపెట్టకుఁడు. అయిన నట్టి ద్రోహికి గూడ నమ్మా! మేము కృతజ్ఞత జూపవలసి యున్నది. ఏమందురా? వానిమూలముననే యవనదేశ మరాజకమైనది. తన్మూలమున మాకు జెఱనుండి విముక్తి కలిగినది.

రా:—సత్యమే! ఈసృష్టియందు కేవలము దుఃఖమును జెడుగును నష్టమును గలిగించున దెద్దియును లేదు. ప్రతిదానియందును

సుఖదుఃఖములు, లాభనష్టములు, మంచిచెడ్డలు జూడ వగును. తీవ్ర మగు జ్వరము కాయుటచే దేహమునకు మిక్కిలి యారోగ్య మంట! అయినను జ్వరము చెడ్డదని దానిని నరుడు కోరడు. కాని మీ రార్యావర్తమున నేమిచేయుదురు!

ప్రతా:—స్వదేశము చేరితిమా చాలును. నే మిక్కిలి వృద్ధుడ నైతిని. నేచ్ఛగ నివసించుటకును సుఖముగ మరణించుటకును గూడ బ్రతిప్రాణియు స్వదేశమును గోరుచుండునుగదా! ఇది ముద్దరాలు. వాఁడు బాలుఁడు. వీరితల్లి చిన్ననాఁడె గతించినది. గతించిన మొదటి మాసములోనే యవనులు మమ్ము బంధించి యవన దేశమునకు గొంపోయిరి. అప్పుడు మాతోబాటు పది పండ్రెండేండ్లవాడగు ప్రభాకరుఁడు గూడ బంధింపఁబడెను! అయ్యో! మీరు ప్రభాకరు నెఱుఁగుదురా! వాని దేమి చక్కదనము! ఎంతనమ్రత, నమ్రతలోఁ గాంభీర్యమెంత! మహారాజున కుండవలసిన లక్షణములన్నియు వానియందు మొగ్గ తొడుగుచున్నట్లుండెడివి! వానిని మీ రెఱుఁగుదురా? ఇప్పుడెక్కడ నుండునో! నేఁటికి వానికిఁ బరిణయమయ్యెనేమో!

రా:—(పరధ్యానముగఁ బ్రక్కకుఁ జూచుచు) నేను వాని నెన్నఁడును జూడలేదు. కాని వాఁడు జారుఁడు, చోరుఁడు కానిచో మీ ముద్దుల తనయుకుఁ దగినవరుఁడు కాఁగలిగి యుండెడివాఁడు. మీరు వచ్చుటకుఁ బూర్వమె యొక తండావచ్చి యిట విడిసిపోయెను. వారు వానిని గురించి యిట్లు ప్రస్తావించుకొనుచుండగ వింటిని. ఆ ప్రభాకరుఁడు, మీరన్న వాఁడు నొకఁడై యుండవచ్చును.

చంద్ర:—వానినిఁ జక్రవర్తి విడిపించి గౌరవించెనఁట!

రా:—అవును వాఁడె.

పద్మిని:—(స్వగతము) నేనీతనిమాటలు నమ్మజాలను.

రా:—దుర్మార్గులచరిత్ర స్మరించరానిది—

అని యనుచుండగ నాతని మొగము తెల్లబోయినది. "నీవు దుర్మార్గుఁడవుకావా? మూర్ఖా!" యని వాని యంతరాత్మ తూల

నాడుచుండెను. ఆ బాధను జూచి పోవుటకు ప్రయత్నించుచు, "తమ్ముడా నీ కేమి? ఈ వనమెంత రమ్యముగ నున్నదో చూచి తివా! పిల్లవారుద్యానవనములో విందు గుడుచుచున్నట్లు లేదా!" అని చంద్రహాసునితో సల్లాపములాడుచు బండ్లరాదులు వర్ణించి చెప్పుకొనుచు బండ్లవాదులకును, మృదుత్వమునకును నుపమాన ములు వెదకుచు, వనముయొక్క సౌందర్యమును జూచి యానందించుచు, సెంతయం బ్రొద్దు వృక్షముక్రింద గూర్చుండి ఫలము లారగించిరి. పిదప బయలుదేరి భరతఖండాభిముఖులై కొండప్రక్కనుండి దారి తీసిరి. కాని కమలాకాంతుడు—ఆ రాతు కమలాకాంతుడని పాఠకు లీపాటికి గ్రహించియే యుందురు—తనగుట్టు బైటపెట్టలేదు. పేరైన జెప్పలేదు. లోలోన మాత్రము తన్ను బిక్కిలి నీచునిగ గ్రహించి నిజముగా బశ్చాత్తాపపడ జొచ్చెను. రంజనికన్న పద్మిని యెంత యెక్కుడు మనోహరముగ నున్నదని వితర్కింప జొచ్చెను. నిష్కపటు లగు నా ముగ్గురిచరిత్రమును బూర్తిగా దెలిసికొనుచుండెను. ఇట్లు ప్రయాణము గావించుచు, కతిపయదినములలో వారు పాంచాలము ప్రవేశించిరి. అక్కడనుండి కమలాకాంతుడు దేశసేవాతత్పరుడై, తనమార్గమున బోయెను. వృద్ధుడగు ప్రతాపుడు కూతురును గొడుకును వెంటబెట్టుకొని, తన జమీ ప్రవేశించి, అందు పాడుపడి యున్న దుర్గము నించుక బాగుచేయించుకొని, అందు దిరుగ దీపము పెట్టికొని కాపురముండెను. పూర్వము తన్ను గొలిచి పద్మిని తన్ను చిన్ననాడు నావమీద యమునపై ద్రిప్పి యాడించిన వృద్ధసేవకుని జూచి చిన్నపిల్లవలె బట్టరాని యానందమున "తాతా! నన్ను మఱచి పోలేదా?" అని యామె ముందుగ సేవకుని బలుకరించెను. కాని క్రూరులగు యవనులు వాని నాలుక కోసివేయుటచే ప్రత్యుత్త రము చెప్పజాలక సాగిలపడి బాలిక చిన్నపాదములకు, మొక్కి వ్రేళ్లను ముద్దుపెట్టుకొనెను.

## ౧౧

సంధ్యానమయమైనది. నిరంతర పరిశ్రమచే డస్సి, దినము విశ్రాంతిఁ గోరుచున్నది. ప్రకృతి శాంతభావముద్రితయై యున్నది. పూర్వ పశ్చిమార్ధగోళములకుఁ జెరిసగముగ సూర్యబింబము నిలిచి యున్నది. భూమ్యాకాశంబు లరుణకాంతుల పూతలతో మెఱుఁగెక్క తమనల్ల రంగును, నీలివర్ణమును గొంతవఱకుఁ గోల్పోవుచున్నవి. అంబరవీధిని నంబుదంబులు చిత్రవర్ణశృంగారపుంజంబులో యన జరగిపోవుచుండెను. జగన్నాటక సూత్రధారి నిశాప్రవేశానుగుణ్యముగఁ దెరల మార్చుచుండెను. రంగురంగుల పక్షులా మబ్బుల క్రిందనుండి కిచకిచలాడుచుఁ శ్రేణులుగట్టి యెగురుచుండెను. క్రమక్రమముగఁ దమ నివాసములఁ జేరుచుండెను. క్రింద దట్టముగు వన మొలికించుక శిరమూఁపుచుఁ సత్తమించెడి సూర్యభగవానుని కడనుండి సెలవు గైకొనుచుండెను. భూమిపై రక్తిమ, వనాగ్రభాగములకుఁ జేరుకొనుచుండెను. అక్కడ కూడ నది క్రమక్రమముగ మాసిపోవుచుండెను. రోదసీగహ్వరంబు విజాతీయంబగు సంధ్యాకాంతితో నిండెను. అందుండి పూర్వదిక్కునఁ పూర్ణచంద్రుఁ డుదయించె. తొల్లి బృందావనంబు శ్రీకృష్ణమోహన గానముచే నూతనరసార్ద్రింబై విలసిల్లినటుల నేఁటి చంద్రోదయ సమయంబున నీకాంతారమందెల్ల నూతన రాగరసోత్పత్తి యగుచున్నది. అమృతతుల్యంబగు స్వచ్ఛంద చంద్రికా కాసారమున జలకమాడుచు వనలక్ష్మి నూతన యౌవనోజ్జ్వలాంగియై వినూతనలావణ్యవిలాసినియై, యపూర్వశృంగారశోభినియై యొప్పె.

శరవేగమునఁ బ్రభాకరుఁడా వనమధ్యమునుండి కొల్లగుట్టనుపై రివ్వునదాటి పోవుచుండెను. మెఱపు మెఱసిపోయినట్లయ్యెను. ఏదో దివ్యశక్తియే యీ వ్యక్తి నంత వేగముగ లాగుకొనుచుండవలయును.

కలఁగిన నీరు మరలఁ దేరినటుల వనమంతయుఁ దిరిగి నిశ్శబ్దము నిశ్చలము. కొంత సేపటికి నీలాశ్వారూఢయై రంజని యా వనమధ్యముఁ

జొచ్చెను. ఆమె విశాలసుందర నేత్రము లన్వేషణ పరత్వమును సూచించుచున్నవి. ముఖకమలము మిగుల డస్సి వాడియు; సహజ సౌందర్యముం బాయలేదు. అశ్వము మేనంతయుంగూడ చెమటలు గారుచుండెను. నోట నురగ గార వగర్చుచుండెను. రంజని ముందునకు వంగి నేలం బరిశీలించి చూచుచు, "నెట్లు పోయియుండును? ఇంత వఱకు నున్న డెక్కలజాడయేల నిటుపైం గానరాదు! ఏమిమాయ! ఎటుపోయి యుండును? ఇంతకు నేనార్యావర్తము రాంగానే పురుష వేషము తీసివేసితి నేల? అందుమూలముననె దూరదూర ముండవలసి వచ్చినది. తుద కింత యైనది. నెందుపోదును?—ఎందుపోందు ననేల? ఎందుంబోయినను, నెటుచూచినను, నాకీ వృక్షములు, లతలు, పుష్పములు, ఫలములు, సెలయేళ్లు, నదులు, కొండలు, విశాలాకాశము, నీచల్లని వాయువు మనోహరమగు వెన్నెల సర్వము నా మనోహరుని శుభలక్షణము లనే గలిగి యున్నవి. ఈ ప్రకృతియంతయు నాకొఱకై నేండు ప్రభాకరుని దివ్యరూపమును దాల్చినదా!—ఏమిది! నా యెడమ భుజ మదురుచున్నది! ఆర్యు లివి శుభశకునంబు లందురు. నాకును శుభమేనా! ఇంకను నదురుచున్నది." గుఱ్ఱము కదలి తనంతటం దానే దారితీయుటం గాంచి "రౌహాయశ్వమా. నీయిచ్చవచ్చినటుల దారి తీయుము. నీవు కళ్యాణివి. పాపము శాంతించుంగాక! ఆమనోహర మూర్తి నన్నుం బరిగ్రహించునా? పరిగ్రహించనిచోం బ్రాణత్యాగమె శరణ్యము.

చాలవఱకు గగనమార్గమున పక్షివలె యెగిరి వచ్చిన తెల్లగుఱ్ఱము త్రివేణీసంగము సమీపించినతోడనే ప్రాణముల విడిచి నేలంబడిపోయెను. ప్రభాకరుండు మెలంకువతోం గ్రిందకు డిగ్గ నుఱికెను గాని యొకగడియ వఱకు దలదిమ్ముచేం దానెచటనుండెనో కూడం దెలియక కన్నులు మూసికొని నేలపైంబడిపోయెను. తిరిగి కన్నులు తెఱచి నపుడు తానొక విశాలమగు రాతిపలకపైం గూర్చుండిన బాగడపూ

సెజ్జపైఁ బఱుండి యుండినట్లు గ్రహించెను. పైనఁ బచ్చని చాందిని వలెఁ బొగడ, యడవిమల్లె, మొదలగు చెట్లయాకు జొంపములు పూలతో వ్రేలాడుచు నందముగఁ గన్పట్టుచుండె. పశ్చిమమునఁ గ్రిందుగఁ జేయిచాచిన నంగులాగునఁ బూర్ణచంద్రబింబమాహ్లాదకరమై యుండెను. దూరమునుండి గంగా యమునా పావనసంగమగానము శ్రావ్యముగ వినవచ్చుచుండెను. మలయానిలుఁ డాపండు వెన్నెలలో వికసించుచున్న యాయడవియందలి పూలయొక్క సౌరభమునెల్లఁ గొల్లగొట్టుకొని వచ్చుచుండెను. ప్రభాకరుఁడు లేచి కూర్చుండి నలువంకలఁ గలయఁ జూచెను. చుట్టును మొగలి డొంకలు పూలతో నిండి యుండెను. కొంచెమువ్వలగ జీడిమామిడిచెట్లును గలవు. తానెక్కి వచ్చిన గుఱ్ఱము చచ్చి యెదుట మొగలిడొంకలలో బడియుండెను.

“నీవు దివ్యాంశసంజనిత వనుకొంటిని, నన్నింతదూరము—ఎక్కడ నుండి యెక్కడి కెంత సెపటిలోఁ దీసికొని వచ్చితివి? నన్ను నీవు తీసి కొనివచ్చితివో, నిన్ను నేను దీసికొనివచ్చితినో నే నెఱుఁగ—కాని మనల నిరువుర నీప్రాంతమున కేదియో మహత్తరమగు శక్తియే యిటుల నాకర్షించి యుండునని తోఁచుచున్నది. అందులకు ఫలముగ నీకు మరణము కలిగినది. నాకేమి కలుగనున్నదో కదా! ఈప్రాంతముల నరుఁడెన్నఁడైన నడుగుపెట్టి యుండునా? నే నెంతయొంటరిగ నుంటిని. ఈతరులతాగుల్మాదులెల్ల నాత్మారాములై యానందించుచున్నవి. కాని నన్ను సరకుచేయుట లేదు. ఆహా! ముండ్లడొంకలలో నీసన్నజాజి పూవెటుల నిర్మలవికాసముతోఁ గన్పట్టుచున్నది. ఆచెఱసాలయందలి పద్మిని నగుమోము సుకుమారత నాతలఁపునకు వచ్చుచున్నది. ఇప్పు డాబాలిక యెచ్చటనున్నదో! అక్కటా యెంతకష్టము! నే నాయువన దేశవృత్తాంతముల నెల్ల మఱచిపోవలెను. ఆసుఖదుఃఖానుభవముల నే నెన్నఁడును స్మరింపరాదు. ఆనయవినయములు, ప్రేమానురాగములు,

హాస్యమధురోక్తులు, తళుకుబెళుకు చూపులుఁ నాహృదయము గాఢముగ నాఁటుకొన్నవి. నా నిర్మలజీవితమున కామె నూతనవికాసమును గొల్పెను. ఇఁకఁ బ్రవాహామంతరించకుండ వికాస మంతరింపఁగలదా? ఈచంద్రుని వెన్నెలపోలికయున్న నిది సహజమా? అసహజమా? చంద్రునకుఁ జంద్రిక సహజమైన, హృదయమునకుఁ గోమలానురాగ మసహజ మెట్లగును? సహజమైనను నసహజమైనను నేనీఁక రంజని దివ్యమోహాసమూర్తి మఱచిపోవలెను! లేనిచో నిసౌందర్యమునందు మత్తుమందున్నది. నన్నున్మాదునిగఁ జేయును. ధర్మచ్యుతుఁడ నగుదును. ఏమి చిత్రము! నేఁడు వలదనుకొన్నకొలఁది నామనసున కింత కొంటెతన మలవడుచున్నది! అదిగో! నిశ్చలముగఁ బండుకొన్న తెల్లగుఱ్ఱము మనమున నిట్టి సంకులసమరము జరుగుచుండుట లేదుగదా! నిజముగ మరణము సౌఖ్యదాయకము కాదా! ఈనిరంతరధర్మసందిగ్ధసంక్లిష్టసమస్య లెల్లను మరణమందు సూర్యకాంతిముందర మంచువలె విడి మాయమగునుగదా! లేక యంధకారమందు వస్తురూపభేదములవలెఁ దాత్కాలికముగ మఱుగుపడునా? తిరిగి యిది యొకసమస్య—సర్వజ్ఞుఁడగు బ్రహ్మజ్ఞానితప్పఁ దదితరమానవుఁ డెవ్వఁడు నొంటరిగ నిర్వ్యాపారియై కూర్చుండఁదగదు. కూర్చున్నచో వాని మనసే వాని శత్రువులందఱికన్న నెక్కుడుగ వేధించుచుండును. కావున నేనిసన్నజాజులనెల్ల గోయుచుందును? ఏదో యొకపని యుండవలయు కద! లేనిచో రంజని తిరిగి వచ్చును" అని యనుకొనుచుఁ బ్రభాకరుఁడు రాతిపలక దిగి పూలు గోయుచుండెను. తూర్పుదిక్కున నరుణకాంతులు ప్రసరించుచున్నవి. కాని వెన్నెలయుఁ బూర్తిగ మాయలేదు. పక్షులన్నియు నిద్రనుండి మేల్కాంచి కంఠమెత్తి యొక్కమాఱాయుమన్ననకు స్తోత్రపాఠములు చదువుచుండెను. ఆ సందడి ప్రభాకరునకు మిక్కిలి ప్రియమై కొంతమనశ్శాంతి కలిగించుచుండెను. శకుంతలాముఖమున వెలువడుచున్న ప్రభాతిగాన లహరితో మేళవించుచు రంజని గానము కూడ వినవచ్చుచున్నది—

"మన్మథుఁడా గ్రుడ్డివాఁడు - మనుజాలదా గ్రుడ్డితనము
ప్రియునివెనుక నరుగుచుండి - ప్రియునిదారిఁ గాన నైతిని
మన్మథుఁడా గ్రుడ్డివాఁడు - మనుజాలదా గ్రుడ్డితనము
ఖండములను దాటివచ్చిన - కాననములనడుమఁ జొచ్చిన
వెతకి వెతకి నన్ను యిటుల - వేధించుచున్నవాఁడు
మన్మథుఁడా గ్రుడ్డివాఁడు - మనుజాలదా ? గ్రుడ్డితనము"

యని రంజని యాలాపించుగానము నాలించుచుండగా ప్రభాకరుఁడు లేఁడు. అతని మనసంతయుఁ బుష్పాపచయమందే లగ్నమైయుండెను. పారిజాతముల నేరెను. బొగడలఁబ్రోవులు పెట్టెను. కొండమల్లెలు గుట్టవేసెను. పన్నజాజుల నింకను నేకరించుచుండెను. అందులో నొక జాజులత మొల్లనిపూవులఁ బూచినటులఁ గాన్పించెను. తోడనే పరిశీలించి చూచెను. "ఇదిగో! రత్నహార" మని యొక కేకవైచెను. "నీకొఱకే నిర్దేశింపఁబడినది" యని యశరీరవాణి మాఱుపల్కెను. ప్రభాకరుఁడు దానినిఁ గ్రిందఁ బడకుండునటుల జాగరూకతతో నీవలకుఁ దీసి చేతఁబట్టుకొని యనిర్వాచ్యమగు నానందాతిరేకమున నిశ్చేష్టుఁడై నిలిచి చూచుచుండెను! కట్టెదుట రంజని వచ్చి నిలిచి యుండెను. నిలువెల్ల వింతవింతరంగుల పూలతొడుగులతో రంజని నిజముగ వనలక్ష్మి యవతరించెనా యనుశృంగారపు టొయ్యారము లుప్పతిల్ల నిలిచియుండెను. ఆమె మల్లెపూఁసరము చేతఁ బట్టుకొని యున్నది. ఒండొరులు చూచికొనిరి. మఱిమాటలు లేవు. "రంజనీ! హృదయరంజనీ" యని సంబోధించుచుఁ ప్రభాకరుఁడు తనచేతనున్న మణిహారము నాయువతి కంఠమున వేసెను. "ప్రభాకర! ప్రాణేశ్వర! యని పలుకుచు రంజనియుఁ దన మల్లెపూలహారము నాయువకుని మెడలో వైచెను. "అయంముహూర్తస్సుముహూర్తోఽస్తు" అని దీవించుచుఁ దెల్లగడ్డపు ముసలిముని వెనుక నిల్చి యుండెను. అతఁడే ప్రభాకరుని పెంపుడుతండ్రి. రంజని కంఠలో నెక్కడనుండివచ్చెనో,

యీమనుసిగ్గు దొంతరలు తెలియరాదు. తలవంచికొని యోరచూపుల నాయువలిముని ముఖమును బరీక్షించుచుండెను. ప్రభాకరుఁడు గొప్ప దోషము చేసినవానివలెఁ దెల్లబోయి చూచుచు నిలువఁబడెను. ముని యంతట వధూవరుల నిరువురఁ జెరియొకచేతఁ బట్టుకొని, దగ్గఱకుఁ దీసి యొండొరుల పాణిగ్రహణ మొనరింపఁజేసి "వత్సా! ప్రభాకరా! అమ్మా! రంజనీ! విధి మీకిరువురకు విచిత్రసంఘటన మొనర్చె అందులకై యొకరనుకొనవలసిన దేమున్నది. కాని ప్రభాకరా! యీమణిహారము నీవు గుర్తెఱిఁగి యుంటివిగదా! ఏది యెట్లు జరుగునో యని నే నింతసేపటినుండియుఁ జూచుచుంటిని. దీనిమహిమము ఫలితమును మీరు నిటుపైఁ జూతురుగాక! ఇఁక మీకిరువురకు యథావిధి వివాహము చేయవలయును. నేఁడె శుభముహూర్తము. ఈవార్త ముక్కోటికెల్ల నెఱిఁగించి వచ్చెదను. అదిగో నచ్చట గంగాయమునా సరస్వతులు మూఁడు కలయుచున్నవి. ఆత్రివేణీసంగమ సమీపమున మఱ్ఱిచెట్టు కానవచ్చుట లేదా? ఆచెట్టుక్రిందనే తూర్పుగా నొక పర్ణశాల కలదు. మీరటు చనుఁడు. నేనును రెండుగడియలలో వచ్చెదను. నేఁడు మీరు దీక్షలో నుండవలెను. ఏమియు భుజింపరాదు." అని చెప్పి వెడలిపోయెను. తరువాతఁ గొంతసేపటివఱకు రంజనీ ప్రభాకరులు ముగ్ధులై యొకరితో నొకరు ప్రసంగించుటకు, నెట్లు మొదలిడవలయునో తెలియక తలలు వంచికొని యాత్మావలోకనము చేసికొనుచు నా రాతిపలకపైఁ గూర్చుండిరి. తుదకుఁ బ్రభాకరుఁడు నిశ్శబ్దము ఛేదింప సాహసించెను.

"నీవు నావెంట వచ్చుచుంటి వని నే ననుకొనలేదుసుమా! ఇంతకు విధిబలమే మనల నిరువుర నిక్కడకుఁ దీసికొని వచ్చె. తుదకా మణిహారము మొదట నీ మెడలోనే పడినది.

రంజ:—ఆర్యపుత్ర! భిక్షుకురాలిని సామ్రాజ్ఞిని జేసితివి!

ప్రభా:—నీవు జన్మముచేత సామ్రాట్టున కేకపుత్రికవు!

రంజ :—అయ్యో! నాగుజ్జము పాపము మరణించినదా ?

ప్రభా :—నే నెప్పటికి దీనికిఁ గృతజ్ఞుఁడను. కాని మనము పర్ణశాలఁ బ్రవేశింతుమా ?

రంజ :—అదిగో నాగుజ్జు మటులనే పోవుచున్నది. మనమును బోవుదము, కాని (తనవక్షమున వ్రేలాడుచున్న మణిహారమును బట్టుకొని) ఈహారము దాల్చుటకు నేఁ దగుదునా? నీవే ధరింపుము. పాపము! దీనికొఱకై యెంత ప్రయత్నములు చేసిరి. ఎందఱు ప్రాణములు గోల్పోయిరి! ఆహా! యేమి దీని మహిమ!

ప్రభా :—ఇఁక నిటుపై మన యిరువురిలో నెవరు ధరించిననేమి? నీవుండ నాకు వేఱు సామ్రాజ్య మేల? కాని మనము నేఁడు దీక్షతో, నిష్ఠతో నుపవాసవ్రతము నల్పుచు సూర్యోపాసన మొదలగు కర్మల నాచరింపవలసియుండును. కావున వేగ మె పర్ణశాల చేరుదమా!"

రంజ :—"నిన్ననుసరించియే వచ్చుచుందును!"

ఇరువురును త్రివేణీసంగమసమీపమున మఱ్ఱిచెట్టుక్రిందఁ దూర్పుగ నిర్మింపఁబడిన పర్ణశాలాభిముఖులై చనిరి. బాలభానుఁ డప్పటికిఁ బూర్ణ తేజోవిభవములతో నుదయాద్రి నధిష్ఠించి నూతన మూర్ధాభిషిక్తుఁడైన యువరాజ చందమున దిగంతములవఱకు వ్యాపించిన తన సామ్రాజ్య మొకసారి కలయఁ జూచుచుండెను.

## ౧౨

సావిత్రీ సత్యవంతుల వివాహమువలె, రంజనీ ప్రభాకరుల వివాహము మిక్కిలి యోగ్యముగఁ ద్రివేణీసంగమ ప్రాంతమున మహారణ్యములో ఋషివాటికయందు జరుగుచున్నది.

యవనదేశ మంత్ఃకలహములలో మునిఁగి యుండుటచే భరతఖండమున నున్న యవనాధికారులు స్వదేశాభిముఖులై పోయిరి. భారతీయులు స్వాతంత్ర్యము ప్రకటించుచు, నేగ్రామమున కాగ్రామమె,

దేశమండలమున సామంతులను, నాయకుల నేర్పఱచుకొని స్వతంత్ర ముగ వ్యవహరింపఁ జొచ్చెను. బలశౌర్యసాహసములు గల్గి యుద్ధ నైపుణ్య మెవరు ప్రదర్శింపఁ గలిగిన వారే నాయకులగుచుండిరి. చెరువమండలములవా రొకరితో నొకరు పోరాడి చంపుకొనుచుండిరి. స్వేచ్ఛ కలిగినది కాని యరాజకత ప్రబలినది. యవనసామ్రాజ్యము నశించినది. కాని యార్యసమ్రాట్టేర్పడలేదు. ఎవరిమట్టుకు వారే సమ్రాట్టుపదవి గోరి కృషి సలుపుచుండిరి.

ఇంతలోఁ బ్రభాకరుఁడు తిరిగి యార్యావర్తము ప్రవేశించెననియు, దేవదత్తమగు మణిహారము ప్రభాకరునిచేతఁ బడెననియుఁ బ్రభాకరుఁడు భరద్వాజాశ్రమ ప్రాంతమున గంగా యమునా సంగమమగు చోట విడిసి యుండెననియు, ఆతఁడొక యప్సరసను వరించి యుండె ననియు, ఋషులెల్ల వారి కిరువురికి యథావిధి వివాహము గావించు చుండి రనియు, నీవార్త ఆసేతుహిమాచలము వ్యాపించెను. భరత ఖండమందుఁ బేరుగల రాజులకు నాయకులకునెల్ల నావివాహమున కాహ్వానములు పంపఁబడెను.

“సీతాకల్యాణము పిదప శ్రీరామపట్టాభిషేకము జరుపఁబడునని ప్రజ లందఱు చెప్పుకొనుచుండిరి. వశిష్ఠులవారి యాజ్ఞ యైనదని యెనిమిది దిక్కులనుండియుఁ బ్రజలు తండోపతండములుగ వచ్చు చుండిరి.

మహర్షు లెల్లఁగూడి రంజనీ ప్రభాకరుల కగ్నిసాక్షిగఁ బాణి గ్రహణ మహోత్సవము గావించుచుండిరి. అవిశాలమగు పర్ణశాల యందు ఋషిపత్నులు వరుసలు తీరి రొకప్రక్క నిలిచి చూచు చుండిరి. వివిధదేశాగతులగు రాజులును ప్రజలును వేరొకప్రక్క సర్వ స్థానములందుండి కన్నుల పండువుగఁ జూచి యానందించుచుండిరి. పిదప యవనబాలికను ధర్మపత్నిగ గ్రహించి ప్రభాకరుఁ డగ్నియందు హోమములు గావించెను. హోమధేనువుల పాలతో వండిన పాయసము

లతోఁ దపోవనమందలి వృక్షాదు లిచ్చిన ఫలములతో నతిథి సంతర్పణలు జరిగెను. అప్పుడచ్చటి వారికెల్ల వెనుక నాస్థలముననె భరద్వాజమహర్షి చేసిన గొప్పవిందు తలఁపునకు వచ్చెను.

వివాహము పూర్తియైనది. వధూవరులు దీక్షావస్త్ర కంకణంబులు విసర్జించిరి. వచ్చిన జనసమూహంబు లత్యంతానందముతో వధూవరులు సీతారాములఁ బోలి యుండి రనియు, రతీమన్మథులమించి యుండిరనియు మెచ్చుకొనుచు మును లిచ్చిన యాతిథ్య విశేషంబుల కక్కజపడుచు నిజనివాసభూముల కరుగుచుండిరి. నానాదేశాగతంబగు రాజబృందము మాత్రము వసిష్ఠులవారిచేఁ గోరఁబడి యింకను నాఁగి యుండెను.

మఱునాఁడు ప్రాతఃకాలమున నిత్యదైవోపాసనాది విధులెల్లఁబూర్తియైన పిదప సభకూడ నిశ్చయింపఁబడెను. ఆప్రకారమే నాఁడు జాము ప్రొద్దెక్కువఱకు ఋషివాటికకుఁ బశ్చిమ భాగమున గంగానదీతీరమున విశాలమగు మైదానము శుభ్రపఱుపఁబడెను. పచ్చని యాకులతోఁ బందిరి నిర్మింపఁబడెను. పచ్చాకు పందిట రంగు రంగుల పూలతోరణములు కన్నులపండు వగుచుండెను. కృష్ణాజినములు, కొబ్బరి చాపలు క్రింద నాస్తరణమునకై పఱుపఁబడెను. సభ్యులందఱును వచ్చి నిండి కూర్చుండిరి. ఆవనమధ్యంబున నిట్టిసభ యెన్నఁడు జరిగి యుండ లేదు. కావున వృక్షాదులెల్ల నిలిచి యావింతఁ జూచుచున్నటులఁ దోఁచుచున్నది. వయస్సుచేతను జ్ఞానముచేతను గూడ వృద్ధగువసిష్ఠుఁడు ముందుగ లేచి నారాయణ స్వరూపమగు మహాసభకు నమస్కారము గావించి యిట్లు చెప్పఁదొడంగెను. "ఆర్యవర్యులారా! మిమ్ములనెల్ల నిటకు సమావేశము చేసిన కారణము తెలియఁజేసెదను. చెవియొగ్గి శ్రద్ధతో విందురుగాక యని ప్రార్థించుచున్నాను. పరమేశ్వరుని కరుణా కటాక్షమువలన నేఁడు తిరిగి మనజన్మభూమి పరదాస్యవిముక్తిఁ గాంచెను. యవనదేశ మిప్పుడంతఃకలహములతో నిండియున్నది.

కావునసె మన భరతవర్షమున కీబంధవిమోచనభాగ్యమబ్బినదన్న విషయము మీరందఱెఱింగినదే కదా! నేఁడు మనకు దైవదత్తమగు నీశుభతరుణము జారవిడువఁదగదు. శత్రువు దుర్బలుఁడై యున్నపుడే మనము మన యూశను గట్టిపఱచి బాగుచేసికొనవలయును. అది ముఖ్యముగ గుఱుతింపవలసిన రాజనీతి. ఆసేతుహిమాచలము సింధు మొదలు బ్రహ్మపుత్రనదివఱకు వ్యాపించి యున్న భరతవర్షమున మహా వీరులకుఁ గొఱఁత లేదు. బాహుబలమునకు లోటు లేదు. బుద్ధిబలము నకుఁ దీసిపోదు. అయినను బరరాజు వచ్చి తన పతాకము నీయార్యావర్తమున నెలకొల్పఁగల్గుట కారణములు యోజించితిరా? మనలో మన కైకమత్యము లేకపోవుటయే? నేఁడు తిరిగి నైకమత్యము లేని లోపమే కాన్పించుచున్నది. క్రొత్తగ మనకుఁ గలిగిన యీ రాజకీయ స్వేచ్ఛను దుర్వినియోగము చేసికొనుచుంటిమి. ఇరుగు పొరుగు గ్రామములవారు పట్టణములవారు రాష్ట్రములవారు కలహించి కత్తి దూయుచుండిరి. ఈ మూలమున నార్యజాతి యాత్మహత్యాకరమగు పంథ ద్రొక్కుచున్నది. సర్వేశ్వరుని దృష్టిలో మనము స్వారాజ్య మనుభవించుట కనర్హులమని పరిగణింపఁబడుచుందుము. తిరిగి యువకుఁడో లేక మఱి యెవఁడో మనల జయించి పరిపాలించుటకుఁ బ్రేరేపింపఁ బడుటకుఁ బూర్వమే మనము నీతికలిగి జాతియొక్క గౌరవము కాపాడుకొనవలయును. లేనిచో మీజాతీయత, వ్యక్తిత్వము, ధర్మము నశించును. పిదప మనుజుఁడు జీవించుట భూమికి భారహేతు వగునే కాని మఱి యెట్టి ప్రయోజనము కలుగఁబోదు. కావున మీరైకమత్యత కలిగి యుండుఁడు. మీయందఱిపై నధికారము వహించి మీమీ శౌర్య ధైర్య సాహసములఁ గేంద్రీకృతము గావించి తన్మూలమున మన దేశమునకుఁ బరరాజుల దాడివలనఁగాని యన్యాయాది గుణప్రేరితంబులగు నంతఃకలహముల వలనఁ గాని యెట్టి యలజడి కలుగకుండఁ గాపాడఁగల నాయకుని నిర్ణయించుకొనవలయును.

యవనుఁడు దేశము వదలి పోయినాఁడు. తిరిగి దేశమునకు మంచి దినములు వచ్చినవి. కావున నిటుపై మాబోటివృద్ధుల కొకింత విశ్రాంతి నిచ్చి మీరలె యీ లౌకికవ్యాపారములు చక్కబెట్టుకొనుట యన్నివిధ ములఁ గోరఁదగినది." అని చెప్పి విరమించెను.

పిదపఁ జాలఁ జర్చలు జరిగెను. ఎల్లవారును లేచి తమయందెట్టి దోషమును లేదని కొంతవఱకు వాదించిరి. ఎట్లైన నేమి తుద కంద ఱకు నైకమత్యావశ్యకత హృదయమున నాఁటినది. పరస్పరవైషమ్య ములు మానసవీధి విడిచి పోయినవి. వరప్రసాదుఁడగు ప్రభాకరుని నందఱు నేకగ్రీవముగఁ దమపై నాయకత్వము వహింపవలసినదని కోరిరి. ఋషులందఱుఁ గూడ నామెన్నికకు నంతసించి ప్రభాకరునికి దిగ్విజయము గావుతమని యాశీర్వదించిరి. హస్తినాపురమునఁ బ్రభాకరునకు భరతసామ్రాజ్య పట్టాభిషేకమహోత్సవము సల్పుటకు నిశ్చయింపఁబడినది. అంతట జయజయ ధ్వానములతో సభ ముగిసినది.

౧౩

"వత్సా! ప్రభాకరా! నీవీ దీక్షనుమాత్ర మిసుమంతయు వదలఁ జనదు. శస్త్రవిద్య కభ్యాసమువలె వన్నె తెచ్చునది మఱియొక సాధ నము గానరాదు. నీకు నద్వితీయలాఘవకౌశల మలవడినది" యని వశిష్ఠుఁడు ప్రభాకరునిఁ జేరెను.

ప్రభా :—గురువులయాజ్ఞ శిరసావహింపఁ దగినదిగద !

వశి :—నీయందుఁ బ్రజ్ఞ కొఱఁతపడినచో సామంతులు మన ములో నైనఁ జులకనగఁ జూతురు. అది యెప్పటికైన ననర్థదాయ కము. అన్నివిధముల వారిని మించి యుండి నీవు వారిని ప్రేమించుచు మిక్కిలి గౌరవించుచు నిష్పక్షపాతముగ మచ్చిక నిచ్చుచు మెలంగ వలయునుసుమా! అట్టియెడ నెవ్వరైన దుర్మార్గు లున్నను లేక వైరి

పంపుచు వచ్చిన గూఢచారు లున్నను సప్తవ్యసనములలో నెద్దానియం
దైన నీమనసు లగ్నమగునట్లు చేయజూతురు. మెలఁకువ గలిగి
ప్రవర్తింపవలయునుమీ! ధర్మార్థకామమోక్షములు నాలుగు పురు
షార్థములు, అందర్థకామములు ధర్మమోక్షములకు లోఁబడి
ప్రవర్తించుటయం దేమాత్రము నేమరిపా టున్వానికిని దగదు——ఇఁక
సామ్రాజ్యభారమెల్ల దన భుజములపై వహించిన సార్వభౌముని
విషయమై వేఱుగఁ జెప్పవలసిన దేమున్నది. అధికారోన్మత్తముగాని,
వనితాసౌందర్యముగాని నిన్ను ప్రజాసేవనుండి మరలింపకుండుఁగాక!

ప్రభా:——తమ హితము ననుసరించియే నడుచుకొందును! దేవుఁడు నాకుఁ దోడగుఁగాక!

వశి:——అల్లేయగు! అగ్న్యుపాసన (సాయంవిధుల) కునమయ మగుచున్నది. నేఁ బోయి వచ్చెదను.

ముని చనిన వెనుక దదుపదేశ వాక్యములఁ దిరిగి తిరిగి ప్రభాకరుఁడు జ్ఞప్తికిఁ దెచ్చికొని మననము చేయుచుండెను. "ఆహా! ధర్మ దండ మెంతభారము. కిరీటధారి కెంతకష్టము! ఉర్వియందలి భోగ భాగ్యము లెన్నికలవో యన్నియుఁ దనచుట్టు వెలయుచుండ దేనిని నంటక ముట్టక మెలఁకువతోఁ బ్రవర్తిల్లవలయును! వేలు లక్షలు కోట్లు ప్రజల ధనమానప్రాణముల కొక్కఁడు పూటకాపై నిలువ వలయు! ఈశ్వరా! నన్నీ కఠోరాసిధారావ్రత ధర్మపరిపాలన దీక్షా కంకణబద్ధుఁడను గమ్మనియే నీయాజ్ఞ యైనదా? సరియే? భవదీయ సేవకుఁడు సర్వదా విధేయుఁడ."

ఇంతలోఁ బుష్పమాలాలంకృత శోభనాంగి యగు రంజని దివ్య సుందర విగ్రహము మందహాస విలసిత నేత్రాధరయై సాక్షాత్కరించెను. ప్రభాకరుఁడింకను నాలోచనా నిమగ్నుఁడై పరధ్యానంబుతోఁ జూచు చుండెను. రంజని వాని సమీపమునకుఁ బోయి ప్రియుని హస్తమును తన ముద్దుఁ జేతులఁ బట్టిమృదువుగ నెత్తిముద్దిడికొని "ఆర్యపుత్రా!" యని సంబోధించెను.

ప్రభా:—(ఉలికిపడి) ప్రాణేశ్వరీ! ఇచ్చటి కెప్పుడు వచ్చితివి!

రంజ:—ఒంటరిగ నన్యదేశమున నుండఁ జాలనపుడు నీ వెన్వెంటనే వచ్చితిని గదా! క్రొత్తగ నడిగెద వేల!

ప్రభా:— పరిహాసమునకు వేళ లేదా!

రంజ:—వేళకాదా యిది! చూడుము. మబ్బు చాటుచేసి కొనుచుఁ జందమామ వనలక్ష్మిపై వెన్నెలఁ జిలుకుచుండఁ వనలక్ష్మియుఁ జంద్రునిఁ గూడి జ్యోత్స్న వీచికల నూఁగియూఁగి కేళినల్పుచుఁ గేరింత లాడుచుండఁ బ్రకృతి యెల్ల యనురాగపూరితం బగు సుగంధ నిశ్వాస పవనంబుల విడుచుచుండ, బొండుమల్లెలు వకుళంబులకుఁ జట్టు విలసించుచుండ, గోవత్సంబులు తల్లులయెదుట నానంద పారవశ్యముచేఁ గలములెత్తి చిందులు త్రొక్కుచుండ నిశ్చయముగ నిదియె పురుషుల దీర్ఘాలోచనలకుఁ దగిన తరుణము! కాని పరిహాసములకు వేళయా!

ప్రభా:—నీవుందువు.

రంజ:—ఆ రెండు గోరువంకలు చూడ ముచ్చటగఁ గొమ్మపై నెట్లు కూర్చున్నవో!

ప్రభా:—నిద్రపోవుట లేదు! కాని యెంత నిశ్శబ్దముగ నిశ్చలముగఁ జూచుకొనుచున్నవి. ఆనంద మనిర్వాచ్యముగద!

రంజ:—కాని-

ప్రభా:—కాని మానవున కట్టి నిత్యనిర్మలానంద మెన్నఁడైన గలుగునా? ప్రియా? నరుఁడేల సృజింపఁబడెనో? కష్టముల పాలగుటకా.

రంజ:—కాదు. సుఖమునకై; జీవితఫలసిద్ధి యానంద రసానుభవమునందే కలదు. లేనిచో నీచంద్రబింబ మింత యాహ్లాదకరమై పొడసూప నేల?- పుష్పమున కింత సౌరభ మెందులకు - గోక్షీరముల మాధుర్య మెందుకొఱకు - ఆకసము వర్షించుట - పుడమి సస్యముల ఫలించుట - అగ్ని ప్రజ్వలించుట - నదులు ప్రవహించుట - వాయువులు

వినరుట - మానవుని సౌఖ్యముకొఱకు కదా? దయామయుం డగు భగవంతుఁడు నిర్ణయించినది!

ప్రభా:—అగును - కాని లోకమున నట్టి యున్నతస్థానమం దున్న మానవునకు లోకసంగ్రహార్థము పాటుఁబడవలసిన బాధ్యత కూడఁ దోడనే యున్నదిగద!

రంజ:—నాకీ తత్త్వవిచారము చూడ నవ్వువచ్చుచుండును— మనోహర! నిన్నే దియో యడుగవలె ననుకొనుచుంటిని...—ఇంతలో విజయసింహుఁడు వచ్చి రంజనీప్రభాకరులఁజూచి సంకోచించుచు, మరలిపోవ నుద్యుక్తుఁడయ్యెను.

ప్రభా:—మిత్రమా! రమ్ము. విజయసింహా! సంకోచ మన వసరము. ప్రియా! నిన్నుఁ జూచి ముందునకు రానందేహించి మన విజయుఁడు వెనుకకు మరలుచున్నాఁడు.

రంజ:—మాయొద్ద నీకెన్నఁడు నట్టి సందేహములు వలదు. విజయచంద్రా! వచ్చి స్వేచ్ఛగ మాటలాడవచ్చును.

ప్రభా:—నిజముగ నీతఁడు చంద్రుఁడే. యుద్ధరంగమున మాత్రము నీవు సింహుఁడవు. సోదరా! నీవు వచ్చిన కార్యమేమి?

విజ:—అలంకృతంబై హస్తినాపుర మంతయు మీ రాకకై యెదురు చూచుచున్నది. నానారాష్ట్రాధిపతులును నానాదిక్కుల నుండియు వచ్చిరి. భరత సామ్రాజ్య పట్టాభిషేకంబు నొందుటకు ధర్మ పత్నీ సమేతుఁడవై నావెంటఁ దరలి రమ్ము.

ప్రభా:—సోదరా! విజయా! నిజము చెప్పుచున్నాము. అడ వులలో స్వేచ్ఛగఁ దిరుగుచున్న యశ్వమును తీసికొని వచ్చి పటగాల తోడను, గజ్జెములతోడ నలంకరించి రథమున కంటఁగట్టుటనుమా పట్టాభిషేక మనిన. గుఱ్ఱమున కినుము, తోలు నుపయోగించిన, మాన వునకు బంగారము, పట్టు వాడుదురు, సామ్రాజ్యమనెడి రథమున కంట కట్టుదురు. అంతియె వ్యత్యాసము స్వేచ్ఛ యిరువురకును బోవు

చున్నది. మిత్రమా, మఱచితివా? తొల్లి మన మిచ్చట నే యాయిసుక తిన్నెలపై, నీ చెట్లకొమ్మలపైఁ, గష్టమెఱుఁగక, సుఖమెఱుఁగక, యెటుల కాలము గడిపితిమో? ఆదినము జ్ఞాపకము లేదా? దండు దండని నే కేక వేయగా, అందఱు నే నబద్ధమాడితినని వాదించిరి. నీ వొక్కడవు మాత్రమే నే నసత్యము పలుకనని చెప్పి నమ్మితివి. ఆ బాల్యమందలి తగవులాటలయందుకూడ నొక విధమగు యానంద మున్నదిగదా?

విజయ:—అవెంటనే మన కెడఁబాటు కలిగినది. ఒకనది చీలి రెండుపాయలై వేర్వేఱు దేశముల బ్రవహించి, యిటతిరిగి నేడు కలిసినది.

ప్రభా:—అనదుమ నాయూపరిస్థితులఁ బట్టి పోలికలే మాఱి పోయెను. ఈశ్వర విలాసములు. నీకు వివాహ మైనదా?

రంజని విజయుని మోము రహస్యముగఁ బరీక్షించుచున్నది. విజ యుఁడును నించుక తలవంచి "లేదు - కాలేదు" యని సమాధానము చెప్పెను. కన్యలకు వలెనే బ్రహ్మచారులకును వివాహ ప్రసంగము వచ్చినయెడల సిగ్గగును గాఁబోలు!

ప్రభా:—గురువుల సందర్శించి వచ్చితివా?

విజ:— జపము చాలించువేళ కావచ్చినది. లేచి రేమో నేఁ బోయి చూచి వత్తునా!

అని తటాలునఁ బర్ణశాలలోని కరిగెను విజయుఁడును లేచి లోని కరుగుదునాయని తలపోయుచుండ

రంజ:—విజయచంద్రా! నీ నివాస మెచ్చట?

విజ:—హిమవత్పర్వతములలోని నేపాళసీమ. నా తలిదండ్రు లచ్చట రాజ్యము చేసిరి. కాని నేడు భరతఖండము - అదేల భూగోళ మంతయు నా నివాసభూమియే. దేవీ! యేమందువా, యవనరాజ్య

ములోఁ బూర్వపు హద్దులన్నియు బోయినవి. నేఁడు తిరిగి మీరొం డుండమని నియమించిన నందె యుండఁగలవాఁడను.

రంగ :—నీవినయగౌరవంబుల నన్నిఁటి, నిప్పుడే యువరాజో గించివేయుచుంటివేమి ! ముందు మాతోడఁ గలసి మెలసి మచ్చికతో నుండునని భావమా ! నీసోదరుఁ డిదె వచ్చుచున్నాఁడు.

ఇంతలో ప్రభాకరుఁడు తిరిగి వచ్చి, "రమ్ము విజయా! లోనికి రమ్ము గురువులయాజ్ఞ యైనది."

విజయ :—దేవీ! పోయివత్తునా !

రంజ :—మంచిది !

విజయ ప్రభాకరులు లోనికరిగిరి. రంజనితల నించుక వంచుకొని శాంతముగ జంటగా బ్రవహించుచున్న గంగాయమునల రెప్పవాల్పక చూచుచు ముందునకు నడచుచుండెను. బాలచంద్రు డామృదు తరంగములయందు తూగుటుయ్యాల లూఁగుచుండెను. వన మంతయు నిశ్చలముగ నుండెను. దిక్కులనుండి శబ్దమునకు మాఱుశబ్దము వినవచ్చుచుండెను. బాహ్యప్రకృతి యెంతయు నిర్మలప్రశాంతిభావ ముద్రితమై యుండ, నానదుమ, నదీతీరమున నిసుకతిన్నెపై, మోచేతి నానుకొని పరుండియున్న పరమమోహినియు, నిండుజవ్వనియు నగు యువనసుందరి హృదయమునందు మాటలకందని యాందోళనము పుట్టుచున్నది. వర్ణింప నలవికాని నంకులసమరము జరుగుచున్నది. భావాతీతమగు నావేశవ కలుగుచున్నది. రంజని కెంబెదవులనుండి యవ్వ దవ్వ డీమాటలు వెలువడుచున్నవి.

"ప్రియుంవదా......తుదకు దూరవుకొండలు నునువను నట్లాయెగదా!...చిత్తరువునందలి యందము, నాటకమునందలి సౌఖ్యము,... జీవితమునందు కలుగునా! చూడదగునా!......విజయు డెట్లుండుమని కోరిన నట్లుండువాఁడా!—ప్రభాకరుఁడు రథమున కంటిగట్టబడి స్వేచ్ఛను గోల్పోవుచుండెను. సామ్రాజ్యరథము పెద్దదిగనుక జోడు

గుజ్జిముల గట్టజూతురు—కాని యున్నతపదవికి సౌఖ్యము ననుభ వించుటకు గాదంట! నాకీతత్త్వములు తలకెక్కకున్నవి......కోరినటుల జేతువా? నిజమేనా విజయా! చంద్రా!"

విజయసింహుడును ప్రభాకరుఁడు దమ ప్రాణస్నేహము బయల్పడ నొకరి భుజములపై నొకరు జేతుల వేసికొనుచు వచ్చుచుండిరి. తటా లున రంజనియు లేచి విలువబడి తల యించుక వంచుకొని యావచ్చు మిత్రద్వంద్వమును వాల్చూపులు బఱపి తిలకించుచుండెను.

ప్రభా:—ప్రాణేశ్వరీ! ఇంత దవ్వేతెంచితివేల? ఎచ్చట దాచి తివి, మరదలు మాడనిచ్చిన కాని కనుపఱపవా యని విజయసింహుని నడుగవలె ననుకొనుచుంటిని.

విజయ:—మఱచిపోయితిని. వివాహవేళ నాముచ్చట తీరలేదు. కావున నట్లుచేసిన బాగుగ నుండెడిది. కానీ మఱచిపోయితిని.

రంజ:—ఏమియును దోచక వెన్నెల కాదా యని యిటువచ్చి కూర్చుంటిని.

ప్రభా:—మనము హస్తినాపురమున కరిగిన వెంటనే రాజ్య భారము వహింపు మని గురువులయాజ్ఞ యైనది. కావున బయలు దేఱుదమా?

విజ:—కాలవిలంబన మొప్పదు. నావెంటనే రావలయును.

రంజ:—అటులనే వచ్చెదను. ఇప్పుడే బయలుదేఱుదము.

విజ:—వెన్నెలకూడ జాల హాయి నిచ్చుచున్నది. పూలరథము కూడ సిద్ధము చేసి యుంటిమి.

ప్రభా:—అర్ధాంగీ, రమ్ము.

అని ప్రభాకరుఁడు రంజని మృదుహస్తము తనచేత మెల్లగ బట్టు కొని నడువ బ్రారంభించెను. మువ్వురును విజయసింహుడు ముందు దారి చూప రథాభిముఖులై పోయిరి.

౧౪

యవనదేశమునఁ దిరిగి శాంతి స్థాపిత మైనది. అలకసుందరు డంతిరోకుని క్షమించెను. అంతిరోకుఁడును నలకసుందరునిఁ దొల్లిటి వలె గౌరవింపఁ జొచ్చెను. తమలోఁ దాము పోరాడుకొనుచుండుట వలననే భరతఖండము తమ చేతినుండి జారిపోవఁగల్గె నని తెలిసికొనిరి. జరిగిన పొరపాట్ల కన్నిటికిని పశ్చాత్తాపము కలిగినది. ముందు జాగ రూకత వహించి కలిగిన నష్టములు కూడదీయుటకై మంత్రాంగము చేసిరి. దీర్ఘాలోచన చేసి యొక చతురుఁడగు రాయబారిని ప్రభాకరుని యాస్థానమునకంపి వానిరాకకై యెదురు చూచుచుండిరి.

మంత్రాలోచనా మందిరమున నొకనాఁడు మహారాజగు నలకసుంద రుఁడును, నంతిరోకుఁడును గలసి సంభాషించుచుండిరి.

అల:—చిత్రము! మణిహారము చివఱకు వానికే దొరకెనా! నేనా మణిహారమున నేమో గొప్పమహిమ యున్నదని కాదా చెప్పి నది. మనమన్ని సంవత్సరములు వెదకించినను గంటబడనిది వాని కంత సునాయాసముగ దొరకుటమాత్రము చాల విచిత్రముగనున్నది! దాని కేమిగాని మనము రాయబారిచే యుద్ధమునకు సిద్ధము కండ న్నటులనే సందేశ మంపితిమి. వారు తొంబదిపాళ్లు యుద్ధమునకు సిద్ధ పడరు. ఏదో రాజీకి వత్తురు. ఒకవేళ యుద్ధమే నిశ్చయ మన్నచో మన బలములు సిద్ధముగ నున్నవా?

అంతి:—నిన్నటివఱకు మన ప్రతాప మద్వితీయము, నిరా ఘాటమునని లోకప్రసిద్ధికదా! ఇఁక నార్యులన్నవో నేఁటియుదయము ననే తమదియు నొక రాజ్యమె యని పేరుపెట్టుకొని మధ్యాహ్నమే మనతో యుద్ధమునకు దలపడరు. పైకి దామొక జాతివారమని చెప్పి కొనుచున్నను వేరుసిల్పికొనుటకుఁ గత్తిదూయుటకు వెనుదీయు మని చెప్పికొనినను వారీరాత్రియె వచ్చి మనపైఁ బడజాలరు. యుద్ధ సన్నద్ధులై మన కెదురు నిల్చుటకు వారికిని జాలగాలము పట్టును.

ఆలోపుననే మనము ఫౌజుల సిద్ధము చేసికొని మిత్రమండలిని గూర్చి కొనగలము.

ఇంతలో రాయబారి వచ్చె ననువార్త వచ్చెను. తత్క్షణము ప్రవేశ పెట్టుటకు రాజాజ్ఞ యీయబడెను. రాయబారి యమూల్యములగు ననేకపు గానుకలతో ప్రవేశించి యలకసుందరునకు మ్రొక్కి వానిని యాతని ముందర బెట్టించెను.

అంతి :—ఓహో! ఏమీ! యీకానుకలు వారు భీతిలిరా?

రాయ :—ఈశాలువలు, సెల్లాలు, హారములు అన్నియు గౌరవార్థమును పూర్వ స్నేహమును దలంచియు నూతన బాంధవ్యము నెంచియు యవన సార్వభౌమునికి వారి యల్లుడు పంపెనని విన్నవింపు మనిరి.

అల :—ఏమి యీకావరము! తరువాత

రాయ :—తరువాత మీ పుత్రిక యీలేఖ మీకిమ్మనికోరెను. అలకసుందరు డాలేఖ నందుకొని చదువకయే యేదో యాలోచించుచు దల వంకించుచుండెను.

రాయ :—మీ సందేశము నాముఖమున వారు సావధానముగఁ దుదివఱకు నాలకించిరి.

అల :—రంజసికూడ నాటి సభయందున్నదా! పర్యవసానమును ముందెఱింగింపుము. విశేషములు నెమ్మదిమీఁద వివరింపవచ్చును.

రాయ :—ఆవలించిన బ్రేగులు లెక్కపెట్టు నెరసిన గడ్డములు కాషాయకౌపీనములు చుట్టబెట్టుకొని వరుసలుదీరి యాసభ నలంకరించి యుండ పర్యవసానమున కేమున్నది? ఆత్మగౌరవ భంగకరముగ నార్యు డెన్నటికి వర్తింపజాల డనియు నవసర మగుచో యుద్ధమునకే సంసిద్ధు డనియు రణరంగమున నోటమియే కలిగినను మృత్యువు వారి యశోరక్షకుడై యున్నదనియు స్పష్టముగ ప్రభాకరుడే లేచి వచించెను.

రంజనియు వరసను నిలిచి యుందుల కామోదించెను. సభ యంతయుఁ దదంగీకార సూచకముగ నానందమున బెద్ద కోలాహలము గావించెను.

అంతి :—అయినచో వారు మనపై దండెత్తి రానుండిరా! ఎప్పుడు?

రాయ :—అన్యరాజ్యాక్రమణము వారి యున్నత ధర్మాశయమునకు విరుద్ధ మఁట! విజయసింహుడు—సేనాని కావలయు—ఏక్కడలేని దర్పమును నటించుచు నుడివెను.

అంతి :—(పక్కున నవ్వి) మహారాజా! విశదమైనదా?

అల :—(మందహాసముతో) ఇంకను విశేషము లేమి? మనము వారి స్వాతంత్ర్య మంగీకరించెద మనియు మన సామ్రాజ్యములో చేరి యుండెద మన్నచో వారికి యితర రాజుల దాడివలన భయ మావంతయు నక్కఱలేదని విపులముగ నుపన్యసించితివా? కప్పము గట్టుట యనగా సాలుసాలునకు లెక్కచూచి బంగారము మనకిక్కడకు పంప నక్కఱ లేదనియు వారి ప్రజలకును మన ప్రజలకును గూడ మిక్కిలి యుపయోగకరమగు వర్తక వ్యాపారములలో యవనుల సరకులపై సుంకము తక్కిన దేశస్థుల సరకులపై వేయు సుంకముకంటె నించుక తగ్గించి వేసిన నాలాభమునే మనము కప్పముక్రింద జమకట్టుకొందు మనియు నెల్లరకు దెలియునట్లు విశదపఱచితివా?

రాయ :—కప్ప మన్న శబ్దమే వారి కేవగింపు కలిగించునఁట. కావలసినచో స్నేహబాంధవ్యముల ననుసరించి యుప్పు డప్పుడు కానుకల నీయవచ్చు నఁట—కాని కప్ప మన్నమాట యుచ్చరింప వలనుపడదఁట.

అల :—అమాయకురాలగు రాజకన్యను దొంగతనముగ లేవదీసికొనిపోవుట వారి యున్నతధర్మాశయములకు సంబంధించి యుండుట చేతనే క్షమాపణ కోర నక్కఱలేదనెనా! యవనస్త్రీని పరిణయమై

యార్యుడు యవనజాతి కంతకును లాఘవము కళంకము దెచ్చినందుల కేమనెను ?

రాయ :—మహారాజా ! యీప్రశ్న వచ్చినప్పుడు ప్రభాకరుఁ డేమియు మాటలాడలేదు. రంజనీదేవి యీ యుత్తరమును వ్రాయు చుండెను. అప్పు డొక మూలనుండి రాజద్రోహి కమలాకాంతుఁడు తటాలున లేచి " రాయబారీ ! యవనుని గౌరవలాఘవముల నామూ ల్యాగ్ర మెఱింగిన కమలాకాంతు డీనభయుం డున్నాడనుమా ! యని మీప్రభువగు నలకసుందరునకు నావాక్యముగా నెఱింగింపుము" అని విరసనభావముతో జెప్పెను.

అంతి :—కమలాకాంతుఁడు చావలేదా ? జీవించి యుండెనా !

అల :—ఎటులయిన వానికి దగిన పరాభవము చేసి తీరవలెను.

అంతి :—ఇఁక నచ్చటివారి యుత్సాహము ప్రయత్నములు నెట్లున్నవి? తాతు మెత్తనైన గుఱ్ఱము మూడుకాళ్లపై బరుగెత్తునఁట.

రాయ :—దేశమునం దెల్ల శౌర్యధైర్యోత్సాహములు పురి గొల్పుచు నాయుధవిద్యయం దెల్లరకు నభిరుచి కల్గించుచు ధణువిద్యా శిక్షణ మాసేతు హిమాచలము నెలకొల్పుచుండిరి. దానికి తగిన ప్రోత్సాహ మొసంగుచుండి దేశమున నెల్లెడల శస్త్రవిద్యా ప్రదర్శన పరీక్షలు పెట్టి గొప్ప గొప్ప బహుమానముల నిచ్చుచుండిరి. నేఁ డార్యా వర్తమందు నెప్పుడు లేని యైకమత్యము, దేశభక్తి, కార్యదీక్ష, సాహసము, నుత్సాహము వెల్లివిరియుచున్నది. ప్రభాకరుఁడు కేవల మవతారమూర్తియని వారి దృఢవిశ్వాసము- మఱచితిని. నేను తారశీకము దాటి వచ్చుచుండ నొకవార్త వింటిని: దేవదత్తము, మహాత్తరము నని చెప్పఁబడు మణిహారమును రంజనీదేవి న్యాయముగఁ దన మెడనుండి దీసి జేపు కురుక్షేత్రమందు జరుగఁబోవు శస్త్రవిద్యా ప్రదర్శనమునం దుత్తమునికిచ్చుటకుఁ బందెము పెట్టుచు, నైకమత్యా వశ్యకతను, బోధించుచు, క్షాత్రతేజమును రగుల్కొల్పుచు, గంభీరోష

న్యానము గావించెనఁట. ఆ భాగమును విజయసింహుఁడు పొందగలవాఁ డనికూడఁ బ్రతీతి వ్యాపించి యున్నది.

అల :—"చాలు-చాలు. ఇఁక వినఁజాల. తెలియవలసిన సంగతు లన్నియుఁ దెలిసిన" వని చేతిలో నలుగుచున్న లేఖను విప్పి చదువ మొదలుపెట్టి "ప్రియజనకా! నీ తనయ." "ఛీ పాపాత్మురాలా! కుల ద్రోహినీ! కులట! శనిగ్రహమా! నీవు నా తనయవా? నేను నీప్రియ జనకుఁడనా? ఈనీచురాలు వ్రాసినయుత్తరమును సాదరముగ యవన సార్వభౌముఁడు పఠించుటా?" యని యుత్తరమును జించి పాఱవేసెను.

"ఈ కానుకలనుగూడ నే నంగీకరింపను. తాఁక" వని యన్నియు నేలపైఁ జెదరిపడునటుల బల్లపై నుండి క్రిందకు ద్రోసివేసి, "తగులఁ బెట్టుఁడు, అంతిమోకుఁడా! లేలెమ్ము. మనమింక నార్యావర్తమునే మంటఁ గలుపవలయు. గంగానదిలో నీరుబదులు రక్తము ప్రవహించ వలెను." అని గర్జించుచు సార్వభౌముఁడు దిగ్గున లేఁచెను. అంతిమోకుఁడును రాయబారికూడ వెనువెంటనే లేఁచి నిలువఁబడిరి.

అలక :— అంతిమోకుఁడా! అదిగో! "అచ్చటనే నాఁడు ప్రియంవద యాత్మహత్య గావించుకొనినది. ఇదిగో! పిచ్చివానిఁ జూచినటుల నన్నుఁ జూచి..........నాయెదుట నిలిచి......ఇదిగో నవ్వుచున్నది."

కొంతవఱకు నిశ్చేష్టుఁడై నిలిచి కన్నులు మూసికొని, "వారు పట్టుదల గలవారు, అవసరమగుచో నార్యజాతిని రూపుమాపుదుము. మనము పట్టుదల వదలరాదు! తెలిసినదా! పొందు. మీమీ యుద్యోగంబులయం దుండుఁడు."

అంతి :— "మహారాజా! దేవరయాజ్ఞ నెఱవేఱినది? ఇదే సేవకుఁడు పోయివచ్చు నని వందనముచేసి పోయెను. రాయబారికూడ సెలవు గైకొని యాతని వెంబడించెను.

కొలదినిమిషముల తరువాత సేవకుఁడొకఁడు ప్రవేశించి, "దేవా పారశీకసుందరు లిరువురు గొప్ప గాయకశిఖామణులు తమ దర్శనంబు నకై వేచియుండిరి."

అలక :—ఏమి! చంపినను జచ్చువారు కారా! ప్రియంవదా! ఉండు మీఁగదియుండే యుండుము? ఎవరురా! అక్కడ?

సేవ :—ప్రభుల యాజ్ఞ!

అలక :—ఏమి! యిటు వచ్చితివి!

సేవ :—మహారాజా! పారశీకసుందరు లిరువురు గాయక శిఖామణులఁట, దేవరదర్శనము వేఁడుచున్నారు.

అలక :—(కొంచెముసేపాఁగి) "వినోదమందిరమునఁ బ్రవేశ పెట్టుము." సేవకుఁడు వంగివంగి సలాము చేయుచు దారిచూప, చక్రవర్తి వాని వెనువెంబడి వినోదమందిరాభిముఖుఁడై చనెను.

## ౧౫

జాముర్రాత్రి యయ్యెను. నిర్మలనీలాకాశము నక్షత్రకాంతులతో నిండి మనోహరముగఁ బ్రకాశించుచున్నది. చంద్రోదయముకాఁబోవుచున్నది నిశాకాంత మందహాసమువలె, తూర్పున రజతరేఖ దోఁచుచుండెను. అంతఃపుర సౌధోపరిభాగమున రంజని, సోఫాపై మేనువ్రేర్చి, గగన వితానముఁ దిలకించుచుఁ దనలోఁ దానిట్లు తలపోయుచుండెను.

"అదిగో చంద్రోదయ మగుచున్నది. ఎంత భావపూరితము - మనోహరము - ఆనందాబ్ధి యుప్పొంగి వెల్లివిరియుచున్నది. ఎండి, మోడగు చిత్తమునఁగూడఁ గోరిక లీరిక లెత్తుచున్నవి. రసవిహీనమై, బీడువారిన హృదయసీమ యీ చంద్రకలశామృతసేచనంబునఁ దిఱిగి సారవంతమై నరసవాంఛసంబులకు దావగుచున్నది. ఓ చంద్రా! నా విజయచంద్రుఁడు చెప్పుచుండెడి కథల నన్నిటఁ గథానాయకుఁడవు నీవేనా? ఈహారమును నాచేతులతో విజయునికంఠమున నలంకరించి యా నగుమోము తిలకింతునా? ప్రేమపాశ మిందువలన బలపడదా?"

ఇంతలోఁ బ్రభాకరుఁడు రంజని యంతఃపురముఁ జొచ్చి యామె
నవలోకించుచుండెను.

రంజని :—తనలో "నక్కటా! ప్రభాకరా! మన యిరువు
రను నడుమ నేదియో నిలిచి, వేటు చేయుచున్నది. అది నాకన్నుల
గానరాకున్నది. మాటలఁ జెప్పుటకుఁ జిక్కకున్నది. నిన్నేదియో
యడుగవలెనని యుందును. కాని యేమిచేతును. "యని యనుకొ
చుండఁ బ్రభాకరుఁ డామెను జేరి "దేవీ! ఏమి యాలోచిం
చుంటివి?"

రంజ :—ఆ చందమామను జూచిన నాకు మన విజయుఁ
చెప్పిన కథ యొకటి జ్ఞాపకము వచ్చుచున్నది. నాథా! అది సత్యమ
అసత్యమా యని యాలోచించుచుంటిని.

ప్రభా :—అది యేమికథ? నీవు గాన మన్నను, కథ లన్న
మిక్కిలి ప్రేమింతువు.

రంజ :—ఈ వెలుంగు జాబిల్లికిఁ దారామనోహరుఁ డని పేరు
కదా! అట్లేల కలిగెను?

ప్రభా :—నక్షత్రములన్నియుఁ జుట్టును మెఱయుచుండ
నడుమఁ బూర్ణచంద్రుఁడు మిక్కిలి యాహ్లాదకరముగఁ బ్రకాశించు
చుండును. గాన, గవులు తమ భావనాతిశయమున నట్లు త్ప్రేక్షించి

రంజ :—అంతియేనా?—బృహస్పతియను గొప్పవిద్యాంసుఁడు
తత్త్వవేత్తయు, - కర్మిష్ఠియు నొకఁడు కలఁడట. మిక్కిలి రూపవ
యగు తార యను జవ్వని యాతనికి భార్యయై సేవించుచుండెడి దఁట—

ప్రభా :—అయిన

రంజ :—షోడశకళావిరాజితుండు భువనైక మోహనోద్దీప
నరనసౌందర్య విలాసవంతుండును నగు చంద్రుఁ డాబృహస్పతియొ
శిష్యుఁడై విద్యల నేర్చుచుండెను.

ప్రభా :—సిమ్మట.

రంజ:—మహాత్ముఁడగు బృహస్పతి దేవగురుఁడై దేవకార్య నిర్వహణదీక్షాపరాయణుఁడై తదేక కార్యధ్యాననిరతుండై, యన్యంబు మఱచి ప్రవర్తించుచు నొకనాఁడు త్రిలోకాధినాథుండగు దేవేంద్రునిచే సంకల్పింపఁబడిన మహాక్రతువున కాహూతుఁడై చనెనఁట.

ప్రభా:—ఆహా! కర్మయోగియొక్క కార్యదీక్ష యెట్టిదో చూచితివా? సఖీ! తరువాత నేమిజరిగెఁది? నీ కథాకౌశలము వినిన కొలఁదియు విన ముచ్చటగుచున్నది.

రంజ:—ఇంకను సిగ్గుతోఁ దల వంచుకొని ప్రభాకరుని ముఖముపై వాల్చూపులు బఱపుచుండెను. "పై నేమి జరిగినదో నీకింకను నిజముగాఁ దెలియనే లేదా?" యని యాచూపులు స్పష్టముగ నడుగుచున్నట్లుండెను.

ప్రభా:—క్రతువున కేమైన విఘ్నము కలిగెనా? చెప్పుటకు సంకోచించెద వేల? నాయొద్ద నీకు సందేహమేల? రహస్యమున్నదా?

రంజ:—(స్వగతమున) ప్రభాకరా! నిన్ను జూచిన నాకు జాలి యగుచున్నది. (ప్రకాశముగ) తారాశశాంకుల నడుమ మోహ ముద్భవించి యిరువుర బద్ధులజేసి పీడించి యన్యోన్య బాహుమధ్య మాత్రశరణ్యులఁ గావించెను. అట్టుల నిజముగ జరిగియుండునని నీవు నమ్మెదువా? జరిగిన కార్యము పాపకార్యమైనచో ముగ్గురిలో దోషి యెవ్వరని నీయభిప్రాయము?

ప్రభా:—ప్రేయసీ! నాబుద్ధి కీకథ కల్పిత మనియు నట్టి ప్రవర్తన దేవమానవజాతులయందు సహజ మనియుఁ దోఁచుచున్నది. మన మట్టి కథలనుగూర్చి విశేషముగఁ దలఁచుటకూడఁ దగదు... అప్పుడే యర్ధరాత్రము కావచ్చినది. ఎల్లుండి మన దేశమందలి మహావీరుల యస్త్రవిద్యా ప్రదర్శన దినము. మనము తెల్లవారుజామున నే బయలుదేరి కురుక్షేత్రమున కరుగుదుమా? విజయసింహుని బలపరాక్రమములు చూచుటకు నీవు ముచ్చట పడుచుందువు?

ప్రభాకరుని మాట ముగియకపూర్వమే విజయసింహుఁడు రంజనీ దేవి యంతఃపురము ప్రవేశించెను.

రంజ :—నాథా! నాకదేమో చాల నాందోళనముగ నున్నది; కాని నీతో నిట్టితరుణమున రాఁజాలకుంటిని కదా యని విచారించు చున్నాను. అయినను ప్రభాకరా! నీ వాఁగఁజనదు. పోయి రమ్ము! తరువాత మనము విజయు నిచ్చటనే గౌరవింతము.

ప్రభా :—విజయ మందినవాని కారక్తస్వేద జలబిందువు లారక మునుపే రంగస్థలమునందే బహూకరించుట యెక్కుడు సరసముగా నుండును. మన హృదయముల దివ్యానుబంధమునకు భౌతిక చిహ్న మగు దివ్యమణిహారమును మన ప్రజల క్షేమముకొఱకు వారి యందలి మహావీరాగ్రణి కొసంగుట కిదివఱకే నిశ్చయించుకొంటిమి గద! ఇవు డిచ్చట......

రంజ :—(మాఱుమాటాడక తలవంచుకొని మణిహారమునుదీసి ప్రభాకరునిచేతి కందిచ్చుచు). నాకింతగఁ జెప్పవలయునే! నాథా! సదా మీకోర్కుల ననుసరించియె మెలంగుచుంటిని.

ప్రభా :—[హారము చేత వ్రేలాడుచుండ] విశ్వజిద్యాగమునకై వామపార్శ్వమున నిలిచి నన్నుఁ బ్రోత్సహించు ధర్మపత్నివి!-మంచిది. అటులైన విజయసింహా! నీమాట యేమి! ఎప్పుడు బయలు దేరుదువు! ఇంక నిటులనే యుంటివి కదా!

విజయ :—మహారాజా! మొన్నటి బాణమువలనఁ గలిగిన గాయ మింకను నీపార్శ్వమునఁ బూర్తిగ మానలేదు. పచ్చిగనే యున్నది. ఏమిచేతును! ఇట్టి ముఖ్యావసరంబున నిట్టి యాటంకము దైవము కల్పించెఁ గదా యని విచారించుచుంటిని.

ప్రభా :—మంచిది. నేబోయి వచ్చెదను. మీ కిరువురకును దేవుఁడు త్వరలోఁ బూర్ణారోగ్య మొసంగుగాక!

అని యాశీర్వదించుచు, నిరుపురి మోముల నావెన్నెల వెలుగున సించుక పాఱఁజూచి వెడలిపోయెను. ఆచూపునం దనుమానము పొడగట్టెనా యని నిరుపురకు నొక్క క్షణకాలము మాత్రము సందేహ మొదవెను.

రంజ :—"దేవజాతియం దట్టి యనుమానమును నసహజమే" అని యనుకొని మనస్సమాధానము చేసికొనుచుండెను.

విజయ :—ప్రియా! ఏమి? నీ కెటులున్నది!

రంజ :—నీవు చాలఁ దప్పు చేసితివి— గొప్పతప్పు చేసితివి. నీవు కురుక్షేత్రమున కేల మఱుఁగవైతివి? అందఱు వెడలుచుండ మన నిరుపుర మింటనిలిచిన లోక మనుమానించదా? మన సౌఖ్యమును జూచి యోర్వలేమిచేఁ బలువిధముల రొదచేయక మానునా? ప్రాణసఖా! పాపిష్టిలోకముతో మన కేమి— దానిరొద దోమరొద. మనల నేమిచేయు ననుకొన్నచో మన మత్యంతైక్యభావంబున నేకమనస్కులమై స్వర్గసౌఖ్యంబుల మునిఁగి తేలుచు మైమఱచి యున్నయెడ నాదోమయె యొక కాటు వైచి మన సుఖస్వప్నంబునకు విఘ్నంబు కూర్చునేమో యని భయము.

విజయ :—ఏ మేమీ! ప్రియసఖీ—నీవలన నేఁడు వింతలు వినఁబడుచున్నవి! పాపిష్టిలోకమా? అది యీనాఁడె క్రొత్తగ వచ్చినది కాఁబోలు! ఏమి మాటనేర్పు? అలనాటిసంజవేళ జ్ఞప్తి యున్నచో మేడమీఁద యమునవైపుగదిలో గవాక్షముకడ మన కేలోక మేమైన కనఁబడినదా? ఇట్టిమాట లేల? రంజనీ! నీవు రాణివి! ప్రభాకర మహారాజునకు ద్రోహముచేయనేల యని నీకు నిజముగ కించయే గలుగుచున్నచో నీవటులే యుండుము. నేను బరమప్రీతితోఁ దదనుగుణ్యముగనే ప్రవర్తించెదను.

రంజ :— మత్త్వైకవిధానమ వగునీ వెఱింగియు నిటుల నిష్ఠురము లాడుట క్రూరముకాదా! నిర్దయుఁడగు మన్మథుని

పూవులుకలచేతనే గాయపడి వేదన నొందుచున్న నాహృదయమును జూచుము-దానిపై నీ వాగ్బాణములుకూడ నెటుల నాటికొన్నవో! ఇది నీకుఁదగునా? నాయానందమున కెల్ల నిన్నె నమ్మినదానను. అది నీ వెఱుఁగవా? ప్రభాకరుఁడు సార్వభౌముఁడు నా కానంద మీయఁజాలఁడు. అతఁడు పరిపూర్ణుఁడు. తేజశ్శాలి. మధ్యాహ్నమార్తాండుఁడు. నాకు దుర్నిరీక్ష్యుఁడు నన్నుఁ బ్రేమించువానికి - నేను బ్రేమింపగల వానికి నీలోకమున నాటియుండవలెను. విజయచంద్రా! నాహృదయకమలము చంద్రదర్శనమున విచిత్రముగ వికసించినది. నీవు నాప్రేమైకవిధానమున ఆనందకందము - ప్రాణసఖ! ప్రభాకరుఁడు కేవల పాణిగ్రహణ మాత్రంబుననె నాపతి యాయెను. మణిహారమును నా మెడను వేసి నన్ను గాంధర్వవివాహమున భార్యగఁ బడసెను. నేటి తరుణమున నీహారముతో నేను స్వయముగ నీకంఠ మలంకరింపవలెనని యెంతయో ముచ్చట పడుచుండ నీ వాయవకాశము జూపనీయ నెంచితివి. నాముచ్చట తీర్పజాలకపోతివి. మనోహరా! ఇప్పుడైన మించిన దేమి. నీవు బయలు దేరి చని, విజయసింహా! నీనామము సార్థకముచేసికొనవా?

విజయ:—నావంకఁ జూచుచు నాందోళనముగా నున్నదని చెప్పినపుడు నన్నాగుమంటివేమొ యని తలఁచితిని. మఱి యిప్పుడేమి చేతును? ఏదియో సాకు చెప్పి రానని తరువాతఁ దిగి రంగస్థలమున కేనికి నా మోమెటులఁ గన్పఱుతును. సత్యహరిశ్చంద్రుని మించిన సత్యవ్రతునియెదుట నా మోమెటులఁ గన్పరుపఁగలనో తోఁచకున్నది. ప్రేయసీ! ఏమిచేయుమనెదవు?

రంజ:—నిర్మలమనస్కుఁడు. నిష్కళంక హృదయుఁడు - పసి బాలుఁడు! - లోకపు మాయమర్మముల నెఱిఁగి పాలించు చతురుఁడు గాఁడు. మఱి యేలాగైనఁ దన వద్దనున్న నన్ను - నాప్రసక్తియే లేక విడిచి పోయెడివానికి నేడుమాత్ర మేదో యించుక యనుమానము

కలిగినట్లు పొడగట్టినది. కాని మందలించుటయే యెఱుఁగఁడు. అది యొక్కటియే ఆదివ్యపురుషునికడ దోషముగాఁ గనుపించుచున్నది. అట్టివానికి సమాధానము చెప్పుట కష్టమా! నీవు వెళ్లుము. మాఱు వేషమున వెళ్లుము - పిదప "కాఁజాలనఁటివే యేలవచ్చితివని", యడిగినచో "నాకిదివఱలో నేర్పడియున్న ప్రతిష్ఠ మూలముననే యితరులు జంకి నాకు జయము విడుచుచున్నారను నొక్క యుపవాదము బయలు దేరుచున్నది. కావున నీవన్నాగ్గ మవసరమైన" దని చెప్పవచ్చును. లెమ్ము! విజయము నందుము (అని ముద్దుపెట్టికొని) ఇందుమూలమున నీకు నిజముగ విజయము సమకూఱుగాక! పొమ్మురమ్ము విజయా! రణరంగమున నీవు విజయసింహుఁడ వఁటకదా! వేఱు యోచనలు చేయక పోయి గౌరవపదవి నందిరమ్ము.

విజయ:—(అర్ధచంద్రునిశోభతో శోభిల్లుచున్న రంజని ఫాలమున నుదారాతిశయమున ముద్దుపెట్టుకొని.)

రంజనీ! నా హృదయ రంజనీ! చక్కఁగాఁ గనిపెట్టితివి. శత్రునాశన విషయమును దప్పఁ దక్కిన విషయములఁ జక్రవర్తి శాంతిగాఁ బాటింపకున్నను తన యనుచరులు కీర్తిశాలురగుట చూచి మిక్కిలి యానందించుచుండును. నీకుటిలాలకములమాటున నెంత లెంతలు యోజన లున్నవి! ఇఁక జాగు సేయ నేల - నీయాజ్ఞ నీ విజయుఁడు శిరసావహించుచున్నాఁడు. అచిరకాలముననె వీని కీ ప్రేమ రాజ్యలక్ష్మి మోహనసౌందర్య పునర్దర్శన గౌరవభాగ్యమబ్బుఁగాక!

రంజ:—విజయసింహుని చేయి ముద్దు పెట్టుకొనుచు

"నీకు విజయము నిశ్చయ" మనియెను. విజయుఁడు రంజనికోరిక చొప్పునఁ గురుక్షేత్రమునకు రహస్యముగఁ బయన మయ్యెను. అతని గుఱ్ఱము చక్కఁగ నలిగిన రాజబాటను విడిచి ప్రక్కమార్గములఁ జనుచుండెను. విజయుఁడు తన ముందుదారి చూచుకొనుట లేదు. తనకును ప్రభాకరునకును గల వ్యత్యాసమును గూర్చి తలపోయుచుండెను.

కొండల నెక్కుచుండెను. - లోయలలోనికి దిగుచుండెను. గుట్టల దాటుచుండెను. తాను చేయుచున్న మోసము - ద్రోహము - పాపము నాతని మనసును నించుక కలవరపెట్టుచుండెను. భూలోకమోహిని యగు రంజని మందహాసము తిరిగి యాకలంతల నెల్ల నివారించి నూతన వాంఛల బ్రేరేపించుచుండెను - అంతఃపురమందు రంజని మిక్కిలి యుల్లాసముతోఁ జెలికత్తెలఁ గూడి యుపవనంబుల విహరించుచు వినోదంబులఁ గాలము గడుపుచున్నది.

•

## ౧౬

ప్రతాపసింహుఁడు నేఁడు మిక్కిలి ముసలివాఁడు. జన్మభూమి పరాక్రాంతము కాఁబోవుచున్న సమయమున మిగుల ధైర్యసాహసములతో శత్రువున కెదురునిల్చి రణరంగమున పరాక్రమమును జూపి తనవిధ్యుక్త ధర్మము నిర్వర్తించి దైవయోగమునఁ బరాజితుఁడై నిజపుత్ర పుత్రికా సహితంబుగ యవన చెఱశాలల బంధింపఁబడుటయు! తిరిగి చెఱనుండి విముక్తుఁడై భరతఖండమును చేరిన విధంబును ప్రతాపసింహునకు సర్వము దైవాయత్త మను విశ్వాసమును దృఢతరము గావించి యాతని ప్రవర్తనము నందొక విధమగు మార్పును గలుగఁజేసెను. నేఁడు యవను లార్యావర్తమునుండి లేచిపోయినను ప్రభాకరుఁడు నూతన సామ్రాజ్యమును స్థాపించినను ప్రతాపసింహున కానందము మాత్రమె కలిగినది. కాని యీ నూతన పరిస్థితులలోఁ దానుగూడ పాల్గొని పనిచేయువలెనను కార్యోత్సాహము గలుగలేదు. అతఁడు నిష్కల్మష మనస్కుఁడై శాంతహృదయముతో దైవభక్తిగలిగి యతిథి పూజలఁ జేసికొనుచు, కొడుకును గూతును జూచుకొనుచు మిక్కిలి పురాతన మగు తన చిన్నదుర్గమందుఁ గాలము గడుపుచుండెను. చంద్రహాసుఁడా ప్రాంతమునందె యొక కొండగుహాయం దాశ్రమ మేర్పఱచుకొని యున్న యొక వానప్రస్థునొద్ద విలువిద్యయు,

సంగీతమును, గణిత జ్యోతిష శాస్త్రముల నభ్యసించుచుండెను. పద్మినీ చంద్రహాసు లన్నదమ్ములవలె నాటపాటలయందుఁ గాలము గడుపు చుండిరి. ప్రతాపసింహుఁడును దల్లిలేని పిల్లయగు పద్మినిని గొమరుని వలెనే చూచుకొనుచుండెను. ఒక్కొక్క ప్పుడు. పద్మిని తండ్రి దేవతార్చనకుఁ బూలుకోయుట మాని యన్నతోఁ గలసి గుహ కేగి మురళి యూదుచు గురునకుఁ దన సహజ గానకళాకౌశలమును జూపి యచ్చెరువు గలిగించుచుండును. ఆ రాజయోగి బాలిక రూపురేఖా విలాసముల సాముద్రికము పరిశీలించి చంద్రహాసునితో రహస్యముగ "ఈనుగుణమణి మహారాజ్ఞిని మించి తన పావనకీర్తి చంద్రికను దిగంత విశాలముగను గాలాంత సుస్థిరముగను జేయును" అని చెప్పుచుండును. ఒక్కొక సంజవేళ పద్మినీ చంద్రహాసు లొక చిన్ననావపై నెక్కి యమునా తరంగములతోఁ గూడఁ గ్రిందుమీదుల కూగిఁ యాడుచుఁ జాలదూరము వెన్నెల వచ్చువఱకు పోవుచుందురు. ఒకనాఁటి శేత వెన్నెలలో యమునయందు నావపైఁ బద్మిని సోదరునియంక భాగమున దన శిరమిడి పండుకొని గగనతలమును రెప్పవాల్పక చూచుచు "నే నీ విశ్వము నెంతక్రొత్తగ వింతగఁ జూచుచుంటినో, యా విశ్వమును నన్నంతవింతగఁ గ్రొత్తఁగఁ జూచుచున్నటు" లున్నది. లేనిచో నేమి యీనిశ్శబ్దము! నీలకాంతి యెంతసుందరము అహ్లాదకరము! అన్నా! నీకీ నక్షత్రములఁగూర్చి యోగి యేమిచెప్పెను. అవి కాంతిపుంజనుగు స్వర్గమందలి గవాక్షములా? ఈలోకమునెల్ల దయామయుడై సదా కనిపెట్టి చూచుచుండు పరమేశ్వరుని నేత్రములా? లేక మహాత్ములగు ఋషులును, బుణ్యపురుషులును నక్షత్రములం దుందురందురు. మన మీనావయందుండి విహారము సలుపుచున్నటులనే వారును యా నక్షత్రములం దుండి యానీలసముద్రమున విహారము సలుపుచుందురా? యని యడిగెను. చంద్రహాసుఁడు తనచెల్లె లట్లడుగుచుండగా నాపె మోము నూరక తనివితీరక తిలకించుచు నమందానందకందళిత

హృదయారవిందుఁడై సోదరవాత్సల్యాతిశయము ప్రకటముగాఁ బద్మి
శిరము ముద్దుబెట్టుకొని "నాకు గురువు చెప్పినదానికంటె నీ
చెప్పినవే సత్యములు పరమప్రమాణములు" అని హృదయము
కనుభవపూర్వకముగఁ దట్టుచున్నది. ఆయోగి చెప్పినదికూడ వినుమ
చాలవిచిత్రముగ నుండును. ఆమినుకుమినుకు మనుచున్న వన్నియు మ
భూమికంటె యెన్నివందలవేల రెట్లో పెద్దవఁట - వాని కాంతికిరణ
భూమిపైఁ బడుటకి ననేకసంవత్సరములు పట్టునట - అందు కొన్నిం
కాంతి యింకను నేఁటివఱకు మనభూమిని జేరనేలేదఁట. అందు కొన్ని
సూర్యునికంటెఁ బెద్దవియుఁ దేజోవంతములునై యుండునట. సూర్యు
చుట్టు భూమియు గ్రహములు తిరుగుచున్నటులనే యా సూర్యు
నీభూమియొక్కయు గ్రహములయొక్కయు జుట్టును తిరుగుచుండునఁట

పద్మి:—అయినచో నీయాకాశ మెంత విశాలమైనదో!
యెన్నటిగారడీవాఁడు బంతుల నెగురవేసినటులనే యీ మనభూమి
దక్కినయాగోళములు నన్నిఁటి నొక్కమాఱుగ నాకాశమున కెగ
వేసి త్రిప్పి త్రిప్పి యాడించుచుండెనా - ఆ దేవుఁడు అయినచో
యాఁటజూచి యానందించువా రెవరి? వా రెచ్చటఁ గూర్చుండిరో
చూతుము - నా వేలునకుఁ జిన్నగనున్న నక్షత్రమెంత సూక్ష్మము
మున్నదో!

చంద్ర:—నీవు మహాపతివ్రతాశిరోమణియు కల్యాణప్రద
యినియు నగు నరుంధతీదేవిని జూపుచున్నావు. ఆమెకుఁ గేలుమో
నమస్కరింపుము.

పద్మిని తటాలున లేచి నావయందు నిలిచి యరుంధతీదే
నమస్కరించెను. శరీరమునకు జవ్వనమువలెనే యామెసౌందర్యమ
కా బాలచంద్రిక యనుమతించిన శోభావిలాసములను గలిగించెను.

పద్మి:—అన్నా! పెండ్లి యనఁగా నేమిచేతురు!

చంద్ర :—ఒండొరులఁ బ్రేమించుకొనుచున్న స్త్రీపురుషుల జీవితప్రవాహములఁ గలిపి యేకముచేయుదురు. నాఁటినుండి యిరువురు నొక్కహృదయము, యొక్కమనస్సు, నొక్కప్రాణము, రెండు దేహములను గలిగి యీలోకమునఁ గూడ సుఖించెదరు. ఆగ్రహములెవరెవరికూడిక నిర్ణయించునో వారువారిని బ్రేమింతురఁట.

పద్మి :—ప్రేమించు టనగా నేమి? నీ వెవరిని బ్రేమించుచుంటివి?

చంద్ర :—నాకు బాగుగఁ దెలియదు.

పద్మి :—నాన్న నడుగుదుమా?

చంద్ర :—తప్పు! తప్పు! నీవడుగకూడదు. చాలరాత్రి యయినది. మనమింటికిఁ బోదము. నాన్న మనకొఱకు వెదకించుచుండును. ముసలిసేవకుఁడు—

పద్మి :—పాప మాముసలితాత నేనొకక్షణము కనఁబడనిచోఁ గన్నుల నీరుపెట్టుకొనును. నోట నాలుక లేదు. మాటరాదు. ఏమియుఁ జెప్పలేఁడు. కాని నన్నాజాలికరములగు కన్నులతో నెన్నియో నడుగుచుండును. ఏమియో చెప్పుచుండును—

చంద్ర :—యవనరాక్షసు లెంతచేసిరి.

పద్మి :—మనముచెఱలో నున్నప్పుడు మనయెదుటి కొట్టులోనే యొకసుకుమారుఁడగు బాలుఁడుండెడివాఁడు. నీకు జ్ఞప్తిలేదా? వాఁడె నాఁడానల్లత్రాచును జంపి నన్నుఁ గాపాడినవాఁడు ప్రభాకరుఁడని కాదా వానిపేరు.

చంద్ర :—వెఱ్ఱితల్లి! వాఁడే కాఁడటమ్మ నేఁడు మనకుఁ జక్రవర్తియై మనల నింకను గాపాడ గంకణము కట్టుకొనెను. ఆ ప్రభాకరుఁడె యీప్రభాకరుఁడు!

అని సోదరీసోదరులు కష్టసుఖములఁ జెప్పికొనుచు ముచ్చటలాడికొనుచు నింటికి నించుక ప్రొద్దుపోయి చేరిరి.

ఈవిధముగ నాకోటలోనివారు పైదేశముతో విశేషసంబంధము లేకుండగనె సుఖముగఁ గాలక్షేపము చేయుచుండిరి. కాని బొమ్మచెముడు తోడను, నితరములగునడవిచెట్లతోడను, లతలతోడను గప్పఁబడిన బురుజులతో నాదుర్గ మచ్చటనో మాఱుమూల యమునవంటి వనమధ్యమందు దున్నను నప్పుడప్పుడెవరో యొక రచ్చటకు వచ్చి దేశ పరిస్థితుల నాదుర్గములోనివారి చెవిని వేయుచునే యుందురు. ప్రభాకర సార్వభౌముఁడు తనసామ్రాజ్యమందలి మహావీరులనెల్ల నొక్కచోఁ జేర్చి సంఘముగ నేర్పఱచి దానికి భరతమాత కమూల్యాలంకార మగు "వీరహార" మని పేరుపెట్టెననియు, ఆహారమందలి వీరమణుల యొక్క చారిత్రము లిట్టివనియు, శత్రువులగు యవనుల నెదుర్కొను టకు దేశీయులయందలి బలపరాక్రమముల నభివృద్ధిపరచు నుద్దేశ్య ముతోఁ గురుక్షేత్రమున శస్త్రవిద్యాప్రదర్శనమును నిర్ణయించి యందు మెప్పుబడసినవానికి మహారాణిమెడ నలంకరించుచున్న మణి హారమును బహుమానముగ నిచ్చుటకుఁ బ్రకటించెననియు మొదలగు విషయము లాప్రతాపసింహుని కప్రయత్నముగనె తెలియవచ్చు చుండెను. ఆచిన్నకోటలో నన్నివృత్తాంతములకంటెను మణిహార బహుమానవృత్తాంత మెక్కువచప్పలకుఁ గారణమయ్యె. తుదకు ప్రభాకరుఁడు చేసిననిర్ణయము—దేశాభ్యుదయముకొఱకు భార్యమెడ నుండి దివ్యమగు మణిహారమును దీసి యిచ్చుట—ప్రభాకరునివంటి మహాపురుషునికిఁ దగియున్నదనిరి. బిడ్డలకుఁ దల్లినగలను బెట్టుటయుం దాక్షేపణ యేమియు నుండఁజాలదని నిశ్చయించిరి.

నేఁడుదయముననే లేచి పద్మిని యించుక ఖిన్నవదనయై కను పట్టెను. సదాకలకలలాడుచుండు ముఖపద్మమానాఁడు వేఱువిధముగా నుండుటఁ జూచినతోడనే తండ్రియు సోదరుఁడును బద్మినిఁ జేరఁజేరి "అమ్మా! నేఁడు నీవీలాగున నుంటివేమి! చిట్టితల్లీ! నీకేమైన శరీరమునందు బాధగనున్నదా! చెప్పుము. అమ్మా! ఏల నేత్రములనుండి

విచారముం దోంగి చూచుచున్నది!" అని యడుగ పద్మినియు నొక్కింత సిగ్గునం దలవంచుకొని యిట్లు చెప్పందొడంగెను.

"తండ్రీ! యేమియును లేదు. నా శరీర మారోగ్యవంతముగనే యున్నది—నాకు నిన్నరాత్రి యొక కల వచ్చినది. అది మిక్కిలి విచిత్రముగ నున్నది. అయిన నేలనోగాని నామనసున కది మంచికల కాదేమోయని తోంచుచున్నది; సంకోచము కలిగించుచున్నది."

చంద్ర:—ఏమి నాముద్దుచెల్లెలు కలగనుటయు—అది కీడగుటయు సంభవమేనా!

ప్రతా:—ఏమికల?

పద్మి:—యమునపై నే నొంటరిగం బండుకొని యుంటిని—నాముఖమున కెదురుగం బూర్ణచంద్రబింబము వెలుగుచుండెను. కాని పదిదిక్కులం జీకటి దట్టముగ నిండియుండెను. నాసోదరుండు కురు రంగమును గెల్చి మెప్పుపడసెనట—దట్టమగు నా చీంకటిలో నా కోలాహలము బాగుగ వినిపించుచుండెను. ఇంతలో నెవ్వరోవచ్చి కమంత కమువంటి మణినిం దెచ్చి నాచేతం బెట్టిరి. నాచిన్నచేతి నది యిముడక యమునలోం బడిపోయెను. పైనుండి చూచుచున్న చంద్రబింబము—అది చంద్రబింబము కాదు.—చంద్రవదన నన్నుజూచి నవ్వి మంచిపని జరిగినది. నీవు నిజముగ నంతకంటె నెక్కువ పెట్టిపుట్టితివా! అంతర మెరిగి మసలుకో యని హేళన చేసెను. ఆమె నవ్వగనే చీంకటి మాసి పోయి మాయమై. బాగుగ జట్టును వెలుంగు వచ్చినది. వెంటనే నాకు మెలంకువ కలిగినది."

ప్రతాపసింహుండా స్వప్నవృత్తాంత మంతయు శ్రద్ధగా నామూలాగ్రముగా విని వాత్సల్యంబునం దనయ శిరము మూర్కొని నిమురుచు మందహాసముతో నిట్లనియెను.

"కల్యాణప్రద మగు కలం గంటివి! నదీదర్శనము—మణిదర్శనము—పూర్ణచంద్రదర్శనము శుభప్రదములు. విచారమనవసరము."

చంద్రహాసుఁడు తండ్రివాక్యము ముగియకపూర్వమే.

“ఆకవచధారి మోమేమైన జ్ఞాపక మున్నదా! నీవు వివాహ వేళ పోల్చుకొనఁగలవా!” అని పరిహాసమాడఁ బద్మిని సిగ్గుచే నచ్చోటుఁబాసి పోనుఁకింప నామెచేయి పట్టుకొని వెండియు నిట్లనియె.

“నేను నీవు కురుక్షేత్రమునకుఁ బోయి గెల్చితినేని యీ చిన్న చేత మానికము పెట్టి జారనిత్తునా!”

ప్రతా:—ఎన్ని వరతులు!

పద్మిని నడుమ కూర్చుండఁబెట్టుకొని సోదరుఁడును దండ్రియుఁగూడ నీరీతి మృదువుగఁ బరిహాసము లాడుచు మందహాసము చేయుచుండిరి. కన్నతండ్రియుఁ దోడఁబుట్టినసోదరుఁడును గూడ నొకొ్కక సమయమున బిడ్డను సోదరినిఁ బరిహాసముచేసి యానందింతురుకదా! పద్మిని పెండ్లికూతురువలెఁ దలవంచుకొని కూరుచుండెను.

అంతలో మూఁగసేవకుఁడు దారిఁజూపఁ గవచధారియగు విజయసింహుఁడు ప్రవేశించెను. మూఁగవాఁడు వెడలిపోయెను. నూతన పురుషునిఁ జూచినంతనే ప్రతాపుఁడును చంద్రహాసుఁడును తమ మందహాసముల డిందుపఱచి వచ్చినయతిథి కెదురేఁగి స్వాగత మొసఁగి యుచితాసనముఁ జూపిరి. విజయసింహుఁడును దనకవచమును విప్పికొని నిర్దిష్టాసన మలంకరించి సేదఁదీర్చుకొనుచుండెను. ప్రతాపుడతిథికి నర్ఘ్యపాద్యాదుల నొసంగినపిదప యందఱును తిరిగి కూర్చుండిరి. యథోచితంబుగ స్వగ్రామనామ కుశలప్రశ్నలఁ గుచ్చితుదైఁ విజయసింహుఁడు తనకథ వారల కిట్లెఱింగించెను.

“నాయుది హస్తినాపురము. ప్రభాకరసార్వభౌముని వీరహార మందుఁ జేరి యుంటిని. నీవు కురుక్షేత్రమున జరుగు శస్త్రవిద్యాప్రదర్శనముఁ జూడఁ గుతూహలుండనై యరుగుచుంటిని. కొన్నికారణములచే ప్రచ్ఛన్నుఁడనై పోవలసియున్నది. కావున నా నామము నెఱింగింపఁజాల నందులకు మన్నింప వేడుచున్నాను.”

ప్రతా:—నేనును మనసార్వభౌముని కొలువునకు వచ్చి ప్రత్య
క్షముగఁ దద్వైభవము చూడఁజాలక పోయినను నచ్చటి విశేషము
లెల్లఁ దనుకోటి మహాపురుషులవల్ల నప్పుడప్పుడు తెలుసుకొనుచునే
యుంటిని. భరతమాత వీరహారమందలి నాయకమణి నేడు మా
మందిర మలంకరించుటచే ధన్యుల మైతిమి—కమలాకాంతుని గూడ
సార్వభౌముఁడు చేర్చుకొనెనఁట. ఆహా! యేమి యీ యౌదార్యము!

విజయ:—మిత్రద్రోహి పాతకి యైనను నిజముగ పశ్చాత్తాప
హృదయుఁ డగుచోఁ బరిశుద్ధుఁడే యని సార్వభౌముని సిద్ధాంతము.
ప్రభాకరుఁ డెంత తేజశ్శాలియో యంత కరుణాసముద్రుఁడు.

చంద్ర:—వీరాగ్రణీ! విజయసింహుఁ డీనాటు వచ్చుట లేదఁట
నిజమేనా? ఏమి కారణము?

విజయ:—"బాణవేధితుఁడై" యింట నుండఁదలఁచెను.

పద్మి:—విజయమూర్తి! దేశాభ్యుదయమునకై నేడు వీర
రస ముప్పొంగింపఁ దలంచి తన మెడనున్న మణిహారమును దీసి దేశ
మందలి మహావీరుని సంభావింప నమకట్టిన తల్లి—సాధ్వీమణి—మహా
రాణి—కంజనీదేవి, పాపము! నేఁడు జబ్బుగనున్నదని వింటిని. కురు
రంగమునకు వచ్చుటలేదా?

బంగరుగంటవలెఁ బలుకుచున్న యీ వాక్యములు వినినతోడనె,
తండ్రి చాటుననుండి సోదరుని సరసకువచ్చి నిలచిన పద్మినిని బంగరు
బొమ్మను, ముద్దులగుమ్మను విజయసింహుఁ డొక్కచూపు కన్నెత్తి
చూచెను. దేవాలయమున నన్నపూర్ణాపార్వతిని గాని దర్శించినప్పు
డెంతటి పాపియగు జారునకైనను హృదయమునం దెట్టి ప్రశాంతనిర్మ
లానందము కలుగునో యట్టి యానందమె విజయసింహుఁ డాపద్మిని
పావన సౌందర్యమును జూచినప్పుడు వాని హృదయమునఁ గలిగి
మనసునకుఁ గొంత యుపశమనమును గలిగించెను. ఒక్కక్షణకాలము
కంటె వానికన్ను లానువర్ణ దివ్యసుందర విగ్రహమును సమగ్రముగ

దర్శింపఁజాలక యామె పాదపద్మములపై ప్రాలి యటనుండి ప్రక్కకుఁ దొరలి తావచ్చిన ద్వారమువైపు చూచుచుండెను. పద్మినియు విజయసింహుని ముఖమును జూచుచు వానిసహమగు చూడ్కుల మధ్యమార్గంబునను బహూకరించి తన జనకసోదరులవంకఁ దృష్టి మరల్చెను. పద్మినిహృదయమున "ఆ కష్టజీవికి నే నేమియు సాయపడఁజాలను వానిముఖమున ముద్రితమై కానవచ్చెడి కష్టము తీసివేయఁజాలనో—పురుషుని కట్టి సాయము చేయఁజాలనిచో లోకమున స్త్రీయుండి యేమిప్రయోజనము?" అని తలపోయసాఁగెను. విజయసింహుఁ డీనూతన భావానుభవంబున నిమగ్నుఁడై పద్మిని యడిగిన ప్రశ్నకు సమాధానముఁ జెప్పుటయే మఱచిపోయెను. ప్రతాపసింహుఁ డీ భావపరివర్తనముల నెంతవఱకుఁ గనిపెట్టెనో తెలియదు. ఊరక చూచుచుండెను.

చంద్ర :— "మహారాజ్ఞి యగు రంజనీదేవి యస్వస్థయై యున్నదా?" యని తనచెల్లెలు వేసిన ప్రశ్ననే సంక్షిప్తముగాఁ దిరిగి యడిగెను.

విజయ :— యించుక జబ్బుగనే యున్నది; కాని త్వరలో నెమ్మది కలుగఁ గలదు.

అని విజయసింహుఁడు తలవంచుకొని సమాధానము చెప్పెను. వాని హృదయమునకుఁ జాలకష్టము తాపము కలుగుచుండెను. కావునఁ బ్రసంగమును మఱియొక మార్గమునకుఁ దప్పింపనెంచెను.

విజయ :— ప్రియసోదరా! నీ వింకను సార్వభౌముని దర్శనము చేయలేదేమి? నీవుకూడ నాతోడఁ గురుక్షేత్రమునకు వచ్చెదవని తలఁచెదను.

ప్రభా :— తప్పక వచ్చును!

చంద్ర :— నా చెల్లెలు కలగనెను. దానిని నిజముచేతును! ఏమో! ఎవరు చెప్పఁగలరు. మీ రట్లనెద రేమి!

ప్రతా:—నీవందు నెగ్గుట యెట్లున్నదో, మన పద్మిని కా మణిహారము సంతరియొప్పిదే యుండును. దేవతలచే, నీయఁబడినదియు, మహారాణిచే ధరింపఁబడుచున్నదియు నగు మణిహార మీ పేదపద్మిని ధరించుట కెంతయుచితమో యిట్టి మహావీరాధివీరులు నిల్చిన రంగమున నీవు జయము నంది మెప్పువడసి మణిహారము తెచ్చుటయు నంత సంభవమె—సందేహము లేదు.

విజయ:—కాదు. కాదు. ప్రతాపసింహప్రభు వట్లన జల్లునా- ప్రతాపసింహకిశోరంబునకుఁ గొన్ని కార్యంబు లసాధ్యంబులు గలవా? "సుందరాభరణంబు సుందరాంగులకే తగు" నన్న సూక్తి యిసుమంతయు విరుద్ధము లేకుండ నీలోకమున దగునగలలో కెల్ల నందమగు నగను బెట్టుకొనవచ్చు ననియే నాయభిప్రాయము. దివ్యసుందర రత్నహారము దివ్యసుందరవిగ్రహము ధరించుటచే ధరించినవారి సౌందర్యము కంటె ధరింపఁబడినదాని సౌందర్యమె మిక్కిలి యతిశయింపఁగలదు.

విజయసింహుఁ డీరీతిని బల్కుచుండఁగఁ బద్మినిమోము పద్మ కషాయిత మగుచుండెను. సిగ్గుపెంపునఁ దాను దనలోనికి ముణుచుకొని పోవుచుండెను. నడుమనడుమ యొక్కమాఱు యెట్టులో చక్కని నల్లని కనురెప్పలవారలనుండి సన్నసన్నముగా విజయసింహుని యౌన్నత్య గాంభీర్యప్రకటనంబగు విశాలఫాలమును, పౌరుషస్థాన మగు నాసికయును ప్రేమ కిరవగు కన్నుగవను పరాక్రమచిహ్నంబులగు దీర్ఘ బాహుద్వయంబును, సరససౌందర్యశోభితం బగు మందహాసాంచిత సుందరప్రవర్తనంబును సాహసించి చూచుచుండెను.

ప్రతా:—వాత్సల్యాతిశయంబున నట్లనవచ్చును.

చంద్ర:—అమ్మా నేనును మీతోఁ గురురంగమున కరుదెంచెద—

విజయ:—మనము మిక్కిలి సంతోషముతోఁ గలసి మెలసి మాటలాడుకొనుచుఁ బోయిన దూరము కనఁబడదు. నే నొంటరిగ

బయలుదేరి వచ్చునప్పుడు మనసుకలసినసోదరుండు పక్క పడచుట యందలి యానంద మెంతయుండునో యనుభావమందు బాగుగ నను భవ మైనది ; కాని నా దొకచిన్నకోరిక కలదు.

పద్మిని తల పైకెత్తిచూచెను.

చం:—మాశక్తికి మించినది కానిచోఁ గోరిక తీర్చుటకంటె మా కానంద మెద్ది?

విజయ:—రేపు నేనజ్ఞాతుండనై యుండవలయు; కావున నీ డాలును మీరొద్ద గుప్తముగ నుంచి మీరొద్దనున్న వేఱుడాల నెద్దానినైన నిచ్చిన నాకోరిక నెఱవేఱఁగలదు.

ప్ర:—నీవును వెఱ్ఱిద ననుచుంటివి!—మఱి—నీతమ్ముని డాలున్నది. ఎక్కడి నుండునో!

తటాలునఁ బద్మిని లోనికి పరుగెత్తెను.

విజయ:—నాడాలుపైఁ జిత్రింపఁబడి యున్న యీసింహము నన్ను బయటపఱచును. ఈనాటులు గంట్లును రణరంగమున నాసరసను నిలిచి పోరు నల్పు ప్రతియోధుఁడు నానవాలు పట్టగలఁడు.

డాలు కేలఁ బూని పద్మిని తిరిగి ప్రవేశించెను.

విజయ:—నా జీవితచరిత్రమందలి యర్ధభాగము పూర్ణముగా నీ డాలుపై రచియింపఁబడెను.

పద్మి:—వీరవర్యా! ఇదిగో దీనిని బుచ్చుకొనుము ఇది నా చిన్న యన్నది. పాపము వాఁడు దీనిని చేపట్టనే లేదు యవన రాక్షసులు పుణ్యము గట్టుకొనిరి. నేను దీనిని నాగదియందుఁ బెట్టుకొని సోదరునికి మాఱుగఁ జూచుకొనుచుంటిని.

విజయ:—నీసోదరుని నావెంటఁదీసికొనిపోవుచుంటిని. అందుకు బదులుగ నిదిగో నాప్రాణమును నీచేతి కిచ్చుచుంటిని. అదరములోఁ గాపాడుభారము నీయది.

పద్మిని చేతిలోనిడాలు నందుకొని తన డాలామె కందిచ్చెను.

పద్మి:—నా ప్రాణములకంటె నెక్కువగఁ జూచుకొందును.

తరువాతఁ బ్రతాపసింహుఁ డతిథికి విందులు గుడిపెను. కుమారుఁడగు చంద్రహాసుఁడు గూడఁ గురురంగమునకుఁ బయనము గాఁబోవుచుండెను. కావున నెన్నియో పిండివంటలతో పాకములతో ఫలములతో విందు లారగించిరి. విజయసింహునకును జంద్రహాసునకుఁ జాలచనువు స్నేహము కుదిరి బల మగుచుండెను. ఒకరినొకరించుక మృదువుగఁ బరిహాసము చేసికొనుచుండిరి. ప్రతాపసింహుఁ డతిథి కేమికావలయునో గనిపెట్టి యడుగుచుండెను. అప్పుడప్పుడు కొన్ని పానకములను ఫలములను బద్మినియే విజయునకు స్వయముగ వడ్డించుచుండెను. భోజనము లైనవి కాని పద్మిని కామధ్యాహ్న మేదియు నోటికిరుచిగఁ దోఁచలేదు. హృదయ మూరక గొట్టుకొనసాగెను. ప్రతాపుఁడు చంద్రహాసుని పయనమువకై యుత్తమాశ్వము నొకదానిని సిద్ధము చేయించెను. విజయసింహుని గుఱ్ఱముకూడ సేదదీరి తిరిగి ప్రయాణమునకు సిద్ధముగ నుండెను. విజయచంద్రహాసులు ప్రతాపునికడ సెలవు గైకొనుచుండిరి. పద్మిని తనగదిలోని కరిగి తలుపు జేరవైచుకొని విజయునిడాలునకు మ్రొక్కుచుండెను. ప్రతాపసింహుఁడు తనకు నమస్కరించినవారికి "విజయోఽస్తు, శుభమస్తు" అని దీవించెను. తోడనే చంద్రహాసుఁడు పద్మినిని బిలుచుచు నామెగదిలోనికి వెళ్ళెను. విజయుఁడు వాని వెనుక జని పద్మిని శయనాగారమున కివ్వల నిలిచెను. చంద్రహాసుఁడు వెనుకకుఁ దిరిగి రమ్ము మిత్రమా! రమ్ము. వందియ మేల యని పిలిచెను. విజయుఁడు లోని కరుగునప్పటికి చంద్రహాసుఁడు చెల్లెలికడ సెలవు దీసికొనుట యైనది. పద్మిని తనచేత నొక వజ్రపతకము పెట్టుకొని నిలిచి యుండెను.

పద్మి:—నాకు నొక చిన్నకోరిక గలదు. అడుగు మనెద వా!

పద్మిని హస్తమించుక కంపించుటచే నామె చేతనున్న వజ్రహారము ముందు వెనుకల కూఁగుచుండెను.

విజయ:—అనుగుము.

పద్మి:—వీరాగ్రణీ! నీవీ హారమును ధరింపుము.

విజయ:—నేటివఱకెన్నఁడును వనితాదత్తమగు హారమెద్దియు నే ధరింపలేదు.

పద్మి:—అయినచో నిప్పుడు ధరింపుమని నేను మిక్కిలి కోరుచున్నాను నీయభీష్టము నెఱవేఱును నిన్నెవ్వరును గుర్తింపజాలరు.

పద్మిని హృదయ మింతయావేగముతోఁ గొట్టుకొనుచుండెనో విజయసింహుని మనసునందలి యోజన లంతవేగము జరిగిపోవుచుండెను.—"ఈ బాలికహారము నంగీకరించిన ప్రమాద ముండదు." అని యనుకొని విజయసింహుఁడు మాఱుమాట్లాడక తల వంచుకొని చేయిఁ జాపెను. పద్మిని మడమ లెత్తి కాలిబొటనవ్రేళ్ళపై లేచి బాహులతల సాఁచి వ్రేళ్ళతోఁ బట్టుకొన్న కంఠహార మామహావీరుని కంఠమున వైచెను. విజయసింహుఁడు నిశ్చేష్టుఁడై పోయెను. అతని కదియొక యపశకునమువలె హృదయమునఁ జురుక్కున నాటెను. కాని మోమున నట్టిభావ మేమియుఁ గానబడనీయక మందహాసము దెచ్చుకొని,

విజయ:—సెలవా!

పద్మి:—విజయుఁడవై తిరిగి రమ్ము.

పద్మిని హృదయమున కొక్కమాఱెక్కడలేని శాంతియుఁ జేకూరినది. ఆమె మేడమెట్లు సగము దిగువఱకప్పుడే విజయచంద్రహాసు లశ్వములపై నెక్కిరి. కళ్ళెములు వదలుచుండిరి. కావున వేగముగ మేడపై కెక్కి గవాక్షము తెఱచి చూచునవఱకు విజయచంద్రహాసులు రెప్పవాల్పక చూచుచు నిలువఁబడెను. వాయుప్రసారమునఁ గేశము లామెముఖచంద్రముపైఁ బడి నిశ్చలదృష్టి కడ్డువచ్చుచున్నవి. అయినను నామెకుంతలముల సవరించుకొనుట లేదు. అటులనే బంగారుబొమ్మవలె నిలిచియుండెను.

## ౧౪

విజయసింహుఁడు చంద్రహాసుని వెంటఁ బెట్టుకొని . కురురంగమునకు బయలు దేఱెను. బయలు దేఱినది మొదలు చంద్రహాసుఁడు ప్రభాకరుని గూర్చియు, వీరహారమును గూర్చియు, చక్రవర్తి శౌర్యపరాక్రమాతిశయంబులఁ బ్రకటించిన యుద్ధరంగముల గూర్చియుఁ బ్రశ్నలతో విజయసింహుని ముంచివేయుచుండెను. విజయసింహుఁడు వినుగు చెందక చంద్రహాసుని కార్యాచరితముల నెల్ల నామూలాగ్రముగఁ బూసగ్రుచ్చినటులఁ జెప్పుచుండెను. విజయునివర్ణనల నాలకించుచుఁ చంద్రహాసుఁడు చింతింతనరాని యానందము నొందుచుండెను. వాని హృదయమందలి సహజవీర రసహావభావములు రేకెత్తుచుండెను.

చంద్ర :—సోదరా! నేత్రపర్వముగ నావిజయచంద్రప్రభాకరుల దర్శనభాగ్య మెప్పుడుగల్గునో! ఇఁకను మనగమ్యస్థాన మెంతదూరమున్నది? కన్నులున్నందుకు ఫల మాసూర్యచంద్రుల నిరువురఁ గాంచుటయేగదా? అయ్యో! మఱచితిని. విజయుఁడు నగరముననే నిలిచియుండెను— ఆవీరావతారుని, తేజశ్శాలిని, విజయమూర్తిని, వీరహారమునందలి నాయకమణిని, సకలసద్గుణయశోరాశిని నేను గన్నులార నేఁడు గాంచఁజాలనుగదా!

విజయ :— (స్వగతము)—విజయచంద్ర ప్రభాకరులా?—నాయనుంగురంజనియు నన్నటులనే పిలిచినది. (చిరునగవుతో) యిరువురు పొరబడిరా!

(ప్రకాశముగా)- చంద్రహాస- వాని నందఱును విజయసింహుఁడందురు. ఒక్క మహారాజుమాత్రమే విజయచంద్ర! యని సంబోధించును.

చంద్ర :—వీరాగ్రణీ! అట్లయినచో వానియందు నవరసములు మూర్తీభవించి యుండవలయు- శత్రుజీవికడఁ గానవచ్చు మోటుతనము లేక శాంతిసమయముల మిక్కిలి యుచితమై యొప్పు సౌమ్యత

పరనత, చతురత, మొదలగు గుణంబులును గలవా! విజయా! నీవు కదనరంగమున ధైర్యసాహస పరాక్రమంబులఁ జూపి సింహమును మించితివి. చల్లనిశాంతిసమయమున నాహ్లాదకరుఁడవై హృదయరంజకుఁడవై చంద్రునికూడ మించుచుంటివా! సోదరా! నీ వాతని చారిత్రము చెప్పుచుండఁగ నేను వినినకొలఁది యాతనియెడ నాకు గాఢమగు స్నేహమును గౌరవభావమునుగూడఁ గలుగుచున్నది! అహా! ఆ విజయసింహుని దర్శనము నాకిపుడు కలుగదా?

విజయ:—సోదరా! నీహృదయ మతి నిర్మలము-నీప్రవర్తనము నిష్కళంకము. ఆవిజయసింహుఁడు నీవంటివానిచేఁగూడ నంత పొగడఁబడఁదగినవాఁడు కాఁడు. అతఁడును మానవమాత్రుఁడె. భూలోకమున సంచరించుచున్న దివ్యమూర్తి ప్రభాకరుఁడు పవిత్రత - పరిపూర్ణత యాతనియందె జూడనగు. ఈలోకమునందుఁ జూడఁదగిన మహాదర్శంబులలో మహాదర్శంబు నినేత్రసాఫల్యము చేయఁబోవుచునే యుండెను. అట్టి తేజోపుంజమునకుఁ బార్శ్వవర్తియగుటచేఁ దత్కిరణ లేశమొకటి తనయందునబడ నించుక వెలుగుచున్న విజయునిగూర్చి యింతగఁ దలపోయనేల?

చంద్ర:—మహాపురుషులు తాము శ్లాఘించుకొనుటకు గాని శ్లాఘింపఁబడుటకు గాని యెంతమాత్రము సహింపరు.

అని చెప్పుచుఁ దనమిత్రుని మొగము రెప్పవేయక పరిశీలించుచుండెను. విజయసింహునిగుట్టు చాలవఱకు బయటఁ బడఁజొచ్చెను. కావునఁ దోడనే,

విజయ:—మిత్రమా! అదిగో నొకయోగిపుంగవుని యాశ్రమము కానవచ్చుచున్నది. మన మీపూట కాప్రాంతమున శ్రమదీర్చుకొని తిరిగి బయలుదేఱుదము. నీవును జాల దప్పినటులఁ గనఁబడుచుంటివి. ముఖ మంతయు గంది యెఱ్ఱబాఱినది. కణతల ముత్యములవలెఁ జెమటబిందువు లేర్పడుచున్నవి. మనము చాలదూరము వచ్చితిమి.

శ్వాసములుఁగూడ విశ్రాంతి గోరుచున్నవి. లేనిచో నేవు రంగభూమిని దాగ నుపచరింపఁజాలవు.

చంద్ర :—అగు నటులనే యాగుదము (అని నలువంకలఁ బరికించి చూచి) ఏమిది—ఇంత ప్రశాంతము! స్వాభిక భావ సబిడీకృతము! పవిత్ర తేజోపుంజవిరాజితమునై మద్గురుని యాశ్రమముపలెఁ గానఁగట్టుచున్నది. వారు తమ యాశ్రమమును విడచుటకు మూర్చిరా! వటవృక్షరాజపరివృతమై నమీపమునకు వచ్చినఁగాని యిచ్చట యాశ్రమ మున్నటుల గానరాదయ్యో—మిత్రమా! ఎంత చల్లగనున్న దో యిక్కడ!

విజయ :—నిజము—సంసారతాపసంతప్తులగు నరులకీ యాశ్రమ ప్రాంతమునఁ దాపనివారణ మొనర్చి నిజశీతలచ్ఛాయ నొసంగి సేదఁదీర్చుచున్నవి. వటరాజములు సమాధియందుండి తనతపోమహిమంబున నా వృక్షంబులనె యతిథిసత్కారవిధియందు వినియోగించెఁ గాబోలు నామునిపుంగవుండు!

చంద్ర :—కాదు—వారు సమాధియందు లేరు—వారునివ్వరి ధాన్యమును బచనముచేసి యా యన్నకబళము చేతఁబట్టుకొని భూతబలి బెట్ట నీవలకు వచ్చుచుండిరి. విజయుచంద్రహాసు లిరువురును తటాలున గుఱ్ఱములనుండి దిగి తమతమ వంశనామగోత్రముల నెఱిగించుకొనుచు మునిశ్రేష్ఠునకు సాష్టాంగప్రణామంబు లొనర్చి మునిపుంగవుండిరువురను "మనోరథసిద్ధిఁ బడయుఁ" డని యాశీర్వదించి వారలను దనపర్ణకుటీరములోనికి రండని యాహ్వానించి స్నానము జేయుటకుఁ గొలను జూపించి తనకొఱకై వండుకొన్న యన్నమును కందమూలాదులను నతిథులకుఁ బెట్టి నావనంబునఁ గరిగి కొన్ని ఫలములను దెచ్చి వానిపైఁ బూతోదకంబులఁ బ్రోక్షించి యీశ్వరనివేదనఁ గావించి యందున సగమతిథులముందుబెట్టి మిగిలినభాగము తాను భుజించెను. తనతోఁగూడ వచ్చుచున్నవాఁడె విజయసింహుఁడని వినినతోడనే

చంద్రహాసునకు వర్ణింపనలవికాని యానందము కలిగెను. తొల్లి యుత్తరకుమారుఁడు బృహన్నలనర్జునునిగాఁ దెలిసికొనినప్పుడైన నేఁడు చంద్రహాసుఁడు పొందుచున్న యాశ్చర్యము, ఆనందము పొంది యుండఁడు. ఊరక తనివితీరనిచూపులతో విజయసింహుని గప్పివేయు చుండెను. మునుపటివలె జనువుగ మాటలాడుటకు జంకుచుండెను. స్నానము చేయునప్పుడుమాత్ర మొక్కమాఱు "విజయసింహా!" అని పిలిచెను. విజయసింహుడు తనవంకకు తిరిగి చూచునరికేమనుటకు నేరక తలవంచుకొని మందహాసము చేసెను. "ఆచారముఁచొప్పున ఋషిపుంగవున కభివందన మొనర్చునప్పుడు వీఁడు నా నామ మెత్తి ముగ్ధవలె నిట్లయ్యెనే" యని తలపోయుచు విజయసింహుని యధర ముపైఁ బలువరస యుంచుక గాన్పింపఁ జిఱునవ్వు నవ్వెను. "లోక ముతో విశేషసంబంధములేని యొక్కమాఱుమూల కోటలో బెఱుగు టచే సమయస్ఫూర్తిచతురత లేక యట్లుండెనని" నిశ్చయించు చుండెను.

"ఇంతవఱకు స్నేహితుఁడైనను సోదరైనను పద్మినియే యై యుండుటచేత నాప్రేమమయి యగుకోమలాంగిస్వభావము పోలికయు వీనియందును బూర్తిగాఁ గానవచ్చుచుండె"నని యూహించుచుండెను. ఆప్రకారము విజయచంద్రహాసు లిరువురు నొండొరులతో మాటలాడక మౌనమును వహించియే యొండొరులగూర్చి విశేషముగ దెలిసి కొనుచుండిరి.

భోజనములైనవి. పర్ణకుటీరమునుంగిట దట్టముగ వ్యాపించిన యశ్వత్థవృక్ష మొకటికలదు. మువ్వురును వచ్చి దానినీడను దర్భాసనంబులఁ బఱచుకొని కూర్చుండిరి. బాగుగఁ బూచిన తియమామిడి యొకటి కుడివైపున గానవచ్చుచుండెను దానిప్రక్కనె నవమల్లికా పారిజాతములు నాటఁబడి యుండెను. ఇంచుకదూరమున నున్న కొల నిలోఁ పద్మము లన్నియు బాగుగ వికసించి చూడ మనోహరమగు

చుండెను. ఆవైపునుండి చల్లనిగాలి వచ్చునపుడా పద్మములపై నించుక నే పాసి యానందించి మరలివచ్చుచుండెను. సూర్యకిరణప్రకాశితమైన వినీల గగనఖండము భగవానుని మైచాయను ప్రకటించుచుండెను.

ముని :—విజయసింహా! దేశము సుభిక్షముగా నున్నదా? మీ నూతనసార్వభౌముడు ప్రజానురంజకుఁడై పరిపాలించుచుండెనా? మహారాణియు నారోగ్యలఁ బ్రేమించుచున్నదా? యవనుని దాడివలన భయ మేమియు నిప్పుడు లేదుగదా!

విజయ :—మహాత్మా! మీయాశీర్వచనమే మమ్ములను సదా కాపాడుచుండును. ప్రభాకరసార్వభౌముఁ డహోరాత్రములు ప్రజల యభివృద్ధినిగూర్చిన చింతయే గాని యన్యచింతన లేక కాలము గడపి తండ్రివలె పాలించుచుండెను. సజ్జనకులందఱును జన్మమునకు మాత్రమె కారణమగుచుండిరి. యవనుఁడు కాఁడు, యముఁడు వచ్చినను భారతీయసార్వభౌముని యాజ్ఞ వానిని సామ్రాజ్యమునకు వెలుపలనే నిల్పి యుంచును. జాతియందణఁగి యున్నట్టి ప్రతాపమును బ్రేరేపుటకే కురుక్షేత్రమున వీరుల నందఱి రావించి శస్త్రవిద్యా ప్రదర్శన మేర్పాటు గావించిరి. మహారాణియు నందు మెప్పువడసిన వానిని దనకంఠ మలంకరించుచున్న మణిహారముతో సంభావింప నిశ్చయించెను.

ముని :—(కనులమూసికొని ధ్యానించుచుఁ దనలో) విధి బలవత్తరమైనది. ఆహా! నిశ్చయంబుగ బలవత్తరమైనది. కానిచో నాఁడట్లేల జరగును?

చంద్ర :—గురువర్యా! నేఁడు నమస్కరించుట కమ్మగారు గావరారు.

ముని :—కుమారా! పరలోకమున కరిగెను. ఇప్పుడు నాయర్ధభాగమే యీ భూతలమున నున్నది. పూర్వాశ్రమమందలి యాకొండ గుహను విడిచి యీకుటీరముఁ జేరితిని.

తల్లినిబాసిన పిల్ల విధంబునఁ జంద్రహాసుఁ డావార్తవిని కంటదడి
పెట్టుకొనుచుండెను. గురువుగారు ముందుండుటచే బారున నేడ్చుట
కవరోధము కలుగుచుండెను. కాని యెంతయాపినను నాగకనయ
నములవెంట సంతతధారగా బాష్పజలము ప్రవహించుచున్నది. అట్లు
నిశ్శబ్దముగ విచారించుచున్న శిష్యునిఁ జూచి ముని వాత్సల్యాతి
శయంబున.

ముని:—నాయనా! ఏలవిచారించెదవు? ఊరడిల్లుము. వత్సా!
వివాహ మొకజన్మలో జరుగునది గాదు. ఒక జన్మములో నంత
రించునది గాదు. అన్యోన్యబంధము నిత్యము. విధ్యుక్తము. అవి
లంఘనీయము—కుమారా! పరలోకమున కరిగిన వారికొఱకు విచా
రించుట బేలతనము—మృత్యువునకు సెలవు నావ నొకరి నిర్గతిని జేర్చి
రెండవవారిని జేర్చకుండునే?

విజయసింహుఁడు చంద్రహాసుని కన్నీరు తుడిచి దుఃఖ ముపశ
మింపఁజేయుచుండెను. చల్లనిగాలి వీచి యాచెట్ల యాకుల నొకమాఱు
గలగలలాడించెను. పూచిన తీయమామిడిపై నుండి కోకిల యొక్కమాఱు
కంఠమెత్తి "కో" యని పలుకరించెను. విజయసింహుని మనమున
"ఆబంధము నిత్యమా? విధ్యుక్తమా? అవిలంఘనీయమా?" అని
పలుమాఱు నందియము తట్టుచుండెను. "మునినే యడుగుదునా?
అడుగుట సాహసముకాదా?" అని యొక్కమాఱు వితర్కించుకొను
చుండెను. ఎట్టకేలకు సాహసించి.

విజయ:—మహాత్మా! ఈయజ్ఞాని కొకచిన్న సంశయ మున్నది.
అడుగ సాహసించినందులకు మన్నింప వేడుచున్నాఁడు.

ఋషి:—వత్సా! జ్ఞానము సూర్యకాంతివంటిది. ఒకనిసొత్తు
కాదు. తప్పక యడుగవచ్చును. సందేహ మేల?

విజయ:—సంసారము సాగర మనియు, దుఃఖభాజన మనియు,
మోక్షద్వార మనియుఁ, బ్రహ్మచర్యాశ్రమమే పరమోత్కృష్టమనియు,

జ్ఞానప్రద మనియు, బంధరహితమనియుఁ, దపోయోగ్యమనియుఁ, దఱచుగఁ జెప్పుచుందురు. ఆలినిఁగట్టుకొనుట యనగా మెడకు గుదికఱ్ఱ కట్టుకొనుట యని లోకములో వాడుక!

ఋషి :—(గంభీరమందహాస వికసితవదనుఁడై)- నీ మనసులోని యాశయము తెలిసినది. ఆ రేగుచెట్టునకుఁ జూడు మెన్ని పండ్లున్నవో! అందొక పండులోనున్న పురుగునకు ఆపండే బ్రహ్మాండము. కాని నీసృష్టి కదియొకపండు-అట్టి పనేకములైనపండ్లు నీయెదుట వ్రేలాడుచున్నవి. ప్రాపంచదృష్టికి తన సంసారమే పెద్దసాగరముగ నుండును. సుఖదుఃఖములనెడు యలలు పైనుండి దొర్లిపోవుచుండును. వాటి కొకవరుస క్రమము లేనట్లు తోఁచుచుండును. అల్లకల్లోలసాగర పరివృతుఁడైనటుల భావించుకొనుచుండును. అది సత్యమా! సమగ్ర దృష్టితోఁ జూచిన సాగర మనుకొనునది యొక జలకణమే యని తెలియును. అట్టి జలకణము లనంతములు కావచ్చును. అట్టి దృష్టితోఁ జూచుపురుషుఁడు సంసారములోనుండియు సంసారము స్వరూపము తెలియక భ్రాంతి చెందఁడు. భయపడఁడు. తనకుఁగలిగిన దివ్యదృష్టి నితరులకు ప్రసాదించి వారలచేఁ గూడ నీవిశ్వరూపసందర్శనము చేయింపఁ జాలును. అంతియే గాని సంసారమును జూచి భయపడి పారిపోవ నుంకించినవారికిఁ దననీడ చూచి బెదరి పరుగిడుచున్న లేడివలె నెచ్చటకుఁబోయినను మనస్సున కాబెదరు పోజాలదు. సన్యసించి యడవికిఁ బోయిన కొడుకుమీఁది మమకారమే లేడిపిల్లమీఁదికి బోయెను. స్థానము మాఱునుగాని స్వభావము మాఱునా! కావున ముందు కావలసినది చిత్తపరిపాకము. చిత్తపరిపాకమునకు రసానుభవము మూలము. ఈసృష్టి యనెడు చిత్రపటముయొక్క సౌందర్యము చూచుటకు యీప్రపంచమనెడు నాట్యరంగమందలి పాత్రల చర్యల నవగాహన చేసికొనుటకు సూర్యకాంతి చాలదు—శుష్కతర్కము చాలదు—హృదయమునుండి దశదిశలకుఁ బ్రేమకాంతి ప్రసరింపవలె,

సానుభూతి వికసింపవలె. పంపానదిమీఁద సూర్య చంద్రకాంతులు ప్రసరించుచునే యుండెను. కాని యొకనాఁడు శ్రీరామచంద్రుని హృదయమునుండి ప్రేమ ప్రసరించుటచే నీనదీశోభ శతసహస్రగుణితమై విలసిల్లినది. భరతుఁడు శ్రీరామ పాదుకలకు బట్టముగట్టి తాను జడదారియగుటకుఁ గారణము శుష్కతర్కవితర్కములచే నెన్నటికైనఁ దెలియునా? కావున కుమారా, ప్రేమింపుము. తొలుత మానవత్వము నిచ్చుటకును పిదప దేవత్వము ప్రసాదించుటకును ప్రేమయే యాధారము కావున కుమారా ప్రేమింపుము. శైశవము పువ్వు, బాల్యము పిందె, బ్రహ్మచర్యము కాయ—గార్హస్థ్యము ఫలము—సన్యాసము బంధమోక్షము— స్వార్థత్యాగశీలముతో సన్యాలసుఖము కొరకు తనరూపము చాలించి ధన్యతి గాంచును. అది సహజ పరిణామము. అంతియకాని, పచ్చికాయ తాపముచే నుడికి యెండ కొట్టిన రాలిపోవు టసహజము,-అధర్మము, కాయను దీయనిరసముతోఁ గ్రముముగా నుండనిమ్ము, ఫలము పురుషుడు—రసము స్త్రీ, చంద్రుఁడు పురుషుఁడు, చంద్రిక స్త్రీ, గానము పురుషుఁడు, శ్రుతి స్త్రీ, నావ పురుషుఁడు చుక్కాని స్త్రీ, పరమాత్మ పురుషుఁడు ప్రకృతి స్త్రీ. కావున మోడువలె బ్రహ్మచారివి గాక కామ ప్రేరితుఁడవై తిర్యగ్జంతువవు గాక పురుషార్థముల నెఱింగి యనుకూలవతియగు ధర్మపత్నిని బరిగ్రహింపుము.

విజయ :— అనుగ్రహింపఁబడితిని. అంబరమున నంబుదంబు వగిది కదలుచుంటిని కాని యెందరగుచుంటినో యించుకైనను దెలియరాదు.

ఋషి :— పురాకృతకర్మసూత్రబద్ధులై నడచుచుందురు.

విజయ :— నిశ్చయము— కావుననే నేనిట్లుంటిని. సర్వము దైవాయత్తము.

ఋషి :—కాదు. పురుషునకిని గొంత తన భావికర్మ నిర్ణయాధికార మున్నది. లేనిచో నవకర్మమునకుఁ బురుషుఁ డుత్తరవాదియే కాఁజాలఁడు.

విజయ :—అయినచో మీరీశ్లోకము వర్ణింపు మనువటుల నే నీ స్త్రీని ప్రేమింపుము—ఈ స్త్రీని ప్రేమింపకుము. అని కోరిన చొప్పున నరుఁడు త్రికరణశుద్ధిగఁ బ్రవర్తిపఁ గలఁడా!

హోరున గాలి వీచుచున్నది. చెట్లయాకులన్నియు గలగలమని రొద చేయుచున్నవి. గగనమును మేఘావృతమై యున్నది.

ఋషి :—విజయసింహా! బాగుగ నాలోచించు కొనుము. అగ్నికుండముపైఁ బుష్పశయ్య సుఖదాయకము కాదు. సముద్రమందలి మకరందము వర్షించినను లాభకారి కాదు. పాలు స్వచ్ఛమైనవే. అమృతతుల్యంబులే, కాని యించుక రాగి సోఁకినంత విషతుల్యములై పోవును. లోకధర్మములు నీకును దెలియును. చంద్రహాసా! గాలి రేగినది. పర్ణశాలలోని కరుగుదము రండు—

ఋషిపుంగవుఁడు ముందునకువ వెనుక చంద్రహాసుఁడును నా వెనుక విజయసింహుఁడును బర్ణశాలలోని కరిగిరి. ఆ హోరుగాలితో నును నడుమ కోకిల పంచమస్వర మించుకించుక వినఁబడుచుండెను. విజయసింహుని హృదయమందు బయలుదేఱిన భావనంకుల సమరమందును రంజని ప్రేమమయ కంఠస్వర మించుకించుక వినఁబడుచుండెను.

౧౮

హస్తినాపురమున నంతఃపురమున మేడపైని గదిలో సువర్ణపుష్పాభరణాలంకారిణియై రంజని నిలువుటద్దమున కెదురుగ నిలిచి నిరుపమాన లోకసమ్మోహనకనిజసౌందర్య విభవమును జూచుకొనుచుండెను. గవాక్షమునుండి పూర్ణచంద్రబింబము నిలువుటద్దమున ప్రతిఫలించుచు

నామె బుగ్గను ముద్దుపెట్టుకొనుచున్నట్లుండెను. "విజయచంద్రా!
కిరువురకు భేదమేమి! నీనామమందె నీరూపమున్నది! విజయచం
కావున ననువిడిచి నీవు పోజాల" వని యేమో యనుకొనుచుం
బరిచారిక ప్రవేశించి "అమ్మా! మీపెంపుడు చిలుక పంజరము
తప్పించుకొని పారిపోవుచున్నది." అని చెప్పెను. రంజని పరిహాస
బరిచారిక బుగ్గ పట్టుకొని "ఏమే! కల్లలాడెదవు! విచ్చల
నుండియు నాయలుకు దైన్యంబొనివచ్చి నాచేతిపై వ్రాలుచు
డెచ్చుటకుం బోవుదే! పద—చూపుము—విజయా" అని పరిచా
ముందు నడువం జిలుక కొంచెకిగెను. రామచిలుక కాముద్దు
పెట్టుకొనను కాంబోలు!

అరుణోదయ మగుచుండగ నాబాలారుణకిరణములు వె
వచ్చి విజయసింహుని డాలుపైఁబడి ప్రతిఫలించి పద్మినిగది నం
నూతనకాంతితో నింపుచుండెను. ఇష్టదైవమును బాదపీఠము
ధ్యానముచేసుకొను భక్తురాలివలెఁ బద్మిని నిర్మల ప్రేమపూ
హృదయముతో తదేకలగ్నమగు మనస్సుతో నిశ్చల భావగర్భి
లగు చూపులతో విజయసింహుని డాలుపజ్జఁ గూర్చుండెను. ఆడా
కొక మనోహరమగు పట్టుతొడుగు నిర్మించుచుండెను.

పావన ప్రేమప్రేరితయై తన చిత్రకళాకౌశలము శక్తి ని
నాడాలుపై నున్న చిత్రముల నెల్ల పట్టుతొడుగుపై యథారూపవర్ణ
లచ్చుపడగఁ జిత్రించుచుండెను. అంతతోఁ దనివితీరక యాచిత్ర
చుట్టును తన సహజభావన విశేషము బయల్పడఁ గోమల మగు పూ
నొక దానిని నిర్మించెను. అందు ప్రేమసుతముల నొప్పు పసిపి
గూర్పుండఁ బెట్టుచుండె—కళాకౌశలము—భావనాతిశయము
ప్రేమవాహిని—భక్తి యనంతమై కానవచ్చుచున్నది.

యవన దేశమున నలకసుందరుని సేనలు కూడుచున్న వి—
నాథుఁడు సైన్యవిన్యాసము తీర్పఱుచుచుండెను. భరతఖండము

త్రయాత్రకు వలయు నుత్సాహాము నెల్ల సమగ్రముగ బూర్తియగు
జెను. కమలాకాంతుఁడు కురురంగమున కరుదెంచి విజయసింహాుఁడు
నందున కపరిమితానందుఁడై తనకు విజయము నిశ్చయమని నమ్మి
ర్వాలమునఁ బద్మినీ పాణిగ్రహణ మొనర్పగల నని విశ్వసించి
వ్విళ్లూరుచుండెను.

ప్రభాకరుని శిబిరమునకు నియమితోద్యోగు లందఱును వచ్చి
షకులగు స్త్రీ పురుషుల కెల్ల వేర్వేఱుగ నర్ధచంద్రాకారముగ
ంచెల నిర్మించితి మనియు నడుమ రంగస్థల మంతయు కంటకాది
తంబు గావించి నదునుచేయించి తడిపించితి మనియు సార్వభౌముని
సనమును మణిహార ముంచుటకుఁ దగిన వెండి రేకుల కలపవుష్ప
చితరీతి నమర్చితి మనియు, వేయేల వలయు నేర్పాటుల నెల్ల గావిం
మని విన్నవించిపోయిరి. రాత్రి మొదటిజాము గడచినది. రెండవ
ము సగమువఱకు గతించినది. సార్వభౌముని శిబిరమున సుగంధ
లదీపములును సువర్ణఖచిత మాణిక్యదీపములును గలసి వెలుగుచు
ండెను. ప్రభాకరుఁడు పట్టుదిండు నాని పరుండి యుండెను. కాని
ంకను నిద్ర పట్టలేదు. నిద్రకు సమయమైనది. సార్వభౌముఁడు
వప్రార్థనము గావించుచుండెను, "పరాత్పరా! మహాకాలస్వరూపా!
ర్త్మమూర్తీ! జగద్భ దానునంధాయీ! నాధనము, విద్య, బలము,
ర్యము, వీర్యము, ప్రాణము, మానము సర్వస్వము నీకర్పణ చేయు
ంటిని—భారతధర్మ మింక నీకిశ్వము దొకింత కాల ముండఁదగు
నమే నివిలావ మగునేని భారతజాతికి స్వధర్మపాలనా శక్తి కై
రాజ్యము నిలువబెట్టవే! భారతవీరులు ధర్మపథులగు నటులను—
రతరమణుల సతీత్వ మాచంద్రార్కము నిష్కళంకమై నిలుచు
టుల ననుగ్రహింపవే— నమ్ముదుని శోషింపఁ జేసిన వసుమతి
నుగ్రహించి సస్యశ్యామలశోభినిం గావించినటుల— ఈధర్మ

యుద్ధమునఁ బూర్ణాహుతికి సంసిద్ధుఁడనై యున్న నన్ను బరిగ్రహింపు ఓయజ్ఞపురుషా, నా దేశము ననుగ్రహించి సముద్ధరింపవే!”

ప్రభాకరునకు నిద్రమగత కన్నులఁ గ్రమ్ముచుండెను. సర్వలోక సంరక్షకుండగు మహావిష్ణు వెదుట సాక్షాత్కరించెను. హిమవన్నగము వలె ధగధగాయమానమై ప్రకాశించుచున్న కిరీటము ధరించి, గంగా, గోదావరీ, కృష్ణవేణీ, కావేరీ మొదలగు నదులవలె మనోహర తార హారములఁ దొల్లి, సస్యశ్యామలవర్ణంబగు చీనాంబరము ధరించి, మెఱ్ఱని ధాతురాలతో నొప్పు వింధ్యపర్వతమును దలపించు మాణిక్య ఖచితమగు నొడ్డాణమును ధరించిన సుందరి యేలనో దీనవదనయై చేతులు జోడించి వారి పార్శ్వమున నించుక నెడముగ నిలిచియుండెను. మహావిష్ణువు కరుణాపాంగ వీక్షణంబుల సారించుచు చేయెత్తి మేఘ గంభీరస్వరంబున నేమొ చెప్పఁదొడంగెను.

ఇంతిలో నాదివ్యదృశ్య మదృశ్య మాయెను—చీమలేని చిట్టడవి, కాకిలేని కాఱడవిగ మాఱిపోయెను. ఆఘోరకీకారణ్యమం దొక కొండగుహ—ఆగుహాయం దొక ముని తపముచేసికొను సమాధినుండి లేచి కన్నులువిచ్చి ప్రభాకరుని జూచినట్లయ్యెను. అంధకార మందా కారమేమియు గానవచ్చుటలేదు కాని నేత్రములు రెండును మిణుగురు పురుగులవలె మెఱయుచుండెను. “వత్సా! చూచితివా! నీసామ్రాజ్య లక్ష్మి దీనవదనము— వేదశాస్త్రములు కరుణాలేవి—కర్మసంజనిత మగు విధి నిర్దయ—జాతికులసాంకర్యము దోషము. దోషియా మణిహారముదాల్చుట! రూపపిపాసాపీడితుఁడవై ధర్మపరిపాలనాదీక్షను మఱచితివా! విచారింపుము—ఏమిచేతువు— మనముందఱము దురదృష్ట వంతులమే!” ఆకంఠస్వరము ప్రభాకరుని బాల్యమున పెంచిన ముని మునిది—ప్రభాకరునకు హృదయమున నెక్కడలేని భయము మిక్కుట మయ్యెను. ఆభయముతోడనే కదలక మెదలక యెట్టెట్టో నిద్రపోయెను. వేకువజామగుచుండెను. దీపకాంతు లెప్పటివలెనే ప్రకాశించుచుండెను.

అంతయు నిశ్శబ్దముగ నున్నది. మెల్లగ నొక గూఢచారి ప్రవేశించి.

గూఢ :—స్వామీ!

ప్రభా :—[ఉలికిపడి కటాలున లేచి]—దండనాథా! అప్పుడే వచ్చితివా!

గూఢ :—[నివ్వెరపాటుతో] దేవా! నేను జయసింగును దేవర ప్రణిధిని. దాసుడను.

ప్రభా :—నీవా! ఏమి?

గూఢ :—సావధాన చిత్తులై వినవలయు—యవనులు గూఢ మార్గమున మన గాంధారము ప్రవేశించుచుండిరి. చీలి విడివిడిగా వచ్చుచుండిరి.

ప్రభా :—మంచిది నీవు పొమ్ము. విజయసింహునికీ వార్త నీవే స్వయముగా నెఱిగింపుము పొమ్ము. విజయసింహుఁ డిచ్చటికి రాలేదు. రాజధాని కరిగి వానిని గలిసికొనుము.

గూఢచారి వెడలిపోయెను. ప్రభాకరుఁడూరక తనలోఁ దానిట్లు చింతించుచుండెను. “ద్రోహియా? అయిన ప్రాయశ్చిత్తము కలదు. రంజనిని విసర్జించుటయా? పాపము శమించుగాక! పాపము—అమాంగళ్యము, స్వామిద్రోహము—క్రూరవర్తనము. అమానుష్యము—అచింతనీయము. అట్లెన్నటికిని జరుఁగజాలదు. ఏనున వీఁడు ప్రభాకరుఁడు—కర్కోటకుఁడు గాడు. కౌరవాది నరక కూపంబుల ద్రోయఁబడిన వంశీరుపురము కలిసియే పడునుము—మఱి దేశహితమొ? ధర్మమొ? అను మయస్కాంతముచే నాకర్షింపఁబడుట ధర్మము కాదా? చంద్ర దర్శనమునఁ గలువ వికసించుట ధర్మము కాదా? వృక్షమూర్ధ్వ గామియై వృద్ధిగాంచుట ధర్మము కానిచో నధోముఖమై రసాతలము లోనికి పెఱుఁగ నేర్చునే? అన్యదేశములగు పుష్పములు కన్నులకింపగుట లేదా? ఫలముల మధురరసము విదేశీయమైన కారణమున వెగటగు

చున్నదా ! గుణము ప్రధానమా ! మట్టి ప్రధానమా ! వజ్రమెక్కడి దైనను వజ్రమే ! గాజుపూస యెందరిగినను గాజుపూసయే. గుణ మెందున్నను గ్రాహ్యమే ! దోష మెందున్నను త్యాజ్యమే. ధర్మమె తద్వ్యతిరిక్త మగునేని "అధర్మము నిజమగు ధర్మము" నకు పర్యాయ పద మగుచున్నది. పరమేశ్వరుని "ఓ అధర్మ మూర్తీ !" అని సంబో ధించెదను. పరిత్యజించుటయె ధర్మమైనఁ బరిత్యజించెదను. రంజనిని నా ప్రాణములను గూడ పరిత్యజించెదను. నాకు బూజ్యమగు నంత రాత్మయె సాక్షి."

సీ. పౌలోమి తనబాలుపాన్పుపైఁ గట్టంగఁ,
బన్నిన పవడంపుఁ బతిక యనఁగ
నాయురర్థములవ్యయం బొత్తిలిచాటు,
కాలజాంఘికు చేతిఘంట యనఁగ
ఘనజంతుజీవిత కాలరాసులకొఢి
కొలువ నెత్తిన హేమకుంభ మనఁగఁ,
పశ్చిమదిక్కాంత పరఁగ గై సేయుచో
ముందర నిడుకొన్న ముకుర మనఁగఁ,
గోకతాపోపశమ్యదివ్యఘుటిక యనఁగ,
బద్మినీకాంతనోముల ఫల మనంగ,
మూఁడుమూర్తులసారంపు ముద్ద యనఁగ,
మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె"
(భాగవతము, దశమస్కంధము.)

## ౧౯

సూర్యోదయ మయ్యెను. ఐంద్రజాలికుడు తెరఁదీసినంతనే భూగర్భము నుండి ఫలసహితంబగు రసాల ముద్భవించినటులఁ గురుక్షేత్రమున స్వర్ణపటనిర్మితంబును స్వర్గపురతుల్యంబునగు నగరరాజం బొండు

నిర్మితమై కన్నులఁబండువు చేయుచుండెను. వీరులకదనరంగము తక్క-
మిగిలినచుట్టుముండు నేల యంతయుఁ బచ్చనిపట్టుచేఁ గప్పఁబడి
యుండెను. చప్పన్న దేశములనుండియు వచ్చుసామంతరాజులకు వారి
వారిగౌరవముల కెంతమాత్రము కొఱతపడని చీనాంశుకమందిర రాజ
ములు విడుదులుగ నమర్చబడి యున్నవి. రంగస్థలమునకుఁ బడమర
భాగమంతయు వేడుకఁజూడవచ్చిన పౌరజనులకొఱకై మంచెలు
నిర్మింపఁబడినవి. దక్షిణపార్శ్వమంతయు నంతఃపురజనంబై నను
వచ్చి వీరులవిద్యాప్రదర్శనంబుఁ జూచి యానందింప వీలగునటుల
జవనికల నమర్చి యావెనుక ముఖమలుమెత్తలుంచిన సుఖాసనముల
నేర్పఱచిరి. తూర్పువైపున యువరాజబంధుమిత్ర సామంతపరివార
సమేతుఁడై సామ్రాట్టు పేరోలగంబుననుండి తన సామ్రాజ్యశౌర్య
ధైర్యప్రతాపముల సందర్శింప వీలగునటుల సర్వము రచియింప
బడెను. మధ్యభాగమున మణిఖచితసువర్ణసింహాసనము సమున్నతంబై
విరాజిల్లుచుండెను. అందు హంసతూలికాస్తరణ మిక్కిలి శోభాయ
మానమై యొప్పుచుండెను. ఆ సింహపీఠమున కిరువంకల నెట్టిపట్టు
మెత్తలదంతపుకుర్చీలు వేయఁబడెను. వెండిరేకులతోఁ గలువపూవు
రేకులపోలికగఁ జేయఁబడిన పాత్రయందు నేఁడు మెప్పువడసినవాఁడు
పొందు మణిహార ముంచఁబడెను.

సమయమైనది. సముద్రమున చేరు వాహినీప్రవాహమువలె
వచ్చుపురజనులు తమ కేర్పఱచినస్థానముల సుఖాసీనులై నిశ్శబ్దముగ
నచ్చటి యేర్పాటులకొప్పిదములను విభవములను జూచి యానం
దించుచు శాంతమహాసముద్రముతోడి సామ్యమున కర్హులై యుండిరి.
చంద్రముఖులును వచ్చినటులఁ గరకంకణముల సువర్ణసౌమ్యనాదము
లును, హంసయానముగతిఁ దెల్పుచున్న నూపురధ్వనులును సను
మానప్రమాణమునంగుటయే కాక వెల్లువుబ్బుననున్న చంద్రునివలె
నాజవనికములుగునఁ జంద్రముఖులును నిజతనుకాంతిచంద్రికల నించు

కించుక నీవలకుఁ బ్రసరింపఁజేయుచుఁ గొంచెము ప్రత్యక్షప్రమాణమును గూడఁ జేయుచుండిరి. కలువలకుఁ జెంగలువలకును శోభయినుమడింపఁ గలువలతేఁడు నక్షత్రకోటిఁ జుట్టును బలిసియుండ గొలువదీర్చిన విధంబునఁ గన్పట్టుటఁ బ్రజలముఖములు తనసందర్శనమాత్రమున నానందముతో వికసింపనిష్టరాజబంధుమిత్ర సామంతపరివృతుండై ప్రభాకరచక్రవర్తి విచ్చేసి ప్రాగ్దిశనలంకరించి శోభాయమానము గావించెను. ఆదిశేషుని తలమానికముల నొల్చికూర్చినసర మోయన ధగధగాయమానముగాఁ బ్రకాశించుచున్న మణిహారముచేత రేకులు కలువపూవునందు కుండలాకృతిఁ దాల్చి మనోజ్ఞమయ్యు హృదయమున నాందోళనము కలుగఁజేయుచుండెను.

తూర్యధ్వనులొక్కుమ్మడిని మిన్నుముట్టె. అంతలో నిశ్శబ్దమయ్యెను. వీరులు, మహావీరులు. వీరాధివీరు లందఱును నిర్దిష్టమార్గమునఁ బ్రవేశించి రెండుభాగములుగానిల్చి సార్వభౌమునకు వంగి నమస్కరించి సంధింపఁబడిన బాణములవలె సాగి నిలిచి యుండిరి. సార్వభౌముఁడు లేచి నిలువఁబడి.

"నాసామ్రాజ్యముయొక్క పరాక్రమప్రతాప మంతయు నేఁడీ రంగమునఁ బుంజీభవించి నాహృదయమునకానంద మొనగూర్చు చున్నది. ఇంద్రగ్రస్థానము వహించి మెఱయు పరాక్రమ మీమణి హారముచే నలంకరింపఁబడుగాక! అచిరకాలముననే మీరెల్లరు మీబాహుదర్పముల విజృంభింపఁజేయు కాలముగూడ బరమేశ్వరుఁ డనుగ్రహింప నున్నాఁడు. ధర్మమేవ జయతి!" అని సంక్షిప్తముగ నుపన్యసించి నిజాసన మలంకరించెను.

సంధింపఁబడియున్న బాణములు విడువబడినవి. ఒరలనుండి శస్త్రులు లేచి త్రాఁచులవలె నిలిచి యాడుచున్నవి. సూర్యకిరణములవలె బల్లెము లెల్లెడలఁ దళతళ మెఱయుచున్నవి. ఇరుపక్షములవారు ఒండొరుల వెనుకకు నెట్టివేయుచుండిరి. దివారాత్రములవలెఁ బోరు చుండిరి.

చమురుతగ్గిన దీపమువలె నొకపక్షము క్రమక్రమముగఁ దేజో హీనమగుచుండెను. విజయసింహుఁ డాకసమునుండి వ్రాలినటుల ప్రతిపక్షములో వచ్చి చేరెను. "ఇంతవఱకు నూరక చూచుచుండి యోడిపోవుచున్న వారితోఁ గలియు నాతఁ డెవ్వరై యుండును" అను సందియ మందఱిమనముల నొక్కమాటె నాఁటెను. గుసగుసలు ప్రారంభమయ్యెను. ఊహాలు వ్యాపించుచున్నవి. వాద ప్రతివాదములు బలియుచున్నవి. చక్రవర్తి మొదలు సామాన్యునివఱకు — విజయ సింహుఁడే జ్ఞప్తికి వచ్చుచుండెను. కాని యానూతనవీరుఁ డొక సుందరి యిచ్చిన పచ్చలపేరుఁ దాల్చి యుండెనే! పురుషవేషముఁ దాల్చిన పడఁతివలెఁ గన్పట్టు నాయనుచరుఁడు కూడఁ బ్రేక్షకులమనములకు పెక్కుసందేహములు కల్పించి యుండెను. కానిచో రెండవవానికి జలముదొరకిన నానీ రెక్కడిది? ఎట్లువచ్చినది మున్నగు ప్రశ్నలు వాని మనస్సునకుఁ దట్టనే తట్టవు. అటులనే పరాజయ మొందుచున్న వారికి దేవునివలెఁ దోడైనవాఁ డెవ్వడు? ఎం దుండి వచ్చెనను తలంపే లేదు- విజయసింహుఁడు సవ్యసాచివలె నిర్వక్రవిక్రమం బతిశయిల్ల నెదిరికి దుర్నిరీక్ష్యుఁడై విజయము నందిపుచ్చుకొనుచుండెను.

అది గాంచి యోర్వలేక విజయసింహుని బంధుకోటి యెల్ల "ఎవఁడు వీఁడు? నేఁడు మన విజయునకుఁ జెందదగిన మణిహారము మెడ వేసికొని పోవఁజూచు! ఏమి వీనికావరము. ఇట్టిది వానిబందుగుల మగు మన కెల్లరకు సిగ్గుచేటు—"తలవంపు, లెండు, రండు వీని యుక్కడగింపవలయు" నని కృతనిశ్చయులై తాము నిజముగ నెవనితోఁ బోరునకు దలపడుచున్నదియుఁ దెలియక విజయసింహునిపైఁ గలిసిరి. నిరాఘాటముగఁ జూడసొంపుగ ముందుకు వచ్చుచున్న నొకపై నొక పెద్దకెరటము వచ్చి ముంచెత్తినట్లయినది. దశదిశలు హాహాకారములతో నిండె.

"అధర్మ మధర్మమని" లేచి చక్రవర్తి విజయుని బందుగుల వారింపఁబోయెను గాని యింతలో "యానూతనవీరుఁడు మాత్రము

మధ్యనే కదనరంగము జొచ్చిన" దని జ్ఞప్తికి దెచ్చుకొని అ(ట్లే)
కూర్చుండెను.

విజయసింహుని గుఱ్ఱము ముందరికాలు తెగిపోవుటచే (న)
ముందున కొరిగి పడిపోయినది. ఇంతలో నొక బల్లెమువచ్చి కవచము
భేదించుకొనిపోయి విజయుని ప్రక్కలో నాటుకొనినది. విజయుడు
వెనుకకుం దిరిగి చూచునంతకే తనసోదరుండె మందహాసముతో "గర్వ
మడిగినదా!" అని ప్రశ్నించెను. విజయునకు బాధ మిక్కుటమై
దుర్భరము కాగ కన్నులు మూసికొని తన హృదయానందకంద మగు
రంజని దేవి దివ్యసుందరమోహనమూర్తి నిగాంచి ధ్యానించుచుండెను.
"దేవీ! ఏమైనను నీయిచ్చవచ్చినట్లనే మెలంగు ప్రేమ దాసు" అని
నివేదించుచుండెను.

ఇంతలోం జంద్రహాసుడు వేఱొకగుఱ్ఱమును దీసికొని వచ్చి
ప్రక్కను నిలిపెను. విజయుడును కనులవిచ్చి చంద్రహాసుని ముఖముపై
దృష్టి నిలిపి "ఏమనెదవు" అని యడిగెను. అప్పుడు "పీనకిని పద్మిని
కిను రూపమునందును, చేతులయందును నెంతపోలిక యున్నది!" అని
మనమున నొక్కమారొక భావము స్ఫురించినది. అంతలో వాని
కన్నులు పద్మిని తన కిచ్చినడాలుపై వ్రాలి నిల్చియున్నది. చంద్ర
హాసుడు తలవంచుకొని "మహావీరునకు నేచెప్పవలసిన దేమున్నది.!"
అని ప్రత్యుత్తర మిచ్చెను. వెంటనే విజయుం డతికష్టముమీఁద నెట్లో
గుఱ్ఱముపై కెగబ్రాకి యాయుధము కేలంబూని గుండుం దెబ్బతినిన
బెబ్బులివలె విజృంభింప సందఱును బటాపంచలై పోయిరి.

తిరిగి తూర్యధ్వనులు చెలరేగినవి. విజయభేరి మ్రోగించి వి(జ)
యము ప్రకటించిరి. విజయుని సన్మానింప నెల్ల రుద్యుక్తులగు చుం(డ)
విజయసింహుడు "సోదరా! ప్రాణములు పోవుచున్నవి. మనము
పోవలయును.

చంద్ర:—మంచిది

పక్షమువారు :—నీకు వజ్రహార మిచ్చెదను. నీవె గ్రహింపుము.

విజ :—నన్నుఁ బూడ్చి పెట్టకుఁడు. గాలి నిండు. అయ్యో! నాకుఁ గొంచెము గాలి నిండు.”

అనువరి కందఱును బ్రక్కకుఁ దొలఁగిపోయిరి.

విజ :—నాతో మీరెవ్వరును రావలదు.

పక్షము వారు :—బహుమానము!

విజ :—మరణమే నాకు బహుమానము! సోదరా! రమ్ము.

విజయసింహుఁ డెటుల రంగస్థలము ప్రవేశించెనో యటులనే యందుండి నిష్క్రమించెను. ప్రవేశము నిష్క్రమణముకూడ నింత విచిత్రమగు నీపాత్ర మెట్టిదో యని యందఱు నాశ్చర్యపడిరి.

ప్రభాకరున కాశ్రోత్రవ్యక్తి విజయసింహుఁడే యని పలుమాఱు స్ఫురించెను. కాని నిశ్చయముగాఁ జెప్పుట కావడ్డని యిచ్చిన పచ్చల పతక మడ్డు చెప్పుచుండెను. ఎవ్వరైన నేమి? ఈమణిహార మాపీనుగదై పోయినది. “కమలాకాంతా! నీవు పోయి యానూతనపురుషుని జాడఁదీసి వాని కీబహుమానము నగౌరవముగా సమర్పించి వానిని గూర్చి పూర్తిగా నరసి రమ్ము” అని యాజ్ఞాపించుచుఁ దక్కుంగల రాజలోకము నవలోకించుచు “మీరును చూచుచుండిరిగదా? ఆగ్రహము, పరాక్రమము, లాఘవము, నేర్పు, యందము, లీల, వేయేల నవరవిజయుని వలెఁ దోచుచుండిన వీఁ డీమణిహారమును మనవద్దనుండి పొందుటకుఁ దగునుగా? యని ప్రశ్నింప నందఱును నైక్యకంఠముతో “నిజము తగును” అని ప్రత్యుత్తర మిచ్చిరి. ఇఁక నిటపై జరుగువిందులలో వినోదములలో పాల్గొనుటకు వీలులేక పోవుచున్నదిక దా యని నిండునమ్మతి లేకపోయినను జేసియానతి శిరసావహింపక తీరనిదగుటచే నప్పటులో లేని మందహాసము తెచ్చుకొని చక్రవర్తికడ సెలవు పుచ్చుకొని యానూతనపురుషుని వెనుక కమలాకాంతుఁడు బయలు దేఱెను.

మొట్టమొదటి యేర్పాటు ప్రకారము మొకగొప్ప విందు జరుగ వలసి యున్నది. తరువాత గానమున్నది. పిమ్మట ఇంద్రజాలప్రదర్శన మున్నది. రాత్రి "ఈశ్వరగర్వభంగము" అను నాటకము ప్రదర్శింపఁ బడవలసియున్నది. జగన్మోహనరూపము దాల్చినవిష్ణువుచే నీశ్వరుఁడు భంగపుచ్చఁబడు కథ రాణియగు రంజనికి మిగులప్రీతి యగుటచే నానాటకప్రయోగము నిర్ణయింపఁబడినది. అయినను గాల మీలోపునఁ గొన్ని మార్పులఁ గలుగఁజేసినది. రంజని కురురంగమునకు రాలేదు. విజయు డచ్చటకు రాఁజాలకపోయినను చక్రవర్తికి మనస్సునఁ గొంత యలజడి కలుగుచున్నది. ఏలనో రంజని నొకసారి చూడ నత్యుత్కంఠ మతిశయించుచుండెను. అర్ధాంగితోఁ గలసి మాట్లాడినగాని పరిష్కృతముగాని ధర్మసమస్య లతిక్లిష్టతరము లగుచున్నట్లు పొడకట్టు చుండెను. మఱియు యువనులు దాడివిషయమైన వర్తమానములు గూడ వచ్చుచున్నవి.

అట్టియెడ సార్వభౌముఁ డేమిచేయువలయును? ఏమి చేయుటకును దోచక నాటికిమాత్రము పగ్గములవదలి సామ్రాజ్యరథమును కాలాశ్వము లెటులాగిన నటుపోనిచ్చెను. అన్నివింతలు వినోదములును జరుగుచున్నవి. చక్రవర్తి దానఁదొకచిత్రబొమ్మకైవడి సంచరించుచుండెను.

రథము నశ్వములు రాజమార్గమునుండి ప్రక్కకు లాగెను. ఇఁకపై సారధి యెంత ప్రయత్నించి తలక్రిందుగఁ బడిపోవుచున్న రథమును గుదురుపఱచి రాచబాటకుఁ దేగలడు?

## ౨౦

పున్నమనాఁడు పూర్ణచంద్రుఁడు ప్రాగ్దిశ నలంకరించుచుండెను. వన మధ్యమున వాయుమూల యమునాతీరమునఁ బ్రాతకోటలో మేడ మీఁది గదియందు గవాక్షముకడ సోఫాలపైఁ గూర్చుండి జాలకముల

మండి, నింకుచంద్రునియందమును దిలకించుచు ప్రతాపసింహుడును పద్మినియు, నిటుల మాటలాడుకొనుచుండిరి.

పద్మి :—ఒడలు వంచి పాటుపడుమని సూర్యుడాజ్ఞాపించును. పదవ యీలోకమున సేకరిరి సౌఖ్యమనుభవింపుడని యీ చంద్రుడు బోధించును. చంద్రసూర్యు లీలోకమునకు దలిదండ్రులు.

ప్రతా :—చిట్టికల్లీ! తండ్రి యెన్నడును సుఖపడుమని చెప్ప డటమ్మా!

పద్మి :—ఎల్లప్పుడును పనులనే చెప్పుచుండును.

ప్రతా :—తల్లి పనిచెప్పదా!

పద్మిని మాఱుపలుకక తలవంచుకొని యూరకుండెను. ప్రతాపుడును యు, జెప్పనేరక నేల జూచుచున్న తల్లిలేనిపిల్లనుజూచి, "తండ్రి కర్ప్యయముగ క్రూరుడా! లేనిచో నే నిట్టిప్రశ్న నడుగగలనా? పైనుండి యాకస మూరక వర్షించుచునుకె నిజముగ తల్లియగు భూమియె యీకాలముల నెల్ల తనలోనికి గ్రహించి, వలయునపుడు తగురీతి లతా ముల కొనగి, పెంచి తృప్తింపజేయుచుండగ, తండ్రిపైనుండి కాంచి సంధ్యవేళమాత్ర మొకింతమందహాసము చేయుచుండును. మాతృప్రేమ కౌముదివలనే కష్టమును సుఖమును మార్చి వేయగలమహిమ గలది. టటా! నాపట్టి యీ మాతృహస్తమృదుస్పర్శ సుఖ మీ యెఱుగదుగద! మేమెంతపురము, హతభాగ్యులము!" అని చింతించుచుండ నాతని ముసలి కనుగొలకుల నప్రయత్నముగ బాష్పజలము జేరవొచ్చెను. కావున మనస్సు మరలించుకొని, కూతురువంకకు దిరిగి, "యీనడుమ గడివిడిచి నీవలకు వచ్చుటయేలేము. అన్నగారికు బాగుగా నున్నదా!"

పద్మి :—అటనుండి యందఱు నెవరియిండ్లకువారు చేరిరి. కాని మనవారింకను రాలేదు. ఏమియును తోచక చిత్రములవ్రాయు చుంటిని. ఇదిమాడుము! ఎట్లున్నది!" అని తండ్రిచేతికొకపట

మందిచ్చెను. అందు జీవకళలుట్టిపడ విజయసింహునిరూప మచ్చుపడి యున్నది. ప్రతాపుఁడు చిత్రరువును వెన్నెలవెలుంగునఁ బరికీలించుచు, "అయ్యయ్యో! యీ బాలిక యందనివందున శాసించుచున్నదే!" అని విచారించుచుఁ బ్రకాశముగ "బాగుగనే యున్నది. కాని చెప్ప మఱచితిని. మనవాఁడును, సతీఁడును, నీ గురువుగారి నూతనయాత్రమందున్నారఁట. అతనికే విజయము కలిగినదఁట! కాని, బలముగ గాయము తగిలినది. యోగి చికిత్స చేయుచున్నాఁడు. సురక్షితముగనే యుంటిమని మధ్యాహ్నమె మనవాఁడు వార్తనంపెను.

పద్మి :—బలముగుగాయమే? యెక్కడో?

ప్రతా :—కుడిప్రక్కలో.

పద్మిని హృదయముపైఁ జేయి వైచుకొని తలపఁకించుచు "కావుననే కాఁబోలును యెత్తురంగు నాకుంచెనుండి ప్రుల్లి యీనాఁటి ప్రక్కను బడినది. అప్పుడే యేలనో నాహృదయమునఁ జివుక్కు మనెను. చూఁడుము. ఇంక నామచ్చ యెత్రయత్నించినను మాయ లేదు. ఒక్కసారి పోయి నే చూచి రావలయును.

ప్రతా :—నేఁడుండును. రేవుపోవును. అట్టివానితో మనము విశేషసంబంధ ముంచుకొనకూడదు. కాక నీసోదరుఁడు కనిపెట్టి చూచుచునే యున్నాఁడు. నీవచ్చుటికివ్వుడు పోనక్కఱ లేదు.

పద్మి :—మంచివాని కాపద కలిగినపుడు ప్రతివారు సాయపడ వలసిన విధి లేదా? అట్టిచో మహావీరాగ్రేసరునకు సేవచర్య చేయఁ జనదా? అతనికిని మనకును నిదివరకే సంబంధమేర్పడినది. "అవీరాగ్రణి నా ప్రియసోదరుని ప్రాణము—"

ఇంతలో సేవకుఁడు ప్రవేశించి యెవ్వరో కురురంగమునుండివచ్చి వేచియుండిరని యెఱింగించెను. తోడనే తండ్రియుఁ గూతురును గూడ మేడదిగి యేతెంచిన కమలాకాంతున కెదురేగిరి. ప్రతాపుఁ డాగంతుకు నతిథిసత్కారముల నెల్ల నుచితరీతి గావించి, యాగమన

…రణం బరయు, కమలాకాంతుఁడు. తావచ్చినపని సవిస్తరంబుగ …ర్ణించెను. తరువాత

ప్రతా:—వీరవరా! నీవిఁకఁ బెక్కుచోటుల వరయ నక్కఱ …లేదు. ఆమహావీరాగ్రణి మాయింటికి వచ్చి తన డాలు మాయింట …ంచుకొని, మాయింటిలోని డాలు నొకదాని నడిగి తీసికొని వెళ్లెను. …వ్వులపతకము మొకను దాల్చినది నే నెఱుఁగ—

పద్మి:—ప్రచ్ఛన్నత బయల్పడకుండుటకని యాపతకము నేన …ఱుద్చితిని.

అని యా మిత్రంద్రిమాటుననుండి పలుకుచుండ, వీణెపై బలి …ంచుచున్నటులుండెను.

ప్రతా:—మాయింట నుంచినడాలును జూచిన నీ వాతనిఁ …చ్చి నిజముగు పేరును గూడ గ్రహింపఁగలవా?

కమలా:—తెలిసికొనవచ్చును.

ప్రతా:— అమ్మాయీ! నీవీతని కద్దానిసి జూపించుము. …కనుష్ఠానమునకుఁ గాలమైనది.” యని లోనికి వెడలిపోయెను.

కమలాకాంతునకుఁ బద్మినీ సంవర్శనమైన క్షణమునుండియు, …నను మనసులో లేదు. హృదయము పొంగిపోవుచుండెను. అంతయు …నందము. తా నెక్కడ నుండెనో, యేమి మాటలాడుచుండెనో, …మాతఁ డెఱుఁగఁడు. తాను స్వర్గపురమందు మందాకినీతీరమున …మ్మమల్లియల పాన్పుపై—పారిజాతముల ప్రోవునానుకొని కూరుచుండి, సువర్ణ పాత్రతో నమృతంబును గ్రోలుచుఁ జంద్రికస్వచ్ఛమా? చెంగల్వ స్వచ్ఛమా? అమృతము మధురమా? ప్రేమసియధరము మధురమా?” యని యచ్చరలేమలు పాడుచుండ నానందపరవశుడైనటుల భావించు …నుచుండెను. పద్మినియు మనోహరుని పరాక్రమవర్ణన మాలకించుచుఁ …న్మయత్వము జెంది, తానే విజయసింహుఁడైనటుల నిష్కళంకమగు …ర్వముతోఁ జూచుచుండెను. పద్మిని ముందు నడువ, కమలుఁడు

వెన్వెంట నడుగులలో నడుగులు వేయుచు, వచ్చుచుండెను. పద్మి
తనగదితలుపు తెఱచి లోనఁ బ్రవేశించెను. శ్రుతుల జతపఱు
బడియున్న వీణ మలయమారుతము తాకున "జయ—విజయ—శ్రే
జయ— తే—వి—జ—యు" అని పాడుచుండెను. కమలుఁడుగూడ లో
బ్రవేశించెను. కాని "యాతఁడట నిలుచుట కచేతనంబులగు కుడ్య
బులు సహితము సమ్మతింపనటులుండెను. తీయమామిడిపండులో
జింతపిక్క చేరినట్లున్నది. పద్మిని డాలుపైఁ దాఁగూర్చుని పట్టుతొడుగ
నూడదీసి లోనిడాలును గమలునికిఁ జూపి, తలవంచుకొని నిల
యుండెను. గదియంతయుఁ బాలవెన్నెలతో నిండియుండెను. వెలుప
తోటలో నేచెట్టుపై నుండియో, కోకిల, కో, యని కూయుచుండెను
ఆడాలు చూచినంతనె విజయసింహుఁడె యాట వీరాననము వైచుకొ
కూర్చున్నటులఁ గమలుని మనమునకుఁ దట్టెను.

కమల :—సుందరీ! త్రిలోకసుందరీ! మోహినీ! భువనై
మోహినీ! నీవాపాపి నేల వలచెదవు? నీ హృదయపాత్రమందలి
ప్రేమామృతము నాపాషాణముపై నేల యభిషేక మొనర్చెదవు!

పద్మిని వంచినశిర మెత్తకుండగనే ద్వారముకడ కరుదెం
వెనుదిరిగి చూచుచు, "ఈడాలెవరిది? వాని పేరేమి?"

కమల :—విజయుఁడు—విజయసింహుఁడని తేను పిలుచున—
విజయచంద్రుఁడని రాణి రంజని పిలుచుకొనుచుండును—రమ్మా! ఇదిగో
మణిహారము! రమ్మా. ఇది నీకిచ్చెదను.

పద్మి :—నా కేల?

కమల :—ప్రియుని కిచ్చుటకు—(అని తన్నుఁజూపుకొనును)

పద్మి :— సార్వభౌమునిచే నియోగింపఁబడినవారే. తత్కా
ర్యము సేయు టుచితము.

కమల :—ఇదిగో నేను నీకిచ్చుచుంటిని. తిరిగి దీనిని నీ
నీప్రియున కిచ్చిన, నీచేత నలంకృతుఁడై యెంతయో యానందించును

అని వెఱ్ఱిచూపుతో, యించుక వంగి తలవంచి నిలుచును.

పద్మి :—సరే! నీవు పోవచ్చును.

సహుషునివలె, కమలుఁడు స్వర్గమునుండి క్రిందకుఁ ద్రోసివేయఁ బడిన ట్లయ్యెను.

కమల :—సెలవా ?

పద్మి :—మంచిది.

కమలుఁడు ముందునకు రెండడుగు లిడి వెనుకకుఁ దిరిగివచ్చి, "పోఁజాలకుంటిని"

పద్మి :—ఏల ?

కమల :—ఏమి! నెఱజాణతనము! సూత్రము చేఁ బట్టుకొని యెగిరిపోమ్మన నీపావుర మెటులఁ బోఁగలదు? గాలిపటమువలె నటు నటు తిరుగాడవలసినది గదా! అదృశ్యరూపగంధమున బంధించి పోవిడిచితి. పొమ్మన్న నీభ్రమర మీపద్మమును విడిచి యెందరుగఁ గలదు ?

పద్మి :—మీ మాటల వేమియు నాకర్థమగుటలేదు. నీవు వెడల వచ్చును. ఈమణిహారమును బ్రతాపసింహుని తనయ పద్మినియను కన్య విజయసింహుని కీయఁగలదని, పోయి సార్వభౌముని కెఱింగింప వచ్చును. చాలరాత్రి యైనది. తండ్రిగారు నాకొఱకై యెదురు చూచుచుందురు. ఆయన పాదసేవ నించుకసేపు చేసి నిద్రపోవలయు, నిద్రవచ్చుచున్నది.

కమలా :—అయినచో, నాహృదయచకోరము నీప్రేమచిసుకుఁ గానక విరహాగ్నిం బడి మ్రగ్గవలసినదేనా ?

పద్మిని :—వీరవరా! ఇది నీకుఁ దగునా ?

కమలా :—నీవు కన్యవు. నేను క్షత్రియుఁడను. గాంధర్వము శాస్త్రసమ్మతము. షోడశకళాపూర్ణుఁడై వెలుగుచున్న చంద్రుని మ్రోల—నిక్షుదండముతో నీలోత్పలాదులతో, మనయిరువురనడుమ

నిలిచియుండి బ్రహ్మపీఠ మధిష్ఠింప వేచియున్న మన్మథుని సహాయమున బ్రాహ్మవివాహమునకైన లోటులేదు.

పద్మ :—ఈమాటలు నాకు సహ్యములు కావు—నే వాని వరించితిని. ఈలోకమున— లేనిచో— పైలోకమున, ఈజన్మమున లేనిచో—పై జన్మమున నేను వాని యర్ధాంగి నయ్యెదను. అది నే నెఱుంగుదును. నీవు పొమ్ము.

కమలా :—నా జీవఱకే చచ్చి యుండును - లేనిచో - నిన్నుం దృణీకరించి రంజని కౌంగిలి గోరి పరుగిడును.

పద్మ :—అయిన నా కేమి? నే నిరువురకునుగూడ దాసినై సుఖింతును" అని యుచ్చరించుచునే మూర్ఛపోయెను. ఇంతలోం బ్రతాపసింహుండు మేడపైకి వచ్చెను.

ప్రతా :—భోజనమునకు రా లేదేమి?

కమలా :—ఆ విజయసింహునిగూర్చి యడుగుచు నిటులనే కూర్చుండెను. అమ్మా! ఈబాలికకు వానియందె తపలపో కాని గాయముతగిలినవిధము చెప్పుచుండగనే . ...యిప్పుడే - పాపము! మూర్ఛపోయినది! ఏమి చేతునా యని చూచుచుండ మీరే తెంచితిరి.

ప్రతాపుండు వెంటనే పద్మకు శీతలోపచారములు గావింపం దొడంగెను. అందు కమలాకాంతుండు మిక్కిలి సాయపడెను. పూల వీవనతో విసరందొడగెను. ప్రతాపుండు పన్నీటితో ముఖము తడిపెను. వృద్ధ సేవకుండు తీసిన గంధమునకుం బరిమితి లేదు. ఎట్టకేలకుం దిరిగి పద్మిని కనులనిచ్చి చూచెను. చీకటిలో మునింగి యున్న వారికి సూర్యోదయ మట్లయ్యెను. ప్రతాపసింహుండు మాటి పలుకరింపక జాగ్రత్తగం గూతుని గొనిపోయి, వేఱొక గదియందు పరుండంబెట్టి "తల్లీ! కన్నులు మూసికొని యేమియు నాలోచనలు పెట్టుకొనక నిద్రపొమ్మా" అని చెప్పి కమలాకాంతునికడకు వచ్చెను.

కమలా :—అమ్మా! సుఖముగ నిద్రపట్టుచున్నదా!

ప్రతా:—పట్టును. కాని యీ విజయసింహునిగూర్చి మీ యభిప్రాయమేమి?

కమలా:—అతఁడన్నివిధముల మీబాలికకుఁ దగిన వరుఁడె. కాని యతఁడు వివాహము చేసికొన నొల్లఁడని చెప్పుదురు!

ప్రతా:—అదేమి?

కమలా:—అదేమో యెవరుచెప్పఁగలరు? కంటితోఁ జూచిన దెవరును లేదు. కాని యాతఁడు మహారాజ్ఞిని వలచియున్నటులను, మహారాజ్ఞి వీనియెడ మిక్కిలి యనురాగము చూపుచున్నటుల నందఱు చెప్పుకొనుచుందురు. ఇంతకును సత్యము దేవుఁడెఱుఁగును.

ప్రతా:—చాల రాత్రియైనది—భోజనము చేసి.....

కమలా:—వలదు. నే నిప్పుడే పోవలయు—యువనుల విషయమై కూడఁ గొన్నిరహస్యముల నరయవలయు; కావున నే హారమును గూడ మీయమ్మాయిచేతికే యిచ్చి వాని కిమ్మని వేసితిని. బాగు సేయుఁజనదు. అని సాకుచెప్పి కమలాకాంతుఁ డటనుండి యెట్టులో బయటపడి ప్రతుకుజీవుడా యని గుఱ్ఱమెక్కి రాజధాని కభిముఖుడై వెన్నెలలోఁ బాడుకొనుచుఁ బోవుచుండెను. ఆపాట తన పరాభవము యొక్క బాధను గొంతవఱకు శమయించు ననునాశయేగాని, శృంగార రసపూరిత మగుటచే నాపాటవలన, మంటపై నేయి పోసినట్లాయెను. పద్మినిపై మోహము—విజయునిపైఁ గ్రోధముగఁ బరిణమించెను. ఎట్లైనను వానిని రంజనిని పరాభవింపవలెనని నిశ్చయము చేసికొని, పన్నుగడలు వెదకుచుఁ బోవుచుండెను.

ఇక్కడ పద్మినికి కన్నుమూతపడదాయె— "నా ప్రియుఁ డెట్లుండెనో!" అని యొక్కటేభావము. పద్మిని తటాలునఁ బ్రక్కపై లేచి కూర్చుండెను తావళము చేతఁబూనిన యోగివలె, మణిహారము చేఁబూని లేచి నిలువంబడి ధ్యానించుచు ముందునకు నడవఁ జొచ్చెను. పాదము లామెను దండ్రికడకుఁ గొంపోయెను. ప్రతాపుఁడు

పరుండసిద్ధముగనుండి, కూతునకు నిద్రపట్టినది లేనిది స్వయముగఁ జూడవలెనని బయలుదేఱి తనగదినుండి యీవలకు వచ్చుచుండెను. ఇంతలోఁ బద్మినియే తన కెదురుగనిల్చెను. కూతుమోము చూచి నంతనే తండ్రికిఁ గోపము, సవహ్యము, జాలియుఁ, గూడ నొక్కసారే కలిగెను.

ప్రతా :—నిద్రపోవుచుంటివి కాదా ! అని తనచేతితో నర్ధ చంద్రునివలె మెఱయుచున్న యామె ఫాలభాగము స్పృశించెను. నుదురు కాగుచున్నది.

పద్మి :—నిద్దుర పట్టలేదు. కంటికిఁ గూర్కు రాదు.

ప్రతా :—నీ వీపూటేమియుఁ దినలేదు. కొంచెము—

పద్మి :—నోటికి మెతుకుపోదు.

ప్రతా :—మఱి నీవేమి చేయుదువు.

పద్మి :—ఏమియునులేదు. ఒకచిన్న మబ్బుపై నెక్కి యాపూర్ణ చంద్రమండలము చేరఁబోయెదను. నా గురు వందుఁ గూర్చుండి పాడు చుండెను. నాయన్న తాళము వేయుచుండెను. విజయసింహుఁడు నడుమ నుండి యానందించుచుండెను.

ప్రతా :—(నవ్వుచు) అయినచో వానికి గాయము మాని నదా ! బాధ పోయినదా ?

పద్మి :—లేదు. కనుకనే నేపోయి యాబాధనే మాన్పిపుచ్చు కొనెదను. వారప్పుడు పూర్ణానందమంది సుఖించెదరు.

ప్రతా :—అమ్మా ! నీవొక చిన్నపసిబాలికవలె మాట్లాడు చుంటివి చంద్రునిఁ జూచి దవ్వులనుండి యానందింపవలసినదేగాని, యందుకొనఁగోరి చేయిచాపుట వెఱ్ఱితనము—బేలతనము.

పద్మి :—వెఱ్ఱినో ? బేలనో ? ఈ మణిహారముకూడ వానిది వానికిచ్చి వేయవలెను. వాఁడు నాచేతికిచ్చి పోయెను.

ప్రభా :—గాయము కుదిరినవెంటనే వారే యిక్కడకు వత్తురు. అప్పు డీయవచ్చును. నీ విప్పుడు పానికడ కరుగుట నాకిష్టము గాదు.

పద్మి :—విడలకుండుట నాకు శక్యము గాదు. అమ్మాయున్నదన్నావునా ? ఎన్ని యో చెప్పి పంపియుండును.

ప్రభా :— నీ కుండశక్యము లేనిచోఁ జనుము పొమ్ము— అంత పోఁ దలఁచినప్పుడు పొమ్ము-పరధ్యానముగ నుండి పంజరము మూత తెఱచినంతనే పారిపోవుచిలుకవలె పద్మిని తటాలున లేచి నడుచుచుండెను. ప్రభావుఁ డది చూచి మాఱుమాట చెప్పఁజాలకపోయెను. నమ్మకమగు వృద్ధ సేవకులఁ దోడిచ్చి, కూతును యత్తవారింటికిపలె, సాగనంపి వచ్చెను.

౨౧

హస్తినాపురమునం దంతఃపురములో సార్వభౌముఁడును మహారాజ్ఞియుఁ గలసి మాటలాడు కొనుచుండిరి.

ప్రభా :—నీ కింకను జబ్బుగనే యున్నదా ?

రంజ :—లేదు.

ప్రభా :—విజయసింహుల కెట్లున్నదో ? ఎక్కడ నుండెనో ?

రంజ :—మీ వెనుకనే కురురంగమునకు రాలేదా ?

ప్రభా :—లేదు. కాని యన్ని విధముల వానిఁబోలు వీఁడెవఁడొ మఱియొకఁడు వచ్చియుండెను.

రంజ :—ఇఁక నేమి ? వాఁడె వీఁడు.

ప్రభాకరుఁ డాశ్చర్యనిమగ్న మానసుఁడాయెను.

రంజ :—వాఁడు మీరాటుల మఱలినతోడనే వాఁడు నాతో నాకొకవాడు వచ్చుచున్నదనియు, నానింద బాపుకొనుటకుఁ దాను ప్రచ్ఛన్నముగఁ గురురంగమునకుఁ బోవలసియున్నదనియు, జెప్ప

నే నాశ్చర్యపడి "అదే" మని యడిగితిని. "నాపేరు వినినంత మాత్రముననె నా ప్రతివీరులెల్ల నూరక భయపడి యోటమినంగీకరించు చుండిరేగాని నాయందు వెనుకటిశక్తి నేఁడు లేదు. సళించిపద రొకమాట వినఁబడుచున్నది. కావున నీయొద్ద నాపేరు కప్పిపుచ్చి పోయి నాకీర్తి నిలువఁబెట్టుకొనవలెను. చక్రవర్తియుఁ గీర్తికాముఁడగు తన వీరుల నెపముల మన్నింపకపోఁడు." అనిచెప్పి తోడనే లేచి బయలుదేరెను.

ప్రభా:—[ఇంచుక నసిష్టము బయల్పడ నొకింత వికటత్వముతోఁ గూడిన చిఱునగవు యధరముపై బొడసూప] ఏమి! నిన్ను నమ్మిన విజయసింహుఁడు బాల్యస్నేహితుఁడను, చక్రవర్తినగు నన్ను నమ్మఁజాలక యెంత చులకనగ నత్యావాక్యమునుభంగము గావించు కొనెను!—అటుగాక నన్నుఁగూడ నమ్మినచో నెంత యందముగ, వరవముగ, నొప్పియుండెడిది. నేను వాని కీరహస్యము బయట పెట్టుదునే? దాని కేమిగాని పాపము! వాని ప్రక్కలో బలమగు గాయము తగిలినది!

రంజనిముఖము వెలవెల బోయెను.

ప్రభా:—గాయమున కేమి, తగినచికిత్స చేసిన సులభముగ మానును. ముఖ్యమైనది మనకు నంతోషకరమగు నొక్క శుభవర్తమానము! - విజయసింహుఁ డిటుపై నొక యింటివాఁడు కాఁబోవు నాశయు కలుగుచున్నది. ఈసారి వాఁడొక ముద్దుల గుమ్మచే సనుగ్రహింపఁబడిన వచ్చలపతకము దాల్చి వచ్చెను.

తననరసను గూర్చుండి భర్త ముచ్చటలు చెప్పుచుండ నాకడపటి వాక్యము వినినంతనె రంజని కొడలు పరవశమై పోయినది. ఆనందము చేతఁ గాదు—అసూయ, దుఃఖము, కోపము, ముప్పిరిగొనుటచేత!—ఏమియుననుటకు నోట మాట వెలువడినది కాదు. నాథుని మోము కన్నెత్తి చూచుటకు రెప్పలు లేచుటలేదు. ఇంకను మగఁడు

చెప్పఁబోవుచున్న మాటలు చెవులకు వినఁబడుటలేదు. అచ్చట నూర్చుండుటయే సనహ్యాముగ లేదు. దిగ్గున లేచి "మీకుఁ గలిగిన యాశయే నాకును గలుగుచున్నది." అని చెప్పుచు నాగక, తిన్నగఁ బడకటింటిలోని కరిగి తలుపు వైచికొని, చక్రవర్తిపాన్పుపైఁ బడి పాముపలె వెన్వెంట మనసునంటి తరుముకొని వచ్చుచున్న దుస్వహ భావము వలనఁ గలిగిన తాపముచే నిటునటు పొరలుచు, నొక్కమాఱు ప్రక్కకుఁ దిరిగి మోఁచేతిపై నించుక లేచి, ద్వారమున్న గోడవైపు నిశ్చలముగ, జూచుచు, "ద్రోహీ!" యని గట్టిగఁ గసిదీర నంబో ధించెను; కాని యాగోడకు నోరు లేకపోవుటచే నేమియుఁ బ్రత్యుత్తర మీయక యెప్పటివలెనే తెల్లగ, తళతళ మెఱయుచు నిల్చియుండెను. కాని యప్పుడు చేయున దేమియునులేక గర్వపూరితమగు కాంతిని పైకిఁ దెచ్చుకొని మహోగ్రోధమై ప్రవర్తించుచుండెను.

కురుక్షేత్రమందలి తన స్వప్నవృత్తాంతమును గూర్చియు, యవనుల వాడిఁగూర్చియుఁ; దన హృదయమును గలఁచివేయుచుండిన భావము లను గూర్చియు నింక నీకేమేమో చెప్పవలెనని యనుచుండఁగా, వర్ధాంగి యంతలో లేచిపోవుట చూచి ప్రభాకరుఁడు కారణ మూహింపఁజాలక యిటు నటు జూచుచుండ, సేవకుఁ డరుదెంచి కమలాకాంతునిరాక నెఱింగింప, చక్రవర్తి వానికి దర్శన మిచ్చి, యాతనవిశేషంబులు గ్రహింపవచ్చునని నిశ్చయించి, యంతిపురిని వీడి కొలువుకూటమునకు వచ్చెను. తోడనే కమలాకాంతుఁడు లేచి సవినయంబుగ నమస్కరించి, మొదటినుండియు, దా నేయేస్థలములకుఁ బోయి వెదకెనో, యెంతెంత కష్టములఁ బడెనో, తుదకుఁ బ్రతాప సింహుని వనదుర్గమం దెటుల విజయసింహునిజాడ దొరకెనో, సవిస్త రంబుగ వర్ణించి తెల్పి, "ఆ ప్రతాపసింహుని గారాబు కూతురగు పద్మిని యను కన్యయే విజయసింహునికిఁ బతికమునిచ్చి, గాఢమగు ప్రేమం దవిలి యుండుటచే, నా కాకోరిక చొప్పున నేను మణిహార

మామె కప్పగించితిని. ఆమెయుఁ దన ప్రియునికొఱ మాహారముల్ నిప్పటి కలంకరించియే యుండును." అని చెప్పి తనకథ ముగించెను.

ప్రభా:—నీవా యోగియాశ్రమ మెక్కడనో తెలిసికొంటివా?

కమల:—లేదు. అడుగ మఱచితిని. మోహాంధుడైన వానికంతేజ్ఞాన మెటులుండును!

ప్రభా:—నీ వా హారమును గొనిపోయి న్యాయముగ విజయునకందచేయక బాలికచేతికి నేల యిచ్చితివి?

కమల:—ఉత్తమకులసంజాతియగు కన్య నకారణంబుగ నిమ్మని కోరినపుడు, తిరస్కరించుట యధర్మము గదా!" కమలాకాంతుడు రంజనివలనే గొప్ప కాపు పెట్టితినని లోలోన వంతసించుచుండెను.

ప్రభా:—నీయేలిక యానతి త్రోసివుచ్చు టధర్మముగాదా!— సరియే. ఇటుపైన నీ వెన్నఁడు మా పనులపై నక్కఱలేదు.—అని చెప్పి చక్రవర్తి లోనికరిగెను.

కమలాకాంతుఁడు తన తప్పును దెలిసికొనెను. కాని యాతని స్వభావమునుబట్టి యందువలనఁ బశ్చాత్తాపమునకు మాఱుగఁ గోపము కలిగెను. క్రోధఘూర్ణితలోచనుఁడై తాఁడు పోయినదారి వెంబడి రెప్పవేయక చూచుచు నొక్కక్షణము నిలువఁబడి "ఘటనా ఘటన సమర్థుఁడనగు నే దీనిని లెక్కసేయు నేల!" యనునటు లొక్కమాఱు తలపంకించి, మందహాసముచేసి, "ఒక్కదెబ్బకు రెండుపండ్లను రాలగొట్టుటయే ప్రజ్ఞ యని, విజయప్రభాకరుల నేకకాలమునందు వంచించుచుంటి" నని తలంచి పద్మినీ విజయసింహుల ప్రణయకథను బట్టణము నాల్గుమూలల వ్యాపింపఁజేసెను. రాణిని వంచించిన రాజును వంచించుటయే యని కమలుని భావము! కాని యంతకు మూలము పద్మిని తన్నుఁ బ్రేమింపక తిరస్కరించుటయేకదా! ఆహా! భగవానునిచే రచియింపఁబడిన యీ మహానాటకమందలి పాత్రల చర్యలకును మాటలకును మూలకారణము లెంత నిగూఢములై యుండును!

ఒక్కొక్కప్పుడు మనుజుఁ డితరుని మోసపుచ్చు మాట యటుండఁ దనను దానె తెలియక కొన్నిసారులును, తెలిసి కొన్నిసారులును మోసపుచ్చుకొనుచుండును.

కమలాకాంతుని వీడి లోనికరిగి రహస్యకార్యాలోచనా మందిరముఁ జొచ్చి ప్రభాకరుఁ డాసేతుహిమాచలమునంగల తన సామంతరాజుల కెల్ల సైన్యములం గూర్చుకొని యవనునితోఁ బోరునకు సంసిద్ధులు కండని హెచ్చరించుచు లేఖల వ్రాయుచుండెను. అందు రాజభక్తియు, సోదరభావమును, దేశభక్తియుఁ బ్రతివాక్యమందును సువ్యక్తమగుచుండెను. నమ్మకముగు చారుల రావించి యాకమ్మల నాయా దేశాధీశుల కతిత్వరితంబుగ నందఁజేయ నియోగించుచుండెను. తరువాత మిక్కిలి యాప్తవర్గములోఁ జేరిన తనమంత్రిపుత్రుండగు సుమంత్రుఁడను వానిని రావించి విజయసింహున కొకలేఖ వ్రాయుచుండెను. పూర్వము రాచకార్యవిషయములందు సందుముఖ్యముగ యవనులతో సంబంధముగల విషయములఁ గూర్చి ప్రభాకరుఁ డాలోచించునప్పుడు రాణియగు రంజని కూడఁ బ్రక్కనుండెడిది కాని నేఁడు ప్రభాకరుఁ డొంటరిగనే కూర్చుండి రాచకార్యములఁ జక్కఁబెట్టుకొనుచుండెను. రంజని యుంచుక యస్వస్థయై యున్నదికద! కాని యామె సరసను లేనిలోటుమాత్రము మిక్కిలి కానుపించుచున్నది.

ప్రభాకరుఁ డుత్తరము పూర్తిగ వ్రాసినపిదప తిరిగి యిటులఁ జదువుకొనెను.

"విజయా! నీకుఁగలిగిన పిచ్చిభయము నాకు మిక్కిలి నవ్వును గలిగించుచున్నది. ఎట్లయినను గీర్తికాముఁడవైన నీసేవము మన్నింపఁబడినది.—కాని యీసారి నిజముగ నీకు బలమగు గాయము తగులుట నీ వస్తుత మాడినఫలము కాని వేఱుకాదని నాయభిప్రాయము. అయినను దయామయుఁడగు పరాత్పరుఁడు నీ కచిరకాలముననె యారోగ్యమనుగ్రహించుగాక!

నూతనప్రియానురాగంబున మున్గి తేలుచుఁ బ్రొద్దులు పుచ్చుచున్న నిన్నుఁ గార్యావసరంబున నగరమునకుఁ బిలువవలసి వచ్చినదికదా

యని విచారించుచున్నాను. యవనులు గాంధారము రహస్యముగ సమీపించుచుండిరని నాకుఁ గురురంగమునకే వార్త వచ్చినది. కాని యిప్పుడు నీవటనుంటివని నాకుఁ దెలియదాయె. సామంతులకు జాబుల నంపితిని. వెంటనే నీవరుదెంచి యాధ్వర్యము వహింపవలయు —

నీకు నేను వ్రాయవలసిన దేమి? — ప్రభాకరుఁడు."

ఆయుత్తరమును మడచి యతిగి పైవిలాసము వ్రాసి సుమంతున కిచ్చి "వాయువేగ మనోవేగంబుల మించి ప్రతాపసింహుని దుర్గమున కరిగి విజయసింహునిగూర్చియడిగి తెలిసికొని వానికీయుత్తరము స్వయముగ నందఁజేయుము." అని యాజ్ఞాపించెను. "మహాప్రసాద" మని కమ్మనందుకొని కన్నులకద్దుకొని సుమంతుఁడు వెడలిపోయెను.

ప్రభాకరుఁడు లేచి నిలువబడి "కాలచక్రమతివేగముగ దొరలుచున్నది. నరమాత్రుని కద్దాని వేగము మించుట సాధ్యమా? నా కలవర కలుగుచున్నది. ఈసామ్రాజ్యముకుటము శిరమున ధరించువాని కాశేషాహితున్న శమశక్తి యుండవలయును ఓపరమేశ్వరా! చతుర్దశ భువనసంరక్షణదీక్షాకంకణబద్ధహస్తా! నాకించుక నీదివ్యశక్తి ప్రసాదింపవే! ఆమును లీభారము నాతలపై నేలపెట్టిరో కదా!" అని తల వోయిచుండ "త్యాగశక్తి లేని ధర్మరక్తి నిష్ఫలము నీయర్ధాంగము పాపపంకిలమై దోషభరమై నిన్ను దిగలాగుచున్నది. కాని నీవు శక్తిహీనుఁడవు కావు. నిన్ను నీవు తెలిసికొనుము" అను వాక్యములు వినఁబడినట్లయ్యెను. ఆవాక్యముల నెవ్వరుచ్చరించిరి? ఎవ్వరును గంటికిఁ గనబడరు. కాని చిన్ననాఁడు పెంచిన ముసలిముని కంఠస్వరము మాత్ర మింకను చెవులయందు ప్రతిధ్వనించుచున్నటులుండెను. ప్రభాకరున కేమియు బోధపడలేదు. "అర్ధాంగము పాపపంకిలమైనదా? నాకుఁ ద్యాగశక్తి నశించినదా? ఏమిమాటలివి?" అని యాశ్చర్యముతో వితర్కించుచు వెడలిపోయెను.

---

## ౨౨

యోగిపుంగవుని యాశ్రమమునందు విజయసింహుఁడు చికిత్సలఁ బొందుచుండెను. చంద్రహాసుఁడు సోదరునికంటె నెక్కుడుగ భక్తితో నుపచారములు చేయుచుండెను.

ఒకనాటి యపరాహ్ణవేళఁ దగుపరివారము వెంటరాఁ బద్మిని గుఱ్ఱమునెక్కి యా తపోవనము చొచ్చెను. వెంటనే కూడనున్న సాయుధులగు రక్షకభటులను దండ్రికడకుఁ బంపివేసి యొంటరిగఁ బద్మిని యొక యోగినివలె నా గుహాముఖము సమీపించుచుండెను. పై నల్లలనాడుచున్న చెట్టుయాకువలె నాకన్యహృదయ మూరక కొట్టుకొనుచుండెను. "నన్ను నావిజయుఁడు మఱచిపోవునా!" అని యామె తనలోఁ దాను తలపోసికొనుచు నింతలో నిరాశ చెందుచు నింతలోఁ బట్టరానియానంద మందుచు ముందునకడుగు లిడుచుండెను. అంతలో నామె చూపు లాగుహాముఖమునందె యొకరాతిపైఁ బెట్టఁబడియున్న తన ప్రియుని శిరస్త్రాణముపైఁ బ్రసరించెను. తన పచ్చల పతక మాశిరోవేష్టనమునకుఁ గూర్పఁబడియే యుండెను. ఆహా ఆక్షణమం దామె నేత్రములు, నుదురు, కెంబెదవులు, బాహువులు వేయేల యామె భౌతిక దేహమంతయుఁ గూడ నొక్కమాఱు నకారణం బగు నానందరూపము దాల్చెనుగద! ఏమి యాప్రేమాతిశయము! అటుపైఁ బద్మినిపాదములు భూమిపై మోయుటలేదు. ఆమె పక్షివలె నెగిరి యొక్కమాఱుగ విజయసింహుని పజ్జను వ్రాలెను.

ఒక కృష్ణాజినము నేలపైఁ బరువబడి యున్నది. దానిపై మహావీరుని బలిష్ఠములగు నవయవములతో గూడిన దేహ మెక్కుడించిన కోదండమువలె నొప్పుచుండెను. అతఁడు కన్ను మూసికొని పఱుండియుండెను. ఒక దర్భాసనముపైఁ బద్మాసనము వైచికొని చంద్రహాసుఁ డా నిద్రపోవుచున్న వానిశ్వాసల లెక్కించుచుండెనో

యున సప్రమత్తుఁడై కనుపెట్టి చూచుచుఁ బక్కనించుక దూరంబుగఁ గూర్చునియుండెను. పద్మిని యిదియంతయు నొక్కత్రుటికాలముకలయఁ జూచి "కటకటా! ఎట్టి వా రెట్లుండిరి?" యని తలపోసి దుఃఖము పట్టఁజాలక యొక్కమాఱు బోరుమని బాలికవలె హాహాయెను. ఆనూతన కంఠస్వరము విని నిద్రపోవు చున్నటు లుండిన విజయుండును మేలుకొనియున్నటు లుండిన చంద్రహాసుఁడును గూడ నేక కాలమందె పద్మిని ముఖముపైఁ జూడ్కులఁబఱపి నిశ్చేష్టులై చూడఁజొచ్చిరి.

చంద్ర:—ఏమి? అమ్మా! ఇట్లేల వచ్చితివి?

పద్మి:—పనిగొని వచ్చితిని.

అని చెప్పుచు నాగుహకు నూతనకాంతిశోభ నొసంగుచుఁ దళతళ మెఱయుచుఁ గన్నుల మిరుమిట్లు గొలుపుచు మెఱుపుఁదీగవలెఁ బ్రకాశించుచున్న యా యఱువదినాలుగుమణుల రత్నహారము చేతులతోఁ బట్టుకొని నేలకు వంగి పండుకొనియున్న విజయుని కంఠమున వేయుచు "ఈ బహుమానము నంగీకరింపఁ జనదా? సార్వభౌముఁ డంపియుండెను." అని చెప్పుచుండఁ బద్మిని స్నిగ్ధసువర్ణ ఫాలము విజయుని పెదవుల మిక్కిలి సమీపించెను. ఒకవేళఁ జంద్రబింబము నరునికెంపెదవుల కందునంతటి సామీప్యమునకు వచ్చిన యెడల నద్దాని ముద్దుపెట్టుకొనని మనుజుఁ డేలోకమునం దెందైన నుండ సంభవ మగునేని యప్పుడు విజయుఁడు పద్మిని ఫాలము నప్రయత్నముగ ముద్దుపెట్టుకొనుట దోషమని చెప్పవలసి యుండును. చెప్పిన చొప్పునఁ జేసి చేరవచ్చిన పుత్రికను దండ్రిగాని, ప్రియసోదరిని సోదరుఁడుగాని యెట్టినిర్మల నిర్వికారభావముతో ముద్దు పెట్టుకొననో యట్టి నిర్మలనిర్వికారభావముతోడనే విజయుఁడు పద్మినిని ముద్దుపెట్టుకొనెను. కాని ప్రేమ యనెడి సుగంధతైలమందు నానుచున్న పద్మిని యనువర్తి చివంచుంబనరూపంబున విజయుఁడు మదనజ్యోతి ముట్టింప వెంటనే జ్యోతి నామూలాగ్రముగ వ్యాపించి వెలుఁగదొడఁగె;

కత్రీక్షణకచే బద్మిని దారము తెగినపూలసరమువలె విజయుని వక్షముపై వ్రాలిపడిపోయెను. ఇంతలోఁ దిరిగి బలము, ధైర్యము తెచ్చుకొని లేచి కూర్చుండి విజయునిముఖము రెప్పవేయక చూచుచు పప్పరనవలెఁ దోఁచుచుండెను. ఆమె నోటినుండి మాట యేమియు వెలువడకుండినను హృదయమందలి భావము మాత్రమణఁగి యుండక యుప్పొంగి ముఖముకురమందు యథారూపవర్ణములం బయల్పడఁ బ్రతిఫలించుచుండెను. చంద్రముఖి బాలారుణముఖి యగుచుండెను. కాని విజయున కాయనురాగ మాహ్లాదకరము కాదాయె!

విజ :—నీ వీప్రయానమున జాలఁ బడలి డస్సితివి కాఁబోలు. ఒక్కింత విశ్రాంతిఁ దీసికొనుచుండుము.

పద్మి :—విశ్రాంతియా! నీసరసనుండుటచే నాబడలిక లన్నియు బాయుచుండును. నీ కెడమైననే నాయలసత యధిక మగును.

అప్పుడు పద్మిని యేమిమాటలాడుచున్నదో యెఱుఁగదు. ఆనందాతిశయంబున నస్వాంబెఱుఁగక యూరక మాటలాడుచుండెను. కాని విజయున కావాక్యములు కూడ స్పష్టముగఁ దోపలేదు. కావున నతఁ డవ్వలిదిక్కు మొగంబుగాఁ దిరిగి కనుల మూసికొని నిద్రవచ్చు వఱకును నిద్ర నటింపఁజొచ్చెను.

పద్మినీచంద్రహాసు లొండొరుల కుశలంబుల గూర్చి తెలిసికొను చుండిరి. ఇంతలో యోగి యరుదెంచి విజయుని లేపుట కంగీకరింపక క్రొత్తగ వచ్చిన తన ప్రాతశిష్యురాలి కుశలంబడిగి యాగమనకారణం బెఱింగి యాకన్య యుండుటకు యోగ్యమైన యొక చిన్న రాతిగుహ జూపించెను. దానిముఖ మంతయు మల్లికామాలతీలతలతో నలంకరింపఁబడినటుల గప్పబడి కనులఁ బండువొనర్చుచుండెను.

యోగి :—చిట్టితల్లీ! నీవీదుంపలను బాగుగా నీటియందుడికింపఁగలవా? విజయున కీ హారమువలన మాంసము పట్టును. గాయము పూడును.

పద్మి :—తప్పక వండెదను. ఎప్పటికిఁ గావలెను?

రోగి:—రెండున్నరగడియలలో. (అని చెప్పి యావలకు వచ్చుచుండెను.)

పద్మి:—అయ్యో! అడుగ మఱచితిని. (అని యనుకొని వెంటనే పరుగుపరుగున వచ్చి) స్వామీ! ఎన్నినీళ్ళు పోయవలెను!

అప్పు డొకవింతనగవు మోముపై తొలకాడ నాయోగి వెనుకకుఁ దిరిగివచ్చి యాదుంపపైఁ బొట్టు తీయుపద్ధతియుఁ దరుగు క్రమమును, చితుకులతో మంటచేయు విధానము, పోయవలసిన నీటి పరిమితి, ఉడకనీయవలసిన కాలనిర్ణయము చెప్పి వెడలిపోయెను. మును పద్మిని సంగీతశాస్త్ర మభ్యసించువేళ నుపదేశమాత్రంబుననే యాకళ యంతయు పూర్తిగ గ్రహించెను. నేఁడును బాకశాస్త్రమందు గురువు మొదటిపాఠము చెప్పిపోయెను. తన్మాత్రంబుననే యాకన్య యీనూతనశాస్త్రమును కూడ నామూలాగ్రంబుగ నూహించుకొనుచుండెను. తన హృదయమందు నూతనముగ వికసించిన ప్రేమ కూడ నాయూహ కొనలు సాగఁదొడఁగుచుండెను. కాని మొదట పాలు మంటచేయునపుడును—పాయిమీది పాత్ర క్రిందకు దింపునపుడును లేఁజిగురులఁబోలు పద్మిని లేతవ్రేళ్ళించుక కాలి యింకను నెరుపులెక్కినవి.

పద్మిని వంటచేసి గొనిపోయి విజయునకు పథ్యము పెట్టుచుండెను. తదనంతరము నిద్రరాకుండునటుల రోగి పజ్జకూర్చుండి యేమేని మాటలఁ జెప్పుచు మాటల నడుమ నప్పుడప్పుడు కలస్వనంబుతో నొక్కొకపాట పాడుచు దినమునందెనిమిదిజాములు జరుగుచున్నటులావిజయునకుఁ దోఁపనీయకుండెను. చెల్లెలు వచ్చిన తరువాత చంద్రహాసునకుఁ గూడఁ గ్రమాక్రమముగఁ బని లేకపోవుచుండెను. అన్ని యుపచారములు పద్మినియే చేయఁబూనెను. అడ్డువచ్చినచో సోదరునిపై కినియుచుండును. విజయుఁడు వ్రణబాధితుఁడై యున్నవేళలనైనను పద్మిని వచ్చుచున్న యలుకుడైనంతనే వానిహృదయము ఘూర్ణమానమాన

మనమున కానందము గలుగునటుల సంతోషముతోఁ దాండవమాడుచుండును. కాని యాబాలిక పథ్యపానముల పచనము చేయుటకై లేచినంతనే వానికన్నులామె వదనముపై దీనముగ వ్రాలుచుండును. “ఇంత నెన్నడును నే నపవిత్రుఁడ కాజనదు. ఇప్పుడు నే నపవిత్రుఁడనై యుంటిని—ఈమె నన్ను పూతునిఁ గావించినది.” అని యనుకొనుచుండును. మిక్కిలి బాధగా నున్నప్పుడు విజయుఁ డాకన్య దివ్యగానలహరియందు మునిగి తేలుచుఁ దన బాధను మఱచిపోవుచుండును—మిక్కిలి విసుగుగా నున్నప్పు డాపద్మిని సుందరవిగ్రహమును రెప్ప వేయక చూచుచు “విశ్వమండలి సౌందర్యమున కెల్ల నిది కేంద్ర స్థానమా!” యని తర్కించుకొనుచుండును. శరీరములో నించుక సుఖముగా నున్నప్పు డామెతో నించుక ముచ్చటించుచుండును. ఒకమాఱు పద్మినీవిజయుల కిటుల సంభాషణ జరుగుచుండెను.

విజయు :—మీయింట నీ వెన్నఁడైన వండుదువా?

పద్మి :—అవసరము వచ్చినపు డాఁడుది వంటచేసి పెట్టవలదా!

విజయు :—రాత్రులు నీకు పాపము నిద్రకూడ లేనటులున్నది మిక్కిలి చిక్కిపోవుచుంటివి నాకొఱకు కాని నేను—

ఇంతలో యోగిపుంగవుఁడు వచ్చెను. పద్మిని లేచి నిలువఁబడి వినయముతో నమస్కరించెను. విజయుఁడును లేవబోవుచుండెను.

యోగి :—ఆహా! అప్పుడె యంతవఱకుఁ గుదిరినదా?

పద్మి :—మహాత్మా! ఇది తమ భిక్ష.

విజయు :—మి మ్మేమని కొనియాడుటకు నే నసమర్థుఁడను! అల్పుఁడను, కించిజ్జ్ఞుఁడను. మెఱుఁగుడుపురుగు సూర్యభగవాను నేమని స్తుతింపఁగలదు?—ప్రాణదాతా—నమస్కారము—ఈపాపిని దీనుని యనుగ్రహించి యాశీర్వదింపుఁడు!

యోగి :—వత్సా! విజయా! నిన్ను బ్రతికించినది నా చికిత్స కాదు—నిజము చెప్పుచుంటిని. ఆకర్ణింపుము—ఈకన్యయొనర్చిన సపర్య!

నీ వీజన్మమునఁ జేసికొన్న పుణ్యము కాదు. నీపూర్వజన్మ పరంపరాగత పుణ్యఫల విశేషమువలన లభించినది! ఈనాఁడు నిన్ను సావిత్రివలె మృత్యువు వాతనుండి యీవలకుఁదెచ్చి బ్రతికించినది. ఈమె ఋణ మీజన్మమునఁ దీర్చుకొనఁజాలవు!

విజయ:—ఆమె కోరినకోరిక తీర్చి, నాఋణము తీర్చుకొనఁ బ్రయత్నింతును.

పద్మి:—నాకే ఋణపడియున్న యెడల, నామాటచేతనే ఋణవిముక్తులై పోయిరి. కల్పవృక్షము నీడ నాశ్రయించినఁ గోరికలే యుండవుగదా?

యోగి:—వత్సా! కనిపెట్టుచుంటివా? మహాపతివ్రతలగు నుత్తమసతుల లక్షణము బోధపడుచున్నదా?

[పద్మిని తన్ను పొగడువాక్యము వినినంతనె మిక్కిలి సిగ్గుపడి సంకుచితగాత్రియై యటనుండి వెడలిపోయెను.]

యోగి:— పుత్రవాత్సల్యంబున నేను నీకొక్క హితంబు చెప్పెద. గ్రహింపుము.

ఒకఁ డత్యంతమధురం బగుసురాపానము గావించుచుండెను. ఇప్పుడు వానిరెండవచేత సుధాకలశ ముంచఁబడినది. ఒకచేత సుర యున్నది. ఒకచేత సుధ యున్నది. వాఁడు దేనిని గ్రహించి దేనిని త్యజించిన శ్రేయోదాయకమగునో, అవిచ్ఛిన్నానందము కలుగునో యాలోచింపుము!—వచ్చినపని, పద్మిని యెక్కడ? నేఁడు నీకు బత్యము మార్పవలయును. శ్రోత్రవంట లామికు బోధింపవలెను. నేపోయి వచ్చెద—

అని చెప్పి యోగి వెడలిపోయెను. విజయుఁ డాలోచనా మగ్న మానసుఁడై కనుల మూసికొనెను. వాని హృదయమునఁ బాపభీతి మిక్కుటమై యాందోళనఁ గలిగించుచుండెను. ఊయల నూఁగుచున్న వాని భావముల నిలిపి నేకాగ్రచిత్తముతో నొక్క మనోనిశ్చయము

జేసికొనుటకు వానికి శక్తిఁ జాలకున్నది. దేహబలమును మనోబలము కొండొకటిపై నాధారపడియే యుండును గాఁబోలు! స్వర్గశిఖర నరకకూపములమధ్య నజ్ఞాత లూఁగి యలసినవాని మనసు స్తబ్ధ మయ్యెను. హృదయము వేదనయి మందగతి నందెను. శరీరము నిశ్చైతన్యము దాల్చెను. విజయుఁడు సొమ్మసిల్లి నిద్రపోవుచుండెను.

అహా! పద్మినియే తొలుత విజయునిదృక్పథము నలంకరించుట తటస్థించనేని పాప మావీరుని కీలోకమును పైలోకమును మఱియొక లోకముగా మార్చివేయఁగల్గి యుండునుగదా!

ఇట్టిభావమే యానందించు రోగి హృదయమందును గలుగుచున్నది కాఁబోలును—విధి! విధి! విధి!—అని విజయుఁడు పలవరింపఁ జొచ్చెను.

పద్మిని పథ్యపానములఁ గొనివచ్చి ప్రక్కను నిలిచి యుండెను. కాని యామె కావలసినంత యేమియు బోధపడుటలేదు. ఇంచుక భయముకూడఁ గలుగఁజొచ్చెను. వారిని పిలుచుకొని వత్తునా!—యోగసమాధి నున్నవారిని లేపు టెట్లు? అనుకొని తన కోమలపాణిపద్మ మావిజయుని విశాలఫాలభాగమున నునిచెను. ఉలికిపడి కనుల విచ్చి నిర్మలప్రేమకాంతిపూరంబగు పద్మిని మొగ్గము చూచి తిరిగి కనుల మూసికొనెను. "ఏమిది! అని పద్మిని మిక్కిలి విషాదముతోఁ గూడిన నాశ్చర్యము నొందఁజొచ్చెను.

పద్మి:—మహావీరాగ్రణీ! పథ్యము తీసికొని వచ్చితిని.

విజయు:—నా కిప్పుడాకలి లేదు.

పద్మి:—ఒకసారి యిటు చూడుము. నేఁడు వేళాకోళముగ నున్నటులున్నది. కారణము తెలియదు. మహాత్మునిఁ బిలిచికొని వత్తునా?

విజయు:—వలదు.

పద్మి:—కొంచెమైనను నాఁకలి లేదా?

విజయ :—హృదయరంజనీ! నిన్ను శ్రమపెట్టఁజాలను. నే ద్రోహినిగాను. క్షమింపుము.

విజయుఁడు నిద్రించుచుండెనా? మేల్కొనియుండెనా? పలవరించుచుండెనా? మాటలాడుచుండెనా? పద్మిని కేమియు బోధపడదాయెె!

పద్మి :—పరాకుమాటలు వచ్చుచున్నవి. వనమూధిమండి లేచివేళ కాదాయె. సోదరుఁడు మూలికలకొఱకై కడు దవ్వరిగియుండెను. ఏమి సేతును దైవమా!

అని విజయుని రెండుచేతులు దన చేతులఁ బట్టుకొని "లెండు ఒకమాఱు లెండు" అనెను.

విజయ :—పొమ్ము!— పిశాచమా! రంజనీ!—రమ్ము! పద్మినీ!

అని చేతుల విసరికొట్టెను. విజయుని దక్షిణహస్తము పద్మిని వక్షముపై గాఢముగఁ దగిలెను. పాపమా యబల రెండుమూఁడడుగులు వెనుకకుఁ ద్రుళ్లిపడెను. కాని విజయుఁడు శాంతిభావముతోఁ లేచి కూర్చుండి "నాపై నీకంత కోపమేల! రమ్ము. పద్మినీ! రమ్ము! దగ్గఱకు రమ్ము! రోగి సికు నూతనపాకముల నేర్పెనఁట కాదా. ఏవి! ఏమి తెచ్చితివి" అని ప్రియముగాఁ బల్కెను. పద్మిని కామాటలచేతనే తనవక్షమందలి బాధ యుపశమింపబడెను. తలవంచుకొని సిగ్గుపడుచు దగ్గఱకువచ్చి భక్ష్యముల నొక్కటొకటిగ రోగిచేత బెట్టుచు దానివండు విధానమందలి యానందమును వర్ణించి చెప్పుచు వనవాసుల సౌఖ్యమే సౌఖ్యమని సిద్ధాంతము చేయుచుండెను. కాని వండునప్పుడు తాఁబడినశ్రమ యించుకైనను దలపెట్టదుగద! విజయసాన్నిధ్యమహిమంబున మఱచిపోయెను గాఁబోలు!

విజయ :—నీకు వనవాసమే సౌఖ్యముగఁ దోఁచుచున్నదా! ఒకనాఁడు సీతకు నటులనే తోఁచెను.

పద్మి :—నిజమె! సీతమ్మకు నరిగనె తోఁచినది-పిదప శ్రీరామచంద్రుఁడె యెక్కువగఁ బశ్చాత్తాపపడి పరితపించెను. లోకమాత సీత

హృదయేశ్వరుని పాదకమలముల మనసార పూజించుచు నడవులందును నిండుమనముతోడనే దినముల గడుపఁజొచ్చెను. వీరాగ్రణీ! అదియే కదా! స్త్రీ గాఢ రతిశయంబు—దివ్యభూషణంబు—విపత్కవచంబు. తోడికలతో దూడ కుమ్ముచున్నప్పుడే యావు పాలనెక్కువ చేపుచుకొనును.

విజ:—పురుషుఁడు ప్రేమింపకపోయినను స్త్రీ ప్రేమించుచుండఁ గలదా?

పద్మి:—తలవంచుకొని యూరకుండెను

విజ:—నీస్నేహితునికడ దాపరికమేల? తెలియఁజాలని వాఁడ నగుట నడుగుచుంటిని.

పద్మి:—క—ల—ను. దివ్యప్రేమ నాస్తికుని వెలిపెట్టుచున్నదా? జలము వానిదప్పిఁ దీర్చుచున్నది. ఫలము వాని యాకలి తీర్చుచున్నది. అదియే ప్రేమయొక్క యతిశయము!

విజ:—"ఈముగ్ధ పుస్తకమందు చదివినపాఠము నప్పగించుచున్నది." అని యనుకొనుచుండెను.

పద్మి:—నేఁడు నిద్రలో నేమని కలవచ్చినది? "నిధి—నిధి—నిధి" యని పలవరించితి రేమి?

విజ:—నేను కలలో—కోకఁడు సుగంధమధురప్రస్రావనము గ్రోలుచున్నాఁడు—వానికి బాగుగఁ గైపెక్కినది. వానిచేతి నమృతకలశ ముంచఁబడినది. వాఁడొడలెఱుఁగక యానధారాలశము వంచి వేయుచుండెను. సుధాధార, ప్రేయసి బాష్పబిందువులవలె, వానిపాదములఁ దడుపుచుండెను. వానిచుట్టును మానససరోవరమువలె నిండి పైకిఁ బొరలుచుండెను. కాని వానిదేహములోని కొక్కబిందువైనను ప్రవేశింపలేదాయె. వాఁడాయమృతసరోవరము నడుమ స్తంభమువలె నిలిచి యింకను తుచ్ఛమద్యమునే పానము చేయుచుండెను. పానము చేసినకొలఁదియుఁ బిపాస యధికమగుచునే యుండెను. అధికమయిన

కొలఁదిని పానము చేయుచుండెను—కాని తుదకు శక్తిహీనతో దప్పిచనిపోయెను. వానిచేతి మద్యభాండము క్రిందకుజారి సరోవరమునం దదృశ్యమాయెను. ఆదురదృష్టవంతుని మృతకళేబర మాయమృతసరోవరమునందు తేలియాడుచుండెను. తుద కమృతసరసితరంగహస్తములలో మృతకళేబరము నర్తించుచుండెను. వానికళేబరమును సాష్టాంగపడి సరోవరలక్ష్మికి మ్రొక్కుచుండెను. విధి! విధి! విధి!—మఱేమందురు?

పద్మిని యనిమిషనేత్రియై యాచిత్రస్వప్నవృత్తాంత మాలించుచుండెను. ఇంతలోఁ జంద్రహాసుఁడు వనమూలికలఁ బట్టుకొనివచ్చెను. అతనిఁ జూడగనే విజయునకెంతయో హృదయభారము తగ్గినటులఁ దోచి యొక్క నిట్టూర్పువిడిచెను. పద్మిని కప్పటికి సోదరాగమనము మిక్కిలి యనవ్యాప్తి యనిష్టమై పొడఁగట్ట నొక్క నిట్టూర్పు విడిచెను.

చంద్ర:—ఇవిగో మూలికలు.

పద్మి:—యోగివుంగవుని—

విజయ:—ఇప్పుడు పిలువనక్కఱలేదు. సోదరా! నీకెంత శ్రమకలిగినది. ఏమడవికిఁ బోతివి? చాలతడవాగితివి!

చంద్ర:—వారరుగో గురువు లిటులనే విచ్చేయుచుండిరి.

తెల్లని వ్రేలుజడలతో, విభూతిరేఖల నొప్పు నత్తగు విశాలఫాలములో, మడచి ముడివెట్టిన తెల్లగడ్డముతో, జిక్కి యించుక ముడతలు పడుచున్న బడుగు దేహముతో—దీర్ఘనాసికాగ్రమున నిలిచిన దృష్టితో మునిశ్రేష్ఠుఁ డరుదెంచెను. అందఱును లేచి నమస్కరించిరి.

యోగి:—శుభమగుగాత! వత్సా! చంద్రా! యోషధులఁ గొనివచ్చితివా?

చంద్ర:—చిత్తము! దేవా—

యోగి:—అమ్మా! పద్మినీ—నీ వావేరును నమలనిచ్చి పిదప నావుపాలను దాహమిమ్ము. విజయుఁడు విజయునిమించి వజ్ర

శరీరుఁడు కాఁగలఁడు — విజయసింహా! చాల దినములైనది. నీకుఁ గ్రమముగఁ శ్రోత్రరక్తము పట్టును. పూర్ణారోగ్య మచిరకాలముననే కలుగఁగలదు—ఇఁక నా చికిత్స లవసరము లేదు. మీరు మీ మీ నగరముల కరుగవచ్చును.

పద్మ :— తండ్రీ! మీ యవ్యాజకరుణావిశేషంబున మేము బ్రతికి బయటఁ బడితిమి.

చంద్ర :— లోకమునే తరింపఁజేయఁగలవారల కిది యొక లెక్క కాదు.

విజయ :—నాతండ్రి నాచిన్ననాటనె యవనునితోఁ బోరుచు మరణించెనఁట—నాతల్లియుఁ దోడనే సతీధర్మమును సహగమనము గావించి నాథుని వెన్నంటి చని స్వర్గస్థురాలాయెను. నాటనుండియు నే నేకాకినై తిరుగుచుంటిని. కాని నేఁడు నే నిచ్చట తిరిగి యింటి పట్టున నున్నటులను దల్లిదండ్రులఁ గన్నటులను సుఖించుచుంటిని. నాకుఁ దల్లియుఁ, దండ్రియు, నా పుత్రులు, బంధువులు, సమస్తము మహాత్మా! తమ కరుణాకటాక్షమే ప్రసాదించినటు లున్నది. ఈగుహ వీడి తిరిగి రాజధానిఁ జేరుట చక్కని గృహసౌఖ్యము వీడి కారడవిఁ జొచ్చుటవలె నున్నదికదా! దేవా! తమదయనుగూర్చి నే నేమని వర్ణింపఁగలను?

యోగి :—కుమారా! సుఖదుఃఖములు మనస్సంభవములు—నీజీవితయానపాత్ర యొక్క తెడ్డుతోడనే యీడిపింపఁ బడుచున్నది. కావుననే యది వక్రగతి నందుచున్నది—కేవలవైరాగ్యమె నిజమగు బ్రహ్మజ్ఞానమని తలఁచుట కన్నులమూసికొని లోకము లేదనుకొనుట వంటిది. కావున నీవు గృహస్థాశ్రమము స్వీకరింపుము.

విజయ :—మహాత్మా! ఈలోకమున నింకను నే ననుభవింపవలసిన సుఖము లేమున్నవి?

యోగి :— లోకములో ననుభవింపవలసిన సుఖములకొఱకు మాత్రమె గృహస్థాశ్రమము స్వీకరింతు రనుకొంటివా? ప్రతివ్యక్తియు

లోకమువలన సంఘమువలననే జీవించి వికసించుచున్నది. కావున నీ ప్రతివ్యక్తియు దనసంఘమును లోకమును వికసింపఁజేయుచుఁ గల కాలము జీవింపఁ జేయువలయును. మఱియు సహిష్ణుత, సానుభూతి, త్యాగముఁ జిత్తమున నేకాగ్రత, హృదయమునకు స్థైర్యము, అంతఃకరణమునకుఁ బ్రేమ సరియగురీతుల నలవడుటకు గృహస్థాశ్రమ స్వీకారము ముఖ్యావసరము. తీరముఁ గూర్చుండి యీదు విధానము, జలముస్వభావము చదువుకొనినను గురుముఖతః నేర్చుకొనినను నీటఁ బడినఁగాని యీఁత రాఁజాలదు. కావున కుమారా! నా హిత మనువర్తింపుము. దేశము నుద్ధరింపుము. శాశ్వతకీర్తి గడింపుము.

ఒక్కొక్కరుగ నందఱు నా యోగిపుంగవుని పాదములకు మ్రొక్కి దీవనలఁ బడసి యచ్చోటు వాసి ప్రతాపసింహాంగణమునకు బయలుదేరిరి.

వారు వెడలిన వెనుక యాగృహమందు మిగిలియున్న నిశ్శబ్దము యోగిపుంగవుని హృదయమునఁ గూడఁ దట్టక మానదాయె.

## ౨౩

హస్తినాపురమునందు నేటి మధ్యాహ్నము సూర్య డతితీక్ష్ణముగా వెలుఁగుచుండెను. పురవీధులఁ గన్నెత్తిచూడ శక్యముకాని యెండ కాయుచున్నది. కాని రంజనీదేవి యంతఃపురము, నగరమాధ్యమునుండి ప్రవహించుచు మలుపుతిరిగిన యమునవంపులో స్ఫటికశిలానిర్మితమై ప్రకాశించుచుండెను. మేడపై యమునవైపు గదిలో రంజని గూర్చుని యుండెను. గవాక్షములకును ద్వారములకును సుగంధముల వెదఁజల్లుచుండిన వట్టివేరుతడకలఁ గట్టి పన్నీటితోఁ దడుపుచుండిరి. అగరు అత్తరువులతోఁ దీసిన మలయచందనము బంగరుగిన్నెలోఁ జేర్చి పరిచారికలు వచ్చి రంజనికి మైపూతలు పెట్టుచుండిరి. రత్నముల జెక్కిన దంతపుపిడులుగల నెమలిపీవనలఁ బూని యిరువైపుల నిలిచి

మృదువుగ వినబడుచుండెను. ఆలేఁగరువలి తాఁకున నామె మోముపై నందమగు ముంగురులు నిట్టట్టు నడియాడుచు నింపుగ నభ్యమైనట్టులున్న యాయువతి సౌందర్యము తిరిగి ప్రజ్వలింపఁ జొచ్చెను. దూరమందు కూర్చుని సారంగము చేబూని నెచ్చెలి రత్నకర్తు మోహనరాగ మాలాపించుచు రాధాకృష్ణసంవాదము గానము చేయుచుండెను. ఆగాన మాలించుచునే రంజని మనసు విజయునితో సంవాదము చేయుచుండెను. ఇంతలో కమలాకాంతుని భార్య ప్రవేశించి సరసను గూర్చుండెను.

రంజ:— వసుమతీ! ఏమివిశేషములు? చాల యెండలో వచ్చితివి? అట్లుఁ జూచుచుంటి వేమి?

వసు:— ఏమున్నది. అసలాజాతి యట్టిది. మగవారి నెన్నటికిని నమ్మరాదు.

రంజ:— అయ్యో! అట్లనెద వేమి? పురుషుని నమ్మక స్త్రీ యేమి చేయఁగలదు.

వసు:— నమ్మి చెరుపుటకంటె నమ్మక చెరుపుట మేలు కాదమ్మా! తల్లీ యిటులైన నంతిపచార ముండదుగద దేవి! ఏమనఁ దుదకు పురుషు లెప్పటికిని మోసగాండ్రె.

రంజ:— వసుమతీ! నేఁడేమి నీవలన నిజముగ వింతలు వినబడుచున్నవి.

వసు:— నేనొక్కతెనే గా! అందఱదే మాట? లోకమంతయు నొక్కటేఁ గాఁ గోడై కూయుచున్నది. మాయ మాకుడు లేకున్నది. నిజముగా నట్టి దెంతదురదృష్టము తల్లీ! ఎంత సిరుపేదయైన నట్టి పరాభవము వహింపఁగలదా! కటకటా! దురాత్ముఁడు!

రంజ:— ఎవరు?

వసు:— మఱెవరు?— మహావీరాగ్రణి— అగ్రగణ్యశిరోమణి. విజయచంద్రుఁడు— కాదు కాదు. విజయసింహుఁడు.

రంజ:—(తల పంకించుచు) ఏమిచేసెను?

వసు:—పద్మినిం బ్రేమించెను. వివాహమాడి మరలివచ్చునంట. నగరమునకుం బద్మినియును నెవరనుకొనుచుంటివి! దేవలోకమునుండి దిగివచ్చిన యువ్వనకాదు. ఒక పేదవాని కడగొట్టుంగూతురు. వయసున విజయునకును గూతుంవలెనే దోంచుచుండు నంట! ఎవరు చెప్పి రందువా—మరలి మావారు చూచి వచ్చిరంట కన్నులార.

రంజ:—కమలాకాంతుం డీనడుమ కొలంవునకు వచ్చుట లేదేమి?

వసు:—(స్వగతము) నామాట లీమెచెవులకు వినంబడుట లేదా యేమి! (ప్రకాశము) ఆయనకు దేహమున నేమో స్థిమితము లేకుండ నున్నది. రాత్రియనక పగలనక వానికొఱకు దీక్షగ వెదకి వచ్చినప్పటినుండియు నటులనే యేదో యొక బడలిక—తుదకాపిల్ల పుణ్యమాయని మణిహారము పుచ్చుకొని ప్రియుని కందంజేయుట కంగీకరించినది. కాని లేనిచో నింక నెంతచేసి యుండెడిదో!

రంజ:—పాపము—చాల శ్రమపడిరి! నేఁడు కొండ శైత్యము మిక్కిలి యెక్కువగ నున్నటులున్నది. చల్లగం గూర్చున్న దానను నాకే శిర ముడిగిపోవుచున్నది. ఈమంచువేసవిని మీ దేశములో జబ్బుగా నున్నవారి కెటులుండును నీవుకూడ నిటువచ్చితివి!

వసు:—లేదు. పోయివచ్చెద.

అని రాణికడ సెలవు పుచ్చుకొని తిరిగి వెడలుచుండగా వసుమతి మోము ఓడిపోయినదానివలె వెలవెలబోవుచుండెను. రంజని మోము పందెము నెగ్గినటులం గాంత్యతిశయముతోం బ్రకాశించుచుండెను. ఆమె నేత్రాంచలములనుండి రాజదర్పము ప్రవహించుచుండెను. వివిధసుగంధసుందరపుష్పమాలాలంకృతంబగు కేశపాశ మల్లలనాడం దల పంకించుచు "గ్రుడ్డువచ్చి పిల్లను భ్రమింపంజేయునంట!" అని తలపోయుచుండెను.

ఇంతలో రాజసింహునితల్లి దుర్గాంబ యతివేగముగఁ బ్రవేశించి—

దుర్గా:—అమ్మా రంజనీ! ఇంకను విజయసింహుఁడు రాలేదే యమ్మా! ఎప్పుడు వచ్చునో నీకేమైనఁ దెలిసినదా? యువనులు గూఢ మార్గముల దేశమునఁ బ్రవేశించుచు న్నారఁట. ఇప్పుడేమి పెండ్లి యా— పేరంటమా—ఇంత యత్యవసరపు సమయమునఁ బోయి క్షత్రియుఁడు వనవిహారములు చేయుచుండునా? విజయసింహుఁ డట్టి త్రోవలఁ బోవు వాఁడును గాడు. ఏమనుకొనుటకుఁ దెలియకున్నది.

రంజ:—అవ్వగారు? అయ్యో మీరింకను వినలేదా—మన విజయసింహుఁడు పద్మిని యను నొకచక్కని రాచకన్యకను వలచి వివాహమాడనున్నాఁడు. అందఱకును దెలిసినదే-మీరింకను మాఱు ప్రోవనె యున్నటు లున్నది. వానికి మొన్న కురురంగమున బలమగు గాయము తగిలినదఁట— ఒకయోగి గుహయందు చికిత్స జరుగుచున్న దఁట—బహుశ, పద్మినియు నచ్చట నేయుఁడి ప్రియునకుపచారములు చేయుచుండును. కాని వానికింకను నీయవసరమునన్నా హాము గూర్చి తెలిసి యుండకపోవచ్చును. మొన్ననే మహారాజుగారు వానికి వార్త నంపిరి. ఈపాటికి వచ్చుచునే యుండును. ఇంతకును విజయుఁడు దృష్ట వంతుఁడు. మొన్న మహారాజుగా రీసంగతియే పలుమాఱు చెప్పుచు నెంతయో యానందించిరి. రంజని యిటుచెప్పుచుండగా దుర్గాంబ మోమింపుక చిన్నబోయి యవ్వలిదిక్కు- తిరిగినది.

దుర్గా:—నీవు గొప్ప ఔదార్యవతివి!

రంజ:—అవ్వగారూ! నేచిన్నదానను. తమువంటి పెద్దలకడ! నేర్చుకొనవలసినదానను.

దుర్గా:—దేవీ! అట్లనఁబోకుం. వయసునం దేమున్నది? యవన సామ్రాట్టుకూఁతురువు. సామంతదేశమునుండి బందీకృతుఁడై వచ్చిన యొక యార్యునియందు గుణమునే ప్రధానముగ గణించి యస్య

విషయంబుల నరకుఁగొనక వానివరించి వివాహమాడితివి. అట్టి విచక్షణాశ, పాలను నీరును రాజహంసవలె విడదీసి పాలనే గ్రోలగల నేర్పు స్వభావము, కొంగలకు గాని చిలుకలకు గాని కలుగునా?

రంజ:—అట్టి సంఘటనములు విధినిర్ణీతము లని మీరుమాత్ర మెరుఁగరా— వాత్సల్యాతిశయంబున నూరక యనియెదరుగాని.

దుర్గా:—దేవి! నే పోయి వచ్చెదను. సల్లాపములకిది సమయము కాదుగద!

రంజ:—నిజమే—అవ్వగారు దయయుంచవలెను. దుర్గాంబ మాయురఁ జాయుసగిపు తోలుకాడుచున్నటుల నున్నదే గాని నిజముగా నా హృదయమును దట్టి యానంద మున్నటులఁ దోఁచదు. సంకల్పించుకొనిన కార్యము కొనసాగలేదుకదా యని యోచిం తలపోసికొనుచు ప్రౌఢ గావున నాభావముపై కగంబడ నీయకుండ సాధ్యమగు ప్రయత్నమెల్లఁ జేయుచు రంజని కురులఁ జక్కఁజేయుచు "ఎంతిమాట" యని ప్రత్యుత్తరమిచ్చి వెడలిపోయెను.

రంజ:—ఎంతటి నేర్పరి! ప్రగల్భ! ముసలినక్క........ కాని, మానవుల కిటురులకిష్టములఁ జూచి యానందించవలె నన్న కోరిక యెంతక్రూరమైనది! క్రూరమే కాదు నీచమైనది! కాని యట్టియభిలాష సహజము కావలయు. నిన్న సిందిర! మొన్న శ్యామల! ఏమిది! అందఱకు నిదియొక వేడుకవలె నున్నది........ అహా! దైవమా! నన్నెంతచులకన చేసితివి.—వీరలందఱకీ రంజనని వినోదస్థానముగ పరిహాసనియముగఁ జేసితివా! కటకటా! దైవమును దూఱి యేమిప్రయోజనము!—నన్నే నిందించుకొనవలయు. అనూయ గాని వలలో నన్నెవ్వరైనఁ బడుమని సలహానిచ్చిరా? ఇందిర గాని, వసుమతి గాని నన్ని రెండునాలుకలవాని బంధమునఁ జిక్కుమని హెచ్చరించిరా; వారును పాపము నిర్దోషులె. విజయా! ద్రోహీ!

హారమువల్ల నేమి! (మూర్ఛ)! పద్మిని వేసినహారము కంఠమునకు బిగువైనదా? హా! హా! దుస్సహము! దుస్సహము!

రంజ :—కటకటా! నే నిటుల రాణి నేల నైతినో గదా! అట్లయిన నేల? పగదీర్చుకొనుటకు నాస్థితియే మిక్కిలి యుపకరింపఁ గలదు......

ప్రభాకరుఁడు మందిరమునఁ బ్రవేశించినను, రంజని నిర్లక్ష్యముగ పరధ్యానముతోఁ జూచుచుండెను. ప్రభాకరుఁ డామెను సమీపించి, “ప్రేయసీ! ఆ సుమధురగానము గ్రోలుచుంటివా? గాయకిని సామీప్యమునకే రప్పింపరాదా?

రంజ :—సంగీతమునకు దూరశ్రవణమె మేలుగదా యని.

ప్రభు :—ఏమి యీపాడుచున్నది!...కంఠ మెంతశ్రావ్యముగ నున్నది. గానము మిక్కిలి మధురమై—హృదయాహ్లాదకరమై మనోక్లేశముల నెల్ల నపనయింప నమృతవాహినియై యొప్పుచుండును గదా? కలకాలము మన మీగానలహరిలోఁ దేలియాడుచు, ప్రేమ నాకయుం దాసీనులమై యానందవనముల విహరించుచు......కాని, దేవీ! రాజుల కట్టియదృష్ట మబ్బదుగద! మేదరవాఁడు, నిప్పులు చెరుగుచున్న మండువేసవిలో నేటికొడ్డున పెద్దమఱ్ఱినీడను, దడకలల్లుచు నూడలకానుకొని యెంత సౌఖ్యముగ, నిశ్చింతముగఁ బండుకొనుచుండెను! సంసారికిఁ దనసంసార మొకటియే కాని దేశమందలి సంసారముల బాధ్యత నెల్ల దనదిగా భావించి. రాజు రాజ్యమేలవలయు—ఎంత భారము!

రంజ :—(స్వగతముగ) నాథా! నీరాజ్యశ్రమము భారముగనే తోఁచుచున్నది (ప్రకాశముగా) ఆర్యపుత్రా! మనమాభార మొకసారి వహింప సమకట్టినపుడు, తుదివఱకు నిర్వహించియే తీరవలయును.

ప్రభా—అర్ధాంగీ! ఈనడుమ నీ వస్వస్థవై యుంటవు—మన విజయుఁడును జెంతలేకపోవుటయు,—నేను రెండురెక్కలాడని

పక్షివలె యేమో, నిన్నుబోయునివలె నుంటిని. ఇప్పుడే నీతండ్రియు మన యార్యావర్తముపైఁ గత్తిగట్టి, దాడివచ్చుచున్నాఁడు. ఇదివఱలో మన ప్రజలు పరరాజాక్రమణమునఁ గ్రుంగి, యిప్పుడిపుడే స్వేచ్ఛావాయువుల పీల్చికొని యించుక నేరఁదేరి నేఁడొకజాతివారయి తల యెత్తికొన మొదలిడుచుండిరి. ఇంతలో తిరిగి యుద్ధము—రక్తపాతము—జనక్షయము— సస్యశూన్యత— క్షామము— కట్టెదుట ఘోరాకృతుల నిల్చి తాండవ మాడుచున్నవి."

ఇట్లు చెప్పుచు ప్రభాకరుఁడు రంజనిచేతులఁ దనచేతులఁ బట్టుకొని "అందును ముఖ్యముగ మామగారితో—నీతండ్రితోఁ గత్తికలుపుట నాకెంతమాత్రము సంభావ్యముగఁ గన్పట్టుటలేదు. రాయబారిచే నీవంపిన యుత్తరము—నావినయపూర్వక సందేశము వారిని మన యెడలఁ బ్రసన్నులచేయు ననియే తలఁచియుంటిని. కాని యిప్పుడేమి చేయుటకును దోఁచకున్నది.

రంజ:—సామంతులకు రాణుల వెంటఁ గొనిరమ్మని యాజ్ఞాపించలేదా?

ప్రభా:—వ్రాసితిని. కొందరింతకు మున్నే వచ్చియుండిరి. తక్కినవారును వచ్చుచున్నటుల వార్తలరుదెంచినవి.

రంజ:—నాసికిఁ గూడ వార్తనంపలేదా?

ప్రభా:—విజయునకు సుమంతునిచే వార్తనంపితిని. కాని యుద్ధమే నిశ్చయమా? వేఱుసాధనము లేదా? అవిధము లెవ్వియుఁ బ్రయోజనకారులు కావాలవా యని తలపోయుచుంటిని.

రంజ:—సామంతరాజులయందు రణకౌతూహలము సన్నగించినదా?

ప్రభా:—లేదు.

రంజ:—అయినచో యుద్ధమునకు వెనుదీయకుఁడు.

ప్రభా:—ఆప్తులతోడపోరు—

రంజ:—దండెత్తివచ్చినవా రావు, లెట్లగుదురు? అట్టివానితో రాయబారములు నలుపఁబూనిన మనము జంకితి మని తలపరా? అది భరతవర్షమునకుఁ గళంకమై నిలువదా?

ప్రభా:—కలసి యోజింపఁదగిన వాఁడు విజయసింహుఁ డింకను రాఁడాయె—

రంజ:—నాయిష్టము యుద్ధము. మన మింక సంసిద్ధులమై యుంటిమేని, కాలహరణము కొఱకు కొన్ని రాయబారముల నడుప వచ్చును. నేనొకజాబు—కావలెనన్న—వ్రాసి పంపెదను. మీరును దగు రాయబారులఁ గూర్చి మన దేశ గౌరవమునకు భంగములేనిరీతిని గొంత వాద ప్రతివాదములు నలుపవచ్చును.

ప్రభా:—దండము తేనికి కట్టకడపటి సాధనము. బంధుజనుల తోడి విరోధమును శ్రేయోదాయకము గాదు. సామముననె వ్యవహరించి కార్యము సానుకూలము చేసికొనుట నేను శుభప్రదమని నాయంతరాత్మకు తట్టుచున్నది. కావున నవశ్యము తొలుత రాయబారముననె నడుపవలయు—నీజాబు వ్రాయుము సవినయంబుగ— సస్నేహంబుగ ఆత్మగౌరవమునకు భంగము లేకుండఁగ కూఁతురు తండ్రి కెటులఁ వ్రాయ నగునో యటుల వ్రాయుము. నేను సచివుల సామంతుల రావించి కర్తవ్యము నిర్ణయించెదనని చెప్పి వెడలిపోవుచు "అర్ధాంగము దోష పంకిలమా? పాపభూయిష్టమా?... భ్రాంతి! వట్టిభ్రాంతి!" యనుకొనుచుండెను.

ప్రభాకరుఁ డరిగినవెంటనే రంజని యిటు తిరిగి "జాబు పంపెదను. దట్టించిన యగాదులోనికి యగ్నికణము పంపెదను! నా తండ్రిచెవులఁ బ్రభాకరుని సామవాక్యములు చొరకుండఁ జేసెదను. తేపు పడనున్న పిడుగును నేఁడే యాకర్షించెదను. విజయుఁ డీనావరుగందుకొనఁజాలఁడు. కావున వీరధర్మము మఱచి, యువతీలోలుఁడై కులుకుచుండెనని పరాభవింపఁబడును—నన్నుఁ బరిభవించినవానికి నే పరాభవము కలుగఁ జేసిన దోషమేమి? అని తలపోయుచుండెను.

రాధాకృష్ణ సంవాదముపాట పూర్తియైనది. చండభాస్కరుఁ
శాంతకిరణుఁడై పశ్చిమదిశను సౌమ్యవదనముతోఁ బొడగట్టుచుండెను
భూతలమున యమున రక్తవర్ణయై ప్రవహించుచున్నది. చల్లనిగా
మెల్లగా వీవఁదొడఁగినది. లోకమంతయు నొక్కనిట్టూర్పు విడి
సుఖంబు నొందుచుండెను.

౨౪

హిమవత్పర్వతప్రాంతమున యవనశిబిరంబులో నలకసుందరుఁడును న
రోహకుఁడును గలసి మంత్రాంగము చేయుచుండిరి.

అలక :—ఈమాఱు నిశ్చయముగ దేశము వశమగునా!

అంతి :—తప్పక కాఁగలదు—ఏమందురా, యవననాగరిక
విభవ మార్యావర్తము నీమాఱు పూర్ణముగ నాకర్షింపఁ గలిగి
తదాదర్శమునకు సాదృశ్యముగ నేఁడు దేవరపుత్రిక యార్
వర్తమున నివసించుచు నార్యసతీమణులతో స్నేహమొనర్చుచు వా
కెల్ల నలక్ష్యముగ నేనాఁడుండెనో యానాఁడె యార్యజాతి వన
మైనదని నానిశ్చయము—

అలక :—నిజము. ఇంతవఱకు మనము పంపిన ప్రతినిధులలో
పాలకులలో నెవరును వారిప్రేమకు మెప్పునకు ననుకరణమునక
పాత్రులు కాఁజాలకపోయిరి. ఇప్పుడు మాతనూజ యాశఁ దీర
నది-ఈయుపకారము మనకుఁ బ్రభాకరుఁడు చేసెనందువా? దైవము
నమకూర్చెనందువా?

అంతి :—కమలాకాంతుఁడు రంజనిని బడయఁగోరి ప్రభాకరు
జంప యత్నించి, వారల కిరువురకు నతివేగముగ వివాహము న
కూర్చెను.

అలక :—వానినిమాత్రము బ్రదుకనీయరాదు. ఆచండాలునిక
బల్లెమునకు గ్రుచ్చి. నాగ్రామోలఁ బెట్టవలయు. మన కేమని కబు

ర్సెను ! మనగౌరవాగౌరవముల నెఱింగినవాఁ డుండుండె ననగా—
వాని లేకుండఁ జేసిననేగాని నాహృదయమునకు శాంతి కలుగదు.

అంతి :—నేటికి వారి విజయసింహుఁ డెందుండెనో తెలియనే
లేదఁట—మనమిప్పుడేపోయి ముట్టడించిన నొకవేళ కమలుఁడె నాయ
కత్వము వహించునేమో ! వానిప్రతిష్ఠ మన మెఱుఁగనిదికాదు. కావున
యము ధ్రువము జాగుచేసిన విజయసింహునకు వార్త తెలిసి, వచ్చి
కొనఁగలఁడు. అప్పుడు జయము కష్టసాధ్యమగునేమో యని
లఁచెదను.

అలక :—నీవు చెప్పినదానియందు సత్యము లేక పోలేదు. కాని
నాకు ప్రభాకరునిగూర్చి తలఁచినప్పుడెల్ల నొకవిధమగు గౌరవము
లుగుచుండును. మిత్రత్వంబునఁ గాని శత్రుత్వంబునఁ గాని వాని
దార్యము మెదుటివానిని గూడ నౌదార్యము వహింప బలవంత
ట్టును. దొంగవలె నట్టి మహావీరుని దేశములోఁ జొరఁబడుట
మాకును గౌరవము కాఁజాలదు. కావున నుచితరీతిని మారాక
నెఱింగించిన పిదప బాహాటముగ దాడి వెడలుట పౌరుషము. అది
యుభయులకు నర్హ గౌరవము—మఱియొక విశేషము. మా రంజనికి
వాతో నిజముగ యుద్ధము సేయుట కిష్టముండ నేరదు. ఆపెమూలమునఁ
పియుని హృదయముకూడ మాఱి యెట్లో యొక విధముగ మనతో
సంధిచేసికొనుటకే యాతఁ డిచ్ఛగించవచ్చును. కావున ముందుగ
యుద్ధమునఁ గాలుదువ్వుచు దొంగపోటుగఁ బోయి పడనేల ?

అంతి :—అటులనే చేయవచ్చును. కాలహరణము శత్రువునకే
గాక మనకును గొంత ప్రయోజనమున్నది. గుప్తమార్గముల నింకను
గొంతపని చేయవచ్చును. సామంతులగూడ నూపి చూడవచ్చును.

ఇట్లనుచుండఁగనే ద్వారపాలకుఁ డొకఁడు ప్రవేశించి "దేవా!
ర్యుఁ డొకఁడు రంజనీ దేవిగారికడనుండి వచ్చితినని చెప్పుచున్నాఁడు.
నిసెలవు ?".

అలక :—తక్షణమే ప్రవేశపెట్టు.

ద్వారపాలకుఁడు :—చిత్తమని వెడలిపోయెను.

అలక :— చూచితివా!— మాటలలోనే సంధిరాయబారము వడిసించుటకు ముందుగ మన యభిప్రాయ మెట్టిదో కనుగొనఁగోరి రహస్యముగ వీనిని మనకడ కంపి యుండవచ్చును—కాని మనము చాడియత్నములలో నున్నటుల వారికిని దెలిసినది కాఁబోలు.

అంతి :— తెలిసినటులనే తోఁచుచున్నది. కాని యెటుల తెలిసినదో దోఁచకున్నది.

ఆర్యుల రాయబారి ద్వారపాలకుఁడు దారిచూపుచుండగ రాజసభాంతరమునఁ బ్రవేశించెను. ద్వారపాలకుఁడు రాయబారి కన్నుల గంతలువిప్పి, అలకసుందరసార్వభౌముని జూపించి తాను వెడలిపోయెను. రాయబారి యవనసార్వభౌమునకును, సేనానికిని, యుచితరీతి ప్రణామము లర్పించి, తనకుఁ జూపఁబడిన యాసనమునందుఁ గూర్చుండెను. ఇంతలో సచివసామంతాదులు ప్రవేశించి, సార్వభౌమునకు సంగి సమస్కృతులు సల్పి, తమతమ యర్హాసనముల నలంకరించుచు వచ్చిన యార్యునివంక రెప్పవేయకఁ జూచుచుండిరి.

అలక :—ఈరాయబారి యార్యావర్త సామ్రాజ్ఞి కడనుండి యేమోసందేశముఁ గొనివచ్చెనఁట! మనమెల్ల సావకాశముగ విని దాని సారాంశము గ్రహింప నగును.

అందఱును దదంగీకారము వినయపూర్వకముగ సూచించిరి.

అంతి :—రాయబారీ! సార్వభౌములు ప్రియతమయవాక్యముల నీముఖమున వినఁగోరుచుండిరి. వారి కిట్టి ప్రసన్నత కలుగుట నీయదృష్టము. కావునఁ దత్సందేశమును బొందికగ నామూలాగ్రముగఁ గాలయాపన చేయక వినిపింపవలయు.

రాయ :—(స్వగతము) కటకటా! ఇట్టివేళ నే సామవచనములను నుడువ నాజ్ఞాపింపఁబడనుగదా! (ప్రకాశముగ) దేవర

కుమారీరత్నము; మాసుహారాణి నన్ను రావించి, "రాయఁబారీ, నీవు మాతండ్రిగారికడ కరిగి,—అనగా నీవు యవన దేశమునకుఁ బోనక్కఱ లేదు—వారే చల్లచల్లగా; నీవంక యావంక పెట్టి, మన సరిహద్దులలో హిమవత్పర్వత ప్రాంతమున వాయువ్యమునం దేమూలనో, పొంచి యుందురు—కలయఁ జూడుము."

సామం :—అరే! ఏమిరా కావరము!

రాయ :—దేవా! క్షమింపవలయు—నే పాఠమును నప్పగించుచుంటిని. అర్థము నాకుఁ దెలియదు.

ఆంతి :—కానిమ్ము. నీవు సేవకుఁడవు—నిను జెప్పుమనిన మాటలు చెప్పుమనినటులనే చెప్పుము—అప్రయోజకుఁడగు శత్రువు నిందావాక్యమూలముననె పగదీర్చుకొనుచుండును గాన, వాని కాసంతుష్టియైన లేకుండఁ జేయనేల?

రాయ :—మీరుచెప్పినమాటయే యెల్లడల యథార్థము.

అలక :—వాగ్వాదములతో నేమిపని? మాతనయ నీచే నేమని కబురు పంపినది?

రాయ :—మాతండ్రిగారికడ కరిగి నాపేరు చెప్పి నమస్కరింపుమనెను.

అలక :—పిదప.

రాయ :—"నన్నేమని యాశీర్వదించునో కనుగొను" మనెను. అందఱును సార్వభౌముని మోముపైఁ జూడ్కుల నిల్పిరి.

అలక :—"చిరంజీవిని" యని యాశీర్వదించితి నని చెప్పుము.

రాయ :—అటులయినచో నాకుక్షి నిండుటకు నార్యావర్తమున సస్యసమృద్ధి కలుగును గావున బెంగ లేదని చెప్పుమనియె.

సచి :—"దీర్ఘసుమంగలీ భవ" యని దీవించిన?

రాయ :—"నాప్రాణనాథుఁడు ప్రాణములతో నుండగ స్వదేశమనాక్రాంతము కానీయఁడు కావున వచ్చినదారిని వేగమె మరలి పొమ్మని నుడువుము." అని యాజ్ఞాపించెను.

అంతి:—ఏమి! యీసడింపు!

సచి:—ఏమి! యీచాతుర్యము!

అలక:—తరువాత? మాకేమియుఁ గమ్మ వ్రాసి పంపలేదా? రక్తవర్ణాక్షరములతో జ్వాలాగ్నివలెఁ బ్రజ్వలించుచుండిన లేఖ నొక దానిని గూర్చియుండిరి. కాని పిదప యించుక యోజించి, "వలదు—ఉత్తరమును వారు చించివేయుదురు.—నీవు నోటిమాటగనే మా సందేశమును గొనిపోయి సరళముగ వినిపించిరమ్ము. నీకు శుభ మగుఁగాక." అని నన్ను హెచ్చరించి పంపి యుండిరి.

అంతి:—ఏదీ! ఆ సందేశమును సరళముగ వినిపింపుము. సార్వభౌములు పేరోలగమున నాలకింపఁగలరు.

రాయ:—"ప్రియాజనకా! నీకీచోరవృత్తి నభ్యసింప మనసయ్యెనేమి? దొంగవలె వచ్చితివి కాని పిల్లివలె సద్దుచేయక నడుగుపై నడుగులిడు టింకనుఁ జేతకాదాయె. నీయలుకు డప్పుడే యార్యావర్తము సంతమేల్కొల్పినది—బయటపడి కదనరంగమున చచ్చుటకు వెఱచి, యింకను వారికొఱకని వీరికొఱకని, రాయబారమని, మఱొక టని, యేదోవంక బెట్టుకొని నాడుదానివలె—కాదు. స్త్రీకి సాహస మున్నది—అంతకంటెను దక్కువగ మూలదూఱి నక్కి దాగి కూర్చుండ వచ్చినవాఁడవు రానేవచ్చితివి. కావున అల్లుని యొక మాఱు సందర్శించి, వానివిందు గుడిచి మఱి పొమ్మని నా ప్రార్థన—నీరాక నూహించియే నూతనరసము, వీరరసము—ఆర్యావర్తనము నీ వీవఱకు చవిచూడని నూతనపాకము—సిద్ధము చేయించి యుండిరి. కాలయాపన మేల?—వేగ తరలి రమ్ము. తా నెట్టివాఁడైనను నెదుటి వారి గౌరవప్రపత్తులనైన నెఱిఁగి తదనుగుణ్యముగ మసలుకొనఁ బ్రయత్నింపవలయు, కావున నీకనైనను వక్రగతుల విడిచి, పౌరుషము గలదేని సర్దారులను సైనికులను మంచులో నిలువబెట్టి వేధింపక వేగమె యింటికి మరలుము అని వచింప నీసేవకుని నాజ్ఞాపించెను.

అంతి :— ప్రభూ! దేవరయాజ్ఞ! ఎట్టికారు లజీవుమన్నను కాఁగాదనక విచక్షణలేక తగుదునని వచ్చిన వీని నేమి చేయవలయును.

సర్దా :— వీనినే మొదటిబానిసగా మనమేల గ్రహింపరాదు.

అలక :— వంటయింటి కుండే లిండెందు పోఁగలదు? యిప్పుడు విడిచిపుచ్చినను? కావున రాయబారీ! తిరిగి మనము ఆర్యావర్తము ననే యుచిరకాలమునఁ గలసికొనఁగలము. ఇప్పటికి నీవు స్వేచ్ఛఁగఁ బోయి మీమహారాజ్ఞితో నలకసుందరసార్వభౌముని వచనములుగా నిట్లు చెప్పుము. "ప్రియతనయా! నేటికి నీవు నాపుత్రిక వై నందులకు, మనయిరువురి జన్మములు సార్థకమైనవి. పౌరుషమునే గనఁబఱచెద. నీహితము ననుసరించెద. యవనుఁ డార్యులగౌరవప్రపత్తులఁ దెలిసికొనఁజాలకపోయెనన్న మాట రానీయను. నీప్రియునకు ధైర్యముచెప్పి సిద్ధముగ నుండుమనుము. వేయిమాటలిక ననవసరము" అని

రాయ :— మహాప్రసాదము.

అంతి :— రాయబారీ! మీ సార్థకనామధేయుఁ డగువిజయసింహునితో, యవనవీరుఁ డగుయాంటిగోనసు యనువాఁ డొకడు కలఁడట! వానినెవ్వుడైన జూచితిరా? లేనిచో వాఁడు తమతో గత్తి కలుప నుత్సహించుచుండెనని చెప్పుము.

అలక :— నీవిఁక స్వేచ్ఛగ నిరపాయముగ వచ్చినదారిని బోవచ్చును. రాయబారి కృతజ్ఞతాసూచకముగ నమస్కరించెను. సిపాయిలు వచ్చి రాయబారికన్నులకు గంతలుగట్టి వెలుపలికి దీసికొనిపోయిరి.

అలక :— వీఁడు మిక్కిలి గడుసు. మాట తేలఁడు. అనుభవశాలి వలెఁ దోఁచును.

అంతి :— నిజము. విజయసింహునిగూర్చి ప్రసంగించినపు డూరకుండెననక, లేఁడనక మిన్నకుండెను.

సచి :— అది వాని సత్యవాగ్నియమమును గాపాడును గాఁబోలు! పిదప కర్తవ్యాంశమునుగూర్చి విశేషము చర్చ యవన

రము లేకుండగనే వెంటనే రణభేరి మ్రోగింది యార్యావర్తముపై నడచుటకు నిశ్చయింపఁబడినది. తదనుగుణ్యముగ నాజ్ఞలు యవన స్కంధావారము నల్గడల వలయురీతులఁ బ్రకటింపఁబడెను.

ఇంతలో ద్వారపాలకుఁడు ప్రవేశించి ప్రభాకరునియొద్దనుండి రాయబారము వచ్చెనని తెలిపెను.

అలక :—"ఆప్రభాకరుఁడు స్వయముగ మాసన్నిధికి వచ్చిన నేమో యాలోచించెదను-గాని వానిరాయబారముల నైకొనటకే సమయమున మాకుఁ దీరిక లేదు. యుద్ధరంగముననేగాని మేమార్యునకు దర్శన మీయఁజాలమని చెప్పుము" అని యంతియోకుని కాజ్ఞాపించెను. అంతియోకుఁడు తదనుగుణముగ వార్త నంపుచు, యుద్ధసమయముగావున రాయబారుల మఱియెవ్వరిని విడువరాదని శాసించెను. ద్వారపాలకుఁడు వెడలి యావార్తను మఱింత తీవ్రముగ నెఱింగింప విఫలమనోరథులగు రాయబారులు తోడనే బందీకృతులైరి.

మంచెత్తి పైగొనువచ్చు తుపానువలె యవనసైన్యముప్రచండ వేగమున హిమవత్పర్వతమార్గములనుండి పాంచాలముమీఁదగ వచ్చుచుండెను.

౨౫

విశ్వాసపాత్రుఁడును రాజభక్తుఁడు నగు సుమంతుఁడు ప్రభువిచ్చిన యుత్తరము విజయసింహుని కందజేయుటకై యశ్వారూఢుఁడై వన మధ్యమునండి మిక్కిలి వేగముగఁ బోవుచుండెను. యావనచారుం డొకఁడు వాని వెన్నంటియె వచ్చుచుండెను. కొంతకాలమువఱకు సుమంతునకు వానిజాడయే తెలియలేదు. కాని యొకసారి వెనుకకుఁ దిరిగి చూచి "అయ్యా! మీ రెవరు?" యని యడిగెను.

యవ :—మనుష్యుఁడను." అని చెప్పుచు సుమంతుని కుడివైపునకుఁ దగ్గఱఁ జేరెను. ఇరువురి గుఱ్ఱములను నొండొంటి స్నేహ మంగీకరించినటుల జోడుగఁ గలసి వేగముగఁ బోవుచుండెను.

సుమం:—అదియేనా తగు సమాధానము?

యువ:—మీకు మిత్రుఁడను.

సుమం:—తమ పేరు?—మన మిదివఱకుఁ గలసికొంటిమా!

గుఱ్ఱమును చబుకుతోఁ గొట్టుచుండెను. పక్షివలె భూమి నంట యే గుఱ్ఱ మెగిరిపోవుచుండెను.

యువ:—(తనగుఱ్ఱమునుగూడ మోది సుమంతుని డాయుచు) అంతవేగముగ స్వారిపోవువానికి స్థలమేదియో జలమేదియో తెలిసిన, మిత్రుఁడెవరో శత్రుఁడెవరో తెలియఁగలదు. కాని వానికారెండును గూడఁ దెలియవు. ఒక్కమాఱాగి నెమ్మదిగ మాటలాడుకొనుచుఁ గలిసి పోరాదా? ఈయడవిదారులు మిక్కిలి యపాయకరముగ నుండును. అందును శత్రుభయముగల యీదినములలో—

సుమం:—నాకు నావకాశమెక్కడిది? సార్వభౌముని కార్యమున నియమితుఁడనై యుంటిని. అపాయములు, మమ్ము, చక్రవర్తిసేవకులను జేరనేరవు.

సుమంతుని యశ్వవేగము మందగించుచున్నది. అది గుర్తింపకయే

సుమం:—కాని మీసంగతి యేమియుఁ దెలుపరైరి. ఇక్కెందు బోవుచుండిరి.

యువ:—మనమిరువుర మొకచోటికే బోవుచుంటిమి.

సుమంతుఁడు కటాలునఁ దనగుఱ్ఱమును నిలిపి యువకుని బరిశీలించి చూచుచు, "అయ్యా! మీరెవ్వరో నాకు బోధపడుట లేదు. నేను మఱచి యుండవచ్చును. క్షమింపుడు. కాని మీరెవ్వరో, యెందుండి యెందుబోవుచున్నారో ముందు సెలవీయవలయును."

యువ:—(నవ్వుచు) శివిచో—

సుమం:—నా వెంట రాఁజనదు.

యువ:—(నవ్వుచు) వచ్చిన—

సుమంతుఁడు రానీయనని యొఱనుండి కత్తిఁ దూసెను.

యువ:—ఆర్యా! నేను యవనుఁడను—గూఢచారిని—మీగుట్టు
తెలియ మీవెన్నంటి వచ్చుచున్నానని చెప్పిననేగాని మీ యనుమాన
పూరితంబగు మనమునకు శాంతికలుగనేరదు. అప్పుడుగాని నిస్సంశ
యముగ నాకంఠము ద్రుంపఁజాలరు. నాతోడియార్యునకు నన్నంతలోఁ
జంపవలెనని తోఁచినప్పుడు నేను వానికి వేఱుచెప్పి కాదననేల? మన
యార్యధర్మమంతయు నింతకు వచ్చినది. మనుజుఁ డెదుటివానిఁగూడఁ
దనుబోలువానిగనే చూచుకొనుచుండునఁట! కాదననేల? మిత్రమా!
నీరాచకార్యమునకు నన్ను వధించుట యవసరమేని వెంటనే యాపనిఁ
జేసి రాజకార్యమును జక్కబెట్టుము. కాలయాపనమేల? ఎట్లైనను
మాప్రభువున కిష్టకాలము దాఁటవలయుననియే గద మనమందఱము
శ్రమపడుచున్నది?

సుమంతుఁ డావాక్యములు విని మిక్కిలి చిన్నబుచ్చుకొని యేమి
చేయుటకును దోఁచక నొఱనుండి తీసినకత్తి చేతియందు వ్రేలాడు
చుండ గుఱ్ఱమును ముందునకు నడిపించి పయనము సాగించుచుండెను.
యవనగూఢచారియుఁ దొలివిజయమునకు లోలోన మిక్కిలి
సంతసించుచు సుమంతునిఁ జేరవచ్చి "నామీఁదకోపమా" యని
యడిగెను.

సుమం:—కోపమున కవసర మేమున్నది?

యవ:—నాపేరు, నివాసము, గమ్యస్థానముఁ జెప్పనైతిని.
మాయూరి నేపాళము. విజయసింహుఁడు మాపెదనాన్నగారి మనుమఁడు-
కూఁతురుకొడుకు. నేను వానిజాడ నరయుటకే బయలుదేఱితిని.
కావలసినవాఁడు, పైకివచ్చి పేరుతెచ్చుకొనిన వానిపేరు చెప్పుకొనుటచే
మాబోఁట్లకుఁ బ్రదుకుఁదెరువు కలుగుచుండును. నన్ను హరిశ్చంద్రుఁ
డందురు. ఇపుడేమున్నది? అంతయుఁ జితికిపోయినది. మావంశ
మంతయు నలనాటి యవనయుద్ధములలోనే నశించి కొంత చెల్లాచెదరై
వికావికలై కొంతవేరు లేకుండ పోయినది. తిరిగి నేటికి మావంశములో

డేఁడో కేఁడు బయలు దేఱి పేరుప్రతిష్ఠలు నలువుచుండెను. మాటలాడ రేమి? ఇంకను గోపమేనా?

సుమం:—లేదు. కాని మీరు మిత్రులంటిరే, అదెట్లు?

యువ:—స్నేహము వస్తువదాధీనముకాదా? మీతో నెంత దవ్వులనుండి వచ్చుచుంటినో మీ రెఱుంగరు. నేను హాస్తినాపురము వచ్చి, సార్వభౌముని దర్శనము చేసికొని "మహారాజా! ఏమి వానిగతి? వానిజాడఁ దెలియక దిక్కులేక యుందుమంటి" మని మొఱ్ఱ పెట్టుకొంటిని. అప్పు డామహారాజు కనికరించి "నిజమే! మీకే కాదు. మాకును వానినిగూర్చి వ్యాకులత కలుగుచున్నది! ఒక్క క్షణము క్రిందటనే వానియొద్దకు సుమంతుఁడను వానిని బంపియుంటిని. పొమ్ము. వానిని గలిసికొనిన మీరిరువురును మావిజయుని సందర్శింపఁగల" రని సెలవిచ్చి పంపెను. అప్పటినుండియు మీ వెన్వెంటనే వచ్చుచుంటిని. కాని కార్యాసక్తులైన మీరు నన్ను గుర్తింపకుండిరి.

సుమం:—సఖా! హారిశ్చంద్రా! మానవబుద్ధి యెంతటి భ్రమలంజిక్కునో చూచితివిగద. అజ్ఞానంబున నిన్ను నే వేఱుగాఁ దలఁచితిని—ఆసంగతి యెల్ల నీవు తలపున నిలుపరాదని నాప్రార్థన. అప్పుడుకదా, నీవన్న మిత్రశబ్దము సార్థకమగును?

యువ:—విజయసింహుఁ డిపు డెచ్చున్న వాఁడు?

సుమం:—ప్రతాపసింహుని వనదుర్గమందుండును.

యువ:—ఇక్కడికి కెంతదూరము?

సుమం—చాలదూర మున్నది. నాకును సరిగఁ దెలియదు.

యువ— అయిన మన మెక్కింత యాగి విశ్రాంతి తీసికొని పోదము.

సుమం:—అయ్యో! నేఁడమవసనిశి, వెన్నెలయైన నుండదు. ఈ ద్రుష్టివెలుగైన నుండఁగనె నాలు గుడాముల మీఁద జేరుకొనవలయును.

యువ :—మీరటులనే చెప్పుదురు. మీగుఱ్ఱమునకును, నా గుఱ్ఱమునకును, మీకును నాకును గలవ్యత్యాసముఁ జూడరైరి. నాయొడలు స్పారిచే సడలి కీలుకీలునకును నలువు లెత్తుచున్నది. గుఱ్ఱము పదిబారల కొకమాఱు ముంగాళ్ళపై జోకరించుచున్నది. (గుఱ్ఱమునాపి) ఇఁక నొక్కయడుగైనను ముందుపడదు. రాత్రి చీఁకటి యయినచో వేకువనె లేచి క్షణములో నట యెగిరి వ్రాలుదము. దాహము మిక్కుటమగుచున్నది.

సుమం :—అంతకాలమేటుల వృథపుచ్చగలము! రాజకార్య మత్యావసరమైనది. ఒకయుత్తరము వానికి వాయువేగమున బోయి యందఁజేయవలసియున్నది. మనోవేగమునఁ బోవలసినది వీలైన—

యువ :—మీరు ముందరిగిన నాకీకాఱడవిలోఁ ద్రోవతెలియక నిటబండియుండవలెను. ఏమిచేయుదము! మీవెంట నరిగిన మీరు వానికడఁ జేర్పుదురని వచ్చుచుంటినికదా! నన్నీనట్టడవి దిగవిడచి పోదురా!

సుమం :—(స్వగతము) ఇప్పు డేమిచేయుదును! విజయసింహుని కాపులలో నొకడు— చక్రవర్తిపంపున నావెంట వచ్చుచుండె— వీని దిగ్గవిడచుటెట్లు! అర్ధరాత్రమున వాఁడు మాత్రము బయలుదేరునా! (ప్రకాశముగ) లేదు. మన మిరుపురము కలిసియే పోదము. కార్యావసరమునుబట్టి తటపటాయింపుకాని నాదేహము కూడ విశ్రాంతి గోరుచున్నది.

ఇరువురును గుఱ్ఱములుదిగి యొకవృక్షతలముజేరి దుస్తులను తీసి చెట్టుకొమ్మలకు వ్రేలాడగట్టి యమావాస్యచీఁకటిలో వనమధ్యమున చెట్టుక్రింద చట్రాతిపై గూర్చుని మాటలాడుకొనుచుండిరి. గుఱ్ఱము లాచేరువుననే సకిలించుచు, కసవు మేయుచుండెను. చీఁకటి మేర కడ్డురాదుకద! అనంతకోటి నక్షత్రములు నీలాకాశమున రంగురంగు పాదరసపు బుడ్డవలె, నిర్మలముగ ప్రకాశించుచుండెను. వర్షాచ్ఛాదితం

బగు వృక్షతలంబున నక్షత్రకాంతి యేమియుఁ బ్రసరించుటలేదు. కాని మిణుగురుపుర్వుల రెక్కలకాంతి స్థలవైశాల్యమును మాత్రము సూచీమాత్రముగఁ బ్రకాశింపఁజేయుచుండెను. చుట్టును గీచురాల నిస్వన మనవ్యాముగను నొక్కొకపుడు భయజనితంబుగను, వినవచ్చుచుండెను. అపుడపుడు దవ్వులనుండి యేదియో యొక క్రూరవన్యమృగ మఱచుచున్నటులఁ దోచుచున్నది. హరిశ్చంద్రుఁడు నేపాళములో గొందఱ నేకమిలాభములఁజూపి యవనపక్షపాతులుగ మార్చుచుండిరో, యొకని కొంతధనమిచ్చెదననిరో, మఱియొకని కెట్టి దివ్యసౌందర్య ప్రదర్శనము గావించి సమ్మోహితుని గావించిరో, మఱియొకనికి యవనసామ్రాజ్యము స్థాపింపఁబడిన తరువాత నెట్టి యున్నత పదవి నిత్తుమని వాగ్దానముచేసిరో చెప్పుచుండెను. ఆర్యులు కొందఱటుల యవనుని వశమైపోయినందులకుఁ దఱుఁచు నిందించుచుండెను. కాని యొకొక్కమాఱు "మానవుఁ డెంతచెప్పినను మానవుఁడే కాని దివ్యుఁడు కాఁడుగద!" అని వారలపై సానుభూతి కనబరచుచుండెను. సుమంతుఁడు "కటకటా యెట్టి దుర్దినములు వచ్చినవి. దేశమాత దురదృష్టము! ప్రభాకర సార్వభౌమా! నీవిప్పుడే సహస్రాత్తువులతో మెలఁకువఁగలిగి నీ సామ్రాజ్యమును జూచుకొనవలయు, లేనిచో దిరిగి యార్యావర్తమునకు దాస్యశృంఖలములు గలుగనున్నవి. ధ్రువము! హరిశ్చంద్రా! నీకంఠస్వరమునం దాలోహశృంఖలముల వినాదము వినవచ్చుచున్నది!" అని విచారించుచుండెను. తన్మూలమున యవనచారుఁడు తనబోధనలు నిష్ఫలములని తెలిసికొనుచుండెను.

ఇంతలోఁ బాప మాహరిశ్చంద్రున కదేమి పాపమో కాని, పాపొకటివచ్చి కాలిబొటనవ్రేలిపైఁ గాటువేసినదఁట! ఏమిబాధ! గిజగిజ తన్నుకొనుచుండెను. నోట నురగలు గార్చుచుండెను. సుమంతుని కాబాధ చూడశక్యము గాకుండెను. మిత్రుఁడు బాధచే రోదనము చేయుచుండగా తనకు నిలువెల్ల నీరగుచుండెను. తోడనే లేచి తన

పగిడి యంగీవస్త్రము వాని పాదమునకుఁ గట్టిగఁ జుట్టుచుండెను. హరిశ్చంద్రుని కాబాధ తగ్గుటలేదు. వానికి నిలువెల్ల విషమెక్కు చున్నది. ఇఁక గార్యము లేదని నిశ్చయించి సుమంతుఁడు తనఖడ్గము తీసి "మిత్రమా, ఈపాదము నిక్కడకు నఱకనిమ్ము. ప్రాణములు నిలుచును, పాదము పోయిననేమి? ఒండుపాయము లేదు."

యువ :—కాదు—కాదు—తల నఱుకుము. అది సుఖము. అయ్యో! దాహము—దాహము. లేనిచో నఱుకు తల! నఱుకు! యమయాతన—దాహము.

సుమం :—కాదు నఱుకనిమ్ము.

యువ :—హా! హా! ఎక్కువది పైకి గజ్జలు దాటినది. అయ్యో దాహము—దాహము—ప్రాణములు పోవుచున్నది.

సుమం :—"కటకటా! ఈయడవిలో మరణము వ్రాసెనో! అవసానమున దిక్కులేని పక్షివలె రాలిపోకుండ నన్ను వానికిఁ దోడు చూపెఁ గాబోలు దైవము! జలమెందున్నది? ఎటు తెత్తును? ఎందైన నున్న పోయి యానస్త్రముఁ దడపి తెచ్చి వీనికంఠమున పిండుదును." అని యనుకొనుచు "ప్రియమిత్రమా! జలము తెచ్చుటకు బోవు చుంటిని. క్షణములో వత్తు నని" చెప్పి చిమ్మచీఁకటిలోన తడవు కొనుచు బోవుచుండెను. ఎండుటాకుల మర్మరధ్వనులు వాఁడేదిక్కుగ బోవుచున్నదియు, నెంతదూరమందున్నది స్పష్టముగాఁ జెప్పుచుండెను. ఎండుటాకుల చప్పుడు వినఁబడుట మానినంతనే హరిశ్చంద్రుని బాధయుఁ దగ్గినది. అతఁడు లేచి నిలువఁడి సుమంతుని యంగీజేబులోనున్న యుత్తరముదీసి, తనయంగీలోని యుత్తరము నాస్థానమునుంచి తన గుజ్జముకాలుఁ బొడిచి, గాయపఱచి, తాను తిరిగి బాధ నభినయించు చుండెను. ఇంతలో సుమంతుఁడు వచ్చి, తడిబట్ట హరిశ్చంద్రుని పెద వులపైఁ బిండి, నాజలమును గ్రమక్రమముగఁ జప్పరించి, యొకగుటుక వేసి, యాఁగి తిరిగి రెండుమూఁడు గుటుకలు వేసి తెప్పరిల్లినటులఁ

దటాలున లేచి కూర్చుండి "సుమంతా! కాదు హనుమంతా! సంజీవిని దెచ్చితివా! ఎక్కడ దొరికినది. యేది, యేది!" యని సుమంతుని చేతనున్న బట్టలాగి పుచ్చుకొని వేయివిధములఁ దయానందాద్భుతాదిరసముల నభినయించెను.

సుమం:—మనమదృష్టవంతులము! ఈ చెంతనే ముండ్లడొంకల నడుమనుండి యొకసన్నని యేఱు పాఱుచున్నటుల వినరా, నటుపోయి యానీటిని దెచ్చితిని. ఇందేమి మహిమయున్నదో తెలియరాదు.

యువ:—ఆపుణ్యభూములయందలి యోషధుల మహత్తు!

ఇంతలోఁ దూర్పుదిక్కున నరుణోదయ మగుచుండెను. మిత్రు లిరువురు పయనోన్ముఖులగుచుండిరి. "ఈజలమునుగొంత మావిజయునికిం గొనిపోయిన వాఁడు తిరిగి చూచుచుండగ వజ్రకాయుఁడగును." అని చెప్పుచుఁ దనగుఱ్ఱముపై జీనుఁ గళ్ళెము నమరించుచుండెను. సుమంతుఁడు గుఱ్ఱము నెక్కెను. హరిశ్చంద్రుఁడును గుఱ్ఱము నెక్కఁబోయి "యీడిగలపడుచున్న దేమి!" యని తనగుఱ్ఱమును దిరిగి పరీక్షించి "అయ్యో ముందరివైపు నెడమకాలు గాయమైనది."

సుమం:—హా! దైవమా!

యువ:—సఖా! నీవు విచారింపవలదు. ఏమి చేయుదును. ప్రతాపసింహుని దుర్గము 'మూఁడుక్రోశములదూరము—అని చెప్పితివి కదా. దిశ, యీప్రాగ్దిశయేనా? ఇఁక నీవాగఁజనదు. నిన్నాగమనుట రాజద్రోహము— దేశద్రోహము. నేనే యీ సూర్యుఁ డస్తమించు లోపున కాలులనో మెల్లగవచ్చి చేరుకొందును. నీ వరుగుము అని సుమంతుని నెంతయో హెచ్చరించి పంపెను. సుమంతుఁడును స్నేహితుని విడిచి పోనిష్టము లేకపోయినది. నిదివఱకే చాల కాలహరణ మైనదిగదా యని హరిశ్చంద్రునకుఁ ద్రోవ పలుసారులు, చెప్పి తూర్పు దిక్కుగా దవుడుదీసెను.

సూర్యబింబము తూర్పుదెసను, నెత్తురిబంతివలెఁ బ్రకాశించుచుండెను. యువనగూఢచారి సఫలీకృతమనోరథుఁడై గుఱ్ఱమును బశ్చిమదిశగా మరలించి దానిపై నధివసించి మెల్లగఁ బోసాగెను. శకుంతవంశానములు నిష్కళంకహృదయములతోఁ బ్రేమపూరితరవములతో నాటి యుషస్సును గానము చేయుచుండెను.

## ౨౬

మేడపై నగదిలోఁ బద్మిని యలంకరించుకొనుచున్నది. పద్మముసకు బై మెఱుఁగులఁ బెట్టుచున్నటులున్నది. తెల్లనిపట్టుచీర కట్టి తెల్లని రవిక దొడఁగి నిలువుటద్దముకడ నిలిచెను. పెదవి విఱిచి "తెలుపు వానికి నచ్చదు." యని తోడనె మెఱుపురంగుచీర కట్టి నీలాలరవికఁ దొడఁగి బొడ్డుమల్లెసరము దాల్చి, సన్నజాజి సిగకుఁ జుట్టి, వరహాలు చెవులఁబెట్టి, చెంగలువలు చేతఁబట్టి పూలరాణియనఁ దోఁచుచుండెను. తనయందమే చందమో యని నిలువుటద్దముఁ జేరి యడుగు మంధహాసము చేయుచు "నిజముగ వనవాసివలె నుంటిని. అతఁడు నాగరకుఁడు." అని మోమున నించుక దిగులుపాటు పొడసూపును. దిగులుపడనేల? శకుంతలను దుష్యంతుఁడు గారవింపఁడా? అహంభావము లేనికన్యకాభావ మెటుల కలుగును? రత్నఖచితకంకణముల హస్తపద్మములఁ దొడగును. పచ్చలపతకము కంబుకంఠమునఁ దాల్చును. వజ్రముల మెఱయు నొడ్డాణ మాసన్నని నడుమున బిగించును. నవరత్నములకూర్పు గలిగినపత్రంబు కుటిలాలకములమధ్య నుదుటిపైఁ దాల్చును. సుగంధద్రవ్యములఁదోడ, తాంబూలము సేవించు. తద్రక్తిమ నానుదతి కెంపెదవులకును, దాడిమీబీజములఁ బోలు పలువరసకును నప్రయత్నముగఁ బూయును. నిలువటద్దము నీమాఱు తగియుందునాయని యడుగఁబోవు "నన్ను వరించెనా నిదియె నాపెండ్లిముస్తాబు—లేనిచో వసంత మవసానంబున విరివిగఁ

దాల్చి యలంకరించుకొను పుష్పశృంగారము.” అని నిశ్చయించు కొనుచుండెను. సాత్త్విక సౌందర్యలక్ష్మి రాజనందనను మోహినీ రూపము దాల్చుచుండెను—సీత రాధిక యగుచుండెను—పార్వతి రతి కాఁగోరుచుండెను. విజయసింహుని కౌఁగిటకు పద్మిని హృదయమునఁ దోఁబుట్టి నిర్వ్యాజప్రేమ యుదయించినది. పిదప యాకన్య విజయునకు నిష్కామ సేవ కొనసరించినది. విజయుని సహవాసలాభమున నేఁటికి వాసికెక్కి నుండి స్త్రీపురుషహృదయగ్రంథి యగు కోరిక, యాశ, తృష్ణ, యాకన్య హృదయమున రహస్యముగఁ బ్రవేశించి యట విజయునందు మోగ వాంఛను జేసి, తద్విరహాగ్నిని, రగులు కొలుపుచుండెను. తదనుగుణ్యంబుగనే బాహ్యరూపసౌందర్యంబుల మార్పు ప్రకటితమగుచుండెను. కాని యీ రెండురూపములందు నేదియెక్కువ మనోహరమో యెవరు నిర్ణయింపఁగలరు? వికసించిన పద్మములతో శుభ్రనీలాకాశముక్రింద స్వచ్ఛమై ప్రశాంతమొప్పు సరోవరము మనోహరమా? ఉత్తుంగ తరంగములపై నాడుచున్న చంద్రకాంతులతోను, వాయువశంబున మర్మరధ్వనులొసర్చు కలువలతోనున్న కొలను రమణీయమా? అది రసికులగు పాఠకమహాశయులే యెఱుంగవలయు * * * *

మేడక్రిందహాలులోఁ బ్రతాపసింహుఁడును జంద్రహాసుఁడును మాటలాడుచుండిరి.

చంద్ర:—అప్పుడే విజయసింహుఁడు పయనమగుట నాకు వింతగ నున్నది.

ప్రతా:—నేఁడు వాని ప్రయాణము నామనమున కూరట కలిగించుచున్నది.

చంద్ర:—అట్లనేల?

ప్రతా:—మన పద్మిని ... ... ...

మూగసేవకుఁడు సుమంతునిఁ బ్రవేశపెట్టెను. సుమంతుఁడు ప్రతాపసింహునకు నమస్కరించెను. ప్రతాపుఁడు వాని నుచితాసనమునఁ గూర్చుండ నియమించి కుశలప్రశ్న లడుగుచుండెను.

సుమం:—అంతయు సుభిక్షమే—అందఱు క్షేమమే—యువ
నేఁడు దాడివచ్చుచుండెను. విజయసింహుఁ డెక్కడ? వానిని సత్క
రించి రాజసందేశ మందఁజేయవలయు.

అందఱును దిగ్గనలేచిరి.

ప్రతా:—ఏమి యువనునిదాడియా?

చంద్ర:—నాన్నగారూ, నన్నును విజయునితో వెడలనిండు.

ప్రతా:—రమ్ము! సుమంతా, విజయసింహునిఁ జూపెదము

అని ముందునడువ సుమంతుడు వెనుక నరిగెను.

* * * *

విజయసింహుఁ డుద్యానవనములో విహరించుచుండెను. శుభ్ర
మైనగాలి, నీరు, యన్నము ప్రియమగువారి యాదరణమును నరుని
కమృతతుల్యముగదా! విజయసింహుఁడు క్రమక్రమముగ నారోగ్య
వంతుఁ డగుచుండెను. క్రొత్తరక్తముఁ బట్టుచున్నది. జబ్బులోఁ
జేసికొనిన ప్రతినలు, మనోనిశ్చయములుఁ జబ్బుతోనే మాయ
మాయెను. హృదయమునఁ దిరిగి రంజనీమదనసామ్రాజ్యలక్ష్మీవిగ్రహము
సుస్థిరముగ నిలిచి ప్రకాశించుచుండెను. నిజముగా నాజగదేకసుందరి
నట్టి మోహభావముతో హృదయస్థను గావించుకొని యారాధింపఁ
దనకు నిజముగనర్హత లేకపోయినను, మానవుఁడు నీచమగు భ్రమర
సాంప్రదాయము ననుసరించుటది త్రిచాపల్యమగును. గాన విజయసింహు
డధర్మపథమునందు ధర్మము ననుసరించుచుండెను. ఎన్నఁడామణిహార
మును రంజనికంఠమున వైతునా యని యువ్విళులూరుచుండెను.
అప్పుడు రంజని మోమెటులనుండునో యని తన భావనాశక్తిచే
మనోఫలకమునఁ జిత్రముల లిఖించి చూచికొని యానందించుచుండెను.
తనకు రంజనీపునర్దర్శనము సంభవముగావించి బ్రదికించినందులకుఁ
బద్మిని కెంతయో కృతజ్ఞతాబద్ధుఁడైనటుల దలంచుకొనుచుండెను.

ఇంతలో సూర్యుఁడు పశ్చిమదిక్సోపానములమీఁదుగ గగన భాగమునుండి దిగుచుండెను. పక్షులన్నియుఁ దమతమ నివాసములకుఁ జేరుకొనుచుండెను. వృక్షాగ్రములందలి రక్తిమ హృదయమున కనిర్వాచ్యమగు నిర్మలానందము కలిగించుచున్నది. ఆసమయమున భూతలమందలి ప్రతిజీవియు నిజగృహాంగణమున స్వర్గసౌఖ్యమును గాంచుచుండెను.

హనుమంతుఁడు విజయసింహుని సమీపించెను. విజయసింహు డులికిపడునటుల "ఏమి! ఇటు వచ్చితేమి? హనుమంతా? ఎప్పుడు వచ్చితివి? మహారాజు క్షేమమా? సామ్రాజ్యము పదిలమే గద! నీయాగమనకారణం బేమి? సవిస్తరముగ నెఱిఁగింపుము."

హనుం:—విజయసింహప్రభూ!— ఏమి విన్నవించువాఁడను? అందఱు కుశలమె, సార్వభౌము లీజాబు తమ కందజేయుమని పంపియుండి" రని లేఖ నందిచ్చెను.

విజయ:—సార్వభౌముఁడు జాబు నంపెనా? సామ్రాజ్యమున కేమియు నలజడి కలుగలేదుగద! నాహృదయ మేలనో తత్తరమందు చున్నది. ముందు చెప్పుము.

హనుం:—యవనులు—

విజయ:—వండెత్తి రానుండిరా? కటకటా! నా కేమియుఁ తెలియదాయె. గాంధారమున సైన్యము లన్నియు సిద్ధముగనే యుండును. హావిధీ! మాదేశముపై నింకను గసిదీఱలేదా? కాదు. కాదు.—ఆర్యులప్రతిభ తిరిగి త్వరలోనే భూతలము నంతను వ్యాపింపవలెనని యీ సంగ్రామముల ననుగ్రహించుచుంటివి అని యుత్తరము విప్పి చదువుకొనెను.

"విజయా! నీప్రవర్తనము నీపదవికిఁ దగియుండనందున నిన్ను మాకొలువునుండి తొలగించనైనది" "ప్రభాకర" అని వ్రాసి యున్నది. విజయుని కాయొక్క వాక్యము వేయిశతఘ్నుల నొక్క

మాటలు తనపై గుచ్చిబెట్టి కాల్చినటులఁ దోఁచుచుండెను. విజయ
సింహుఁ డొక్కింతకాల మంతర్ముఖుఁడై నిలిచియుండి తలయెత్తి
సుమంతునిముఖముపైఁ బరిశోధించుచు దీక్ష్ణ వీక్షణములఁ బఱపుచుఁ
బ్రతిశబ్దమునకు నాఁగి యాఁగి మెల్లన నిట్లు చెప్పఁదొడంగెను.

విజయ :—సుమంతా! నీవు చాలశ్రమపడి చక్రవర్తికడనుండి
యాగమ్మఁ గొనివచ్చి యిచ్చితివి. మంచిది. నీవిఁక పోవచ్చును.
వెంటనేపోయి చక్రవర్తితో నామాటగా నిటులఁ జెప్పుము. "ఏమైనను
విజయుఁడు నిజధర్మము నిలుపబెట్టుకొనఁగలఁడు" అని పొమ్ము. నీపడిన
శ్రమ కిదిగో బహుమానము. నేనును నీ వెనువెంటనే రాజధానికి
వచ్చుచుందును.

అని యాచెంతనున్న కొన్ని పుష్పములను ఫలములను నిచ్చెను.
సుమంతుని కాచూపులు, నామాటలు సరిగ బోధపడమి నించుక
భయము య్యెను. కొంతవఱకటులనే నిలువఁబడి విజయసింహునికడ
సెలవుగైకొని యావలకు వచ్చి ఆకస్మికముగ వినఁబడుటచే యువన
దాడివృత్తాంత మాయన మనమున కట్టి క్రోధవికారము కలిగించి
యుండును. అనుకొనుచు వెడలిపోయెను.

విజయసింహుఁ డాలేఖను చేతఁబెట్టుకొని బోనులోఁ బెట్టఁబడిన
సింహమువలె నానవమల్లికానికుంజములపొంతఁ జూతవృక్షశ్రేణుల
నడుమ పచారు గావించుచుండెను. ఇటులుండగనే పున్నమనాటి
చంద్రుఁడు తూర్పుదిక్కున నెఱ్ఱనిపూబంతివలెఁ బొడసూపుచుండె.

"ఏమి కారణమై యుండును. కొలువునుండి తొలఁగించుటకు
నాప్రవర్తనము నీపదవికిఁ దగియుండనందున— దానిభావ మేమి!
పౌరంజని వన్నిటులఁ బరాభవించునా! ఎట్టిపాపిని! నాకెట్టి తలఁపేలఁ
కలుగవలయునో! అసంభవము—నాయన్నలయిన్న—బుద్ధులగుమ్మా—
ప్రేమంపురాశి — అట్లైనన్నటికిఁ జేయుదుఁ. చేయఁజాలదుఁ. మఱి
చక్రవర్తి కెవరైన చాడీలు చెప్పియుందురా! అట్టివారు చాలమంది

యుండిరి. కాని ప్రభాకరసార్వభౌముఁడు మధ్యవారిమాటలకుఁ జెవి యొగ్గు నైచ్యమునకుఁ బాల్పడ నర్చునే—అదియు ననంభవము. ఒక వేళ నెవరైన శత్రుగూఢచారులీలేఖ కల్పించియుందురా! అట్లైన నీలేఖను సుమంతుఁడేలఁ గొనితెచ్చు!—ఏమి నాయాశ ప్రభాకరుని ముద్రతో వచ్చినలేఖ యవిశ్వసనీయ మెటగును! నే సేనాధ్యక్షుఁడను గానిచో దేశమాతను సేవింపఁజాలనా! ఆర్యావర్తమున నే సేనాధిపతినై యుండఁ దక్కినవారు దేశసేవచేయుటకనర్హులై యుండిరా!—ఉన్నతోద్యోగము లేకపోయినమాత్రమున నేమిపోయె—ఒక సామాన్యపు యోధుఁడవలె బోయి కదనరంగమున నాప్రాణము లర్పించి దేశమాతఋణము తీర్చుకొనవచ్చునుగదా! ఎట్లైనను విచారింపఁ బని లేదు. అయినను వెంటనే రాజధానికరిగి నిజ మరయవలయు—రంజని నొక్కసారి తనివితీరఁ గన్నులపండువుగఁ జూచి యీమణిహారముతో నా మువత్తిము నలంకరించి"...

చక్కగ సింగారించుకొని ముద్దులమూటఁగట్టుచుఁ బద్మిని ప్రవేశించెను. పూఁదోఁట యెల్ల మనోహరముగ నుల్లాసజనకముగఁ బున్నమి వెన్నెలలతో నిండుచుండెను. చందమామ తీయమామిడిచిగురుల పైనుండి పద్మినీవిజయుల ప్రణయానురాగము లెట్లుండునో యని తొంగి చూచుచుండెను.

విజయసింహున కాపద్మిని యాగమన మంత యానందదాయకముగ నున్నట్టుల లేదు. అయినను—

విజయ:—ఓహో! నేఁడేమి వింతవేషము దాల్చితివి!

పద్మ:—చెప్పకుండగనే వెడలవలయునా!

విజయ:—పద్మినీ! చెప్పకుండగ వచ్చుటకుఁ బోయియుంటిని—యవనుఁడు మనదేశముపైకి తిరిగి దండెత్తి వచ్చుచుండెనఁట ఇప్పుడే వార్తవచ్చినది. రాజధానికరుగవలయు. అయినను నీకడ సెలవుదీసికొనక నేనెటులపోగలను!—నాప్రాణదాత్రివి. నీకేమి ప్రత్యుప

కారము చేయఁగలను? అయినను పద్మినీ! నీవు కోరుకొనుము. సంశ యమువలదు. కోరుకొనుము. నీహృదయమునకు మిక్కిలి ప్రియ మెద్దియో నద్దానిఁ గోరుకొనుము. నాప్రాణములనైన సర్పించి నేదాని నీకొడఁగూర్చెద. అటుల చూచెద వేమి? విజయుఁ డాడి తప్పెడివాఁడు కాఁడు.

పద్మిని చంద్రశిలాప్రతిమవలె నుండి యుండి యొక్కమాఱు పెదవివిప్పి మాటాడఁబోయెను. కాని యేమనెనో విజయునకు వినఁ బడలేదు. పద్మినికిని వినఁబడి యుండదు. ఆమె మనమునకేను స్పష్ట ముగఁ దెలిసి యుండదు. హృదయపద్మమునుండి తిలోత్తమవలెఁ బ్రేమవాక్యమెద్దియో బయలు వెడలినదగాని ముగ్ధజనసహజం బగు సిగ్గు భీతి యునెడి పెనుగాలితోఁ గలసి యస్పష్టమై యనుమేయమై పోయెను. విజయుఁడు మిక్కిలి దగ్గఱగ వచ్చి "పద్మినీ! నాయొద్ద నింకను సంకోచించుచుంటివే! ఏమియో నోటిలో ననుకొనుచుంటివి. అదే మియో నేవినరాదా! నేఁడే నే వెడలి పోవుచుంటినిగదా!"

అని యింకనేమో బుజ్జగింపుమాటలు చెప్పఁబోవుచుండఁ బద్మిని "నాకుఁ బిచ్చియెత్తినది. నిన్ను బ్రేమించుచుంటిని. నన్ను మరణింప నిమ్ము." అని మూఁడువాక్యముల నేకత్రుటియందే పలికి యొక్క నిట్టూర్పు విడిచి కన్నుల మూసుకొని తలవంచుకొనెను. విజయున కావాక్యముల కెటులసమాధానము చెప్పవలయునో తోఁచదాయె.

విజయ:—ఈదీనునకు వివాహయోగ్యత లేదు. పద్మినీ.

పద్మి:—నాకును వివాహ మక్కఱలేదు. ఈమహావిప్లవ సంక్షోభితంబు లగుదినములలో నాజన్మభూమి నుద్ధరించు భారతీయ సర్వసైన్యాధిపతి ననుసరించి రానిమ్ము. మహావీరునకు పరిచర్య గావించుచు నాయాయుద్ధరంగముల, దేశదేశముల సంచరించుచుఁ గృతార్థనై తిరిగి వచ్చెద.

విజయు:—తల్లీ! ఈమనరద్వృత్తాంతంతుండిప్పుడు పదచ్యుతుండై యుండెను. అదియునుగాక నిరుపేద, నీలమాణిక్యమును గొంగున మూటగట్టుకొని పోవుచున్న లోక మేమనుకొనెదరు!—ఆమాణిక్యము వలన బీదకును గౌరవములేదు. ఆబీదవానిమూలమున మాణిక్యమునకును గౌరవములేదు. తల్లీ! నీవు ఏసార్వభౌమునికో పట్టమహిషివి కాదగినదానవు. ఏరాజాధిరాజో బంగరుపూలతో పూజించుచుండెను. వానితపము నేల వృథాపుచ్చెదవు? అనుగ్రహింపుము.

పద్మి:—నాహృదయేశ్వరుడే నాకు సార్వభౌముడు—రాజాధిరాజు—దేవుఁడు.

పద్మినికి దేహమునఁ గంప ముదయించుచున్నది. మాట డగ్గుత్తిక పడుచున్నది.

విజయు:—(స్వగతము) "హా! దైవమా...ఎట్టివిషమస్థితి తెచ్చిపెట్టితివి!"

పద్మిని హస్తములఁ దనహస్తములఁ బట్టుకొని "నీవు వట్టి బేలవు! ఇది ప్రేమకాదు. ప్రేమోదయమునకు ముందు తదరుణోదయము"

పద్మి:—"పద్మిని ప్రేమించుటయు నెఱుఁగదు. జీవించుటయు నెఱుఁగదు. హా! విజయా! విజయా! విజయా!" అనుచు విజయుని హస్తములందే మూర్ఛపోయెను. విజయుని కనులవెంట నూరక బాష్పధారలు కారుచుండెను. "హా! హా! పద్మినీ! ఆర్య నారీమణీ! ప్రేమస్వరూపిణీ! స్త్రీశబ్దమున కర్థ మిదియ! పురుష వాచకమునకు లక్ష్యమిదియ! తల్లీ పద్మినీ! ఈ పాపికి నూతనజ్ఞానో దయముగలుగఁ జేసితివి. ఈలోకమునకు నూతనార్థముచూపుచుంటివి" అని యనుకొనుచుఁ బద్మిని మూర్ఛపోయి యుండుటయే మఱచి పోయెను. ఇంతలోఁ బ్రతాపుఁడును జంద్రహాసుఁడును వచ్చి పద్మినీ మూర్ఛావస్థను గాంచిరి. చంద్రహాసునకు గన్నుల నీరు గ్రమ్మ

చుండెను. ప్రతాపుఁడు తలవంకించి "చంద్రా! నీచెల్లెలిని లోనికిఁ బదిలముగఁ దీసికొని వెళ్లుము. అయ్యో! ఈబాల యొట్టిబేల—ఎట్టులైన నిందుక నిరవత కాఠిన్యము చూపినదే యీ రాజులు మేలగునా, మీ రాణి కెవ్వరో రాజధానినుండి వచ్చియుండిరి." అని చెప్పి తండ్రియు, వన్నయుఁ గలసి మూర్ఛమునిఁగి యున్న కన్యను లోనికిఁ గొనిపోయి శీతలోపచారములఁ జేయుచుండిరి. విజయసింహుఁన కా ప్రతాపుని వాక్యములు నిందావాక్యములుగఁ దోఁచెను. "నిజము—ఆ నిందకు నేనర్హుఁడను గానా!" అని యనుకొనుచుండెను. ఇంతలో లోనఁ బద్మినియుఁ దెలివిగాంచి కనులవిచ్చి చూచెను. తండ్రియు వన్నయు మిక్కిలి వంతసించిరి.

పద్మి:—వారేరి!

ప్రతా:—చక్రవర్తియొద్దనుండి కబురువచ్చినది. బయలుదేరి వెళ్లుచుండెను. వానిడాలు వారి కిచ్చివేతము. చంద్రహాన! నీ వాడాలు తీసికొని వెళ్లి వానికిచ్చివేయుము.

పద్మి:—వలదు—నేన యిచ్చెదను.

అని మేడమీఁదిగది తలుపు తెఱచి విజయుని డాలుపై నున్న తన పట్టుతొడుగునుగూడఁ దీసి క్రిందబెట్టి యాడాలు నెత్తిపోయి యద్దానిఁ గదల్పఁజాలకపోయెను. మేడ యెక్కుటచేతను, తన పట్టు తొడుగు డాలునుండి యూడతీయునప్పుడు హృదయము మిక్కిలి వేగముగఁ గొట్టుకొనుటచేతను, నప్పుడే మూర్ఛనుండి తేరిన యా కన్యకు యలసట కలిగి యట నమర్పఁబడియున్న పట్టుపరుపుపైఁ బండుకొని

పద్మి:—"అన్నా! నాకుఁ జాలనీరసముగ నున్నది. దీని నీవుఁగొనిపోయి వానికిమ్ము! నేఁదేఁజాలకపోతి ననుము. మన్నింపు మనుము."—

చంద్రహాసుఁ డాడాలును గేలను బూని క్రిందకు దిగి వచ్చు చుండెను. విజయసింహుఁడు ప్రతాపునికడ సెలవు దీసికొనెను. ఇంతలో డాలుపట్టుకొని చంద్రహాసుఁడును వచ్చెను.

విజయ :—"సోదరా! అడగకుండఁగ దెచ్చి యిచ్చితివి!— సెలవా!

చంద్ర :—"తిరిగి మన మెన్నఁడు కలసికొందుము!"

విజయ :— భౌతిక దేహములు కలియుటలో నేమున్నది. మనసులు కలియవలె. వాటి కెడఁబాయుటయే యుండ నేరదు.

అని బయలువెడలెను. పద్మినితోఁ గడసారి చెప్పలేదు. అయినను పద్మినికి విజయుని ప్రయాణవన్నా మెల్లఁ గంటికి కట్టి నట్లగపడుచునే యుండెను. విజయుఁడు గుఱ్ఱముపై నెక్కి సింహద్వారము గడచిపోవుచుండఁగ పైనుండి పద్మిని రవాకులనగము తెరచి చూచుచుండెను—తానిచ్చిన పచ్చలపతక మిప్పుడు వానికంఠమున లేదు. పద్మిని తనను జూచుచుండె నని విజయుఁ డెఱుఁగును. అయినను వెనుదిరిగి యొక్క మాత్రైనఁ బద్మినివంకఁ జూడలేదు. ఎఱింగియుండియే తనవంకకు వెనుదిరిగి చూచుటలేదని పద్మినియు నెఱుఁగును.

దివ్యదృష్టి, దూరశ్రవణాదుల దూరదృష్టి మొదలగు మానసిక శక్తులకును ప్రేమాదేవి తనభక్తులకును, భక్తురాండ్రకును వాత్సల్యాతిశయంబునఁ బ్రసాదించుచుండును.

పద్మినికిఁ దొలుత కోపము వచ్చినది. వెంటనే యాకోపము దుఃఖముగా మాఱిపోయినది. అంతలోనే క్రమముగ నాదుఃఖము కూడ సహజమగు గాఢానురాగముగఁ బరిణమించి యథార్థస్వరూపము దాల్చెను.

విజయుఁడు నెంతయో దూరముపోలేదు. అంతలోనే యెవ్వరో పిలువఁజొచ్చిరి. విజయుఁడు వెనుదిరిగి చూచి "పద్మినియే కాదుగద!"

అని యనుకొనుచుండెను. ఇంతలో రాజధానినుండి వచ్చుచున్న నూతన పురుషుఁడు సమీపించెను. వీఁడు సుమంతుని పోవగించినవాఁడే.

నూ. పు:—మీకొఱకు నే నాయుపవనంబు లెల్ల వెదకుచుంటిని.

విజయ:—అగును మఱచితిని. ప్రతాపసింహులు చెప్పినారు. ఎవరో వచ్చి యుండి రని ఏమి విశేషము.

నూ. పు:—విజయసింహప్రభూ! సూర్యుని యంధకారముచే బొదలి కనుగప్పఁ జూచుట వెఱ్ఱి కావున నావచ్చినకార్యము యథార్థముగ వచించెదను. ఉదారస్వభావులరగు మీరు పిదప మీయిచ్చ వచ్చినటులఁ జేయవచ్చును. నేను యువనరాయబారిని. యువనసార్వభౌమునుండి మీ కొకసందేశము గొనివచ్చితిని.

విజయ:—ఏ మని?

నూ. పు:—"ప్రభాకరుఁడు . మిమ్ము సైన్యాధ్యక్షపదవినుండి తొలగించె నఁట. అది మీకుఁ దెలిసియే యుండవచ్చును. కాని నేఁడు మీసరిహద్దుసైన్యము లన్నియు మీనాయకత్వమునే కోరుచున్నవి. మీ రానాయకత్వము వహించి ప్రభాకరుని, కమలాకాంతుని బట్టి యలకసుందరుని కప్పగించిన—మీ యేలుబడి కీయార్యావర్తమును వా రప్పగింతురు. రంజనీదేవి మీకు పట్టమహిషి కాఁగలదు. అని చెప్పి మీయభిప్రాయ మెటు లున్నదో యని యడిగి తెలిసికొని రమ్మని పంపి యుండిరి.

విజయ:—నేను పట్టభద్రుఁడనా! ఆమె నాకుఁ బట్టమహిషియా — అందులకు ప్రభాకరుని గమలుని యువనుల కప్పగించుటయా? —యువనరాయబారీ! నిన్ను క్షమించితి. నిన్ను ప్రాణములతో విడిచి పెట్టుచుంటిని. నీవు మీ సార్వభౌముని కడకు బోయి "ఆర్యావర్తమున దండఱును ద్రోహులు కారు" అని చెప్పుము.

సూ. వు:—మీరు యవనుల క్రింద సామంతునివలె నుండ నక్కఱలేదు. కప్పము గట్టనక్కరలేదు. విశేషరక్తపాతము జన క్షయము లేకుండ కాపాడినవారగుదురు.

విజయ:—వీరరక్తము స్రవించుటచేతనే మాయార్యావర్తము సారవంతమై ఫలవంతము కాఁగలదు. అదినీవెఱుఁగక పోవచ్చును. తాత్కాలిక సౌఖ్యము వద్యఃఫలము చూచుకొనెడిపిరికిపందలగు ద్రోహులే యీకర్మభూమియందు పెఱుగు ధర్మవృక్షమునకుఁ జీడపురుగులు. పలుమాట లేల! నీకుఁ బ్రాణములపై నాస కలదేని వెడలి పొమ్ము.

సూ. వు:—మఱియు బహుమానముగ వేనూఱులక్షల...

విజయసింహుఁడు కత్తిదూసి రాయబారితల తెగవేయబోయి "రాయబారీ! నా కేలనో యిప్పుడునరునకుఁ గీడుచేయవలె నని లేదు. కావున బ్రతికితివి. పొమ్ము నీధైర్యసాహసములకు మెచ్చితి" ననికూడ మీయేలికతోఁ జెప్పుకొనుము.

సూ. వు:—"చిత్తము."

అని వెడలిపోయెను.

విజయసింహుఁడు హస్తినాపురాభిముఖుఁడై వాయువేగమునఁ బోవుచుండెను. ఒక్కసారి రంజని ముద్దుమోము జూచినఁగాని విజయుఁ డెప్పటివిజయసింహుఁడు కాఁజాలఁడు. వాని మనసు శతవిధములఁ జెదరియుండెను. రంజని మోహనవీక్షణములుకాని తిరిగి యుద్దాని నొక్కస్థానమున కాకర్షించి చక్కఁజేయఁజాలవు.

౨౭

నరమునకూర్చుటకై లతనుండి త్రుంపబడినపుష్పము నేలరాలి పడి యున్నటుల పద్మిని పట్టుపఱుపుపై నలసి సొమ్మసిల్లి పడియుండియుండెను.

రాత్రి తెల్లవారువఱకు స్వామి గవాక్షముకడ నిలిచి విజయసింహుఁడు పోయినదిక్కునె చూచుచుండెను.

> "మరణమె మధురమా!
> ప్రేమమె మధురమో!
> సౌఖ్యము ప్రేమయో!
> మరణము సౌఖ్యమో!

వ్యర్థమైన నేమిప్రేమ! దానియందు సుఖము కలదు. మరణమనిన నేమిభయము! దానియందు సుఖముకలదు.

> ఏది హెచ్చుసుఖము నిజునో
> ఏమియునెఱుఁగ నెఱుఁగ నేను
> ప్రేమరో! నీయందు సుఖము నిజమె యయిన
> మరణమా! నినుబొంద నెంతకష్టమె!

ఈప్రేమ నాకుఁ గష్టము దుస్సహంబు గాన నామరణమే నాకిచ్చు సుఖము—

> "కరుణించి నన్ను ప్రేమమా?
> మరణింపనిమ్ము ప్రొక్కెదన్"
> "వాని నేను వలచితిన్
> వాఁడు నన్ను వీడి చనెన్,
> మరణమా! నిన్ను శరణు వేడెదన్
> దరికిదీసి కావవె"
> చందమామ నింగినుండి
> వెన్నెల ల్వెదఁజల్లుచుండ
> కంఠమె త్రిక్కోయి లిపుడు
> నిండుప్రేమ పాడుచుండె
> తల్లిపుడమి నిద్రచెందఁ
> చిల్లపూలు మెల్లనిపుడు

కంటియెదుట నాడుచుండె
లోకమెల్ల సుఖవశత
మైమఱచి నిద్రమునుఁగ
ముదముతోడఁ జంద్రుఁడిపుడు
దర్పమొప్ప దరహసింపఁ
పద్మిని యను పావురాలు
దిగులుపడుచు నుండుచుండె.
వాని నేను వలచితిగా
వాఁడు నన్ను వీడి చనెన్

అని యున్మాదినివలె నుచ్చైస్స్వరంబునఁ బాడుచుండెను. అడుగున వనమునందలి తరులతోఁ గుసుమంబులెల్ల సానుభూతితోడ హిమాంబువుల రాల్చుచు సౌరభవిశ్వాసముల విడచుచుండెను. కావి చంద్రుఁడు మాత్రము చూపోపక తెల్లవారులోపలఁ బద్మిని మోమును వాడఁజేసెను. కన్నులలావణ్యము నెఱుపుజీర లధికమయ్యెను. విరీల కుంతములు చీకాకుపడి నెన్నుదురుపై నెగురఁ జొచ్చెను. అధరోష్ఠపు రక్తిమ రక్తిచెడినటుల దోఁచుచుండెను. దేహమున దుర్బలత, మనమున నిరాశ, హృదయమున విరహవేదన, మిక్కుటమగుచుండెను. ఇంతలో సూర్యోదయము కాఁబోవుచున్నది. అరుణోదయమైనది. మేడపై నుండుటచేఁ బద్మినిగది యంతయు నప్పుడే యరుణకాంతితో నిండిపోయెను. పద్మిని తటాలున లేచికూర్చుండి

"ఇది యరుణోదయమా! ప్రేమోదయముకాదా! విజయా! విజయా!" అని పలుమాఱు పాటగా పాడఁజొచ్చెను. బలహీనమయ్యు నామెకంఠస్వరము దిగువపూలతోఁటలోనికి వచ్చిన చంద్రకాంతునకు కలకంఠకూజితమువలె వినఁబడుచుండెను. చెలియలకిచ్చుకొఱకు నామెమనసున నుల్లాసము కలిగింప నయనానందంబులగు సుందరమైన పూలనెల్లఁ గోయుచుండెను. ఇంతలోఁ బ్రతాపసింహుఁడు

వచ్చి "పద్మినిస్థితి యేమియు బాగున్నది కాదు. మూఁడురాత్రుల నుండి నోటి కన్న మెఱుఁగక కంటికి నిద్ర యెఱుఁగకున్నది. ఆ నామ స్మరణతోడనే యహోరాత్రములు గడపుచున్నది. ఇటులున్న దేహమునకు వ్యాధి జనింపవచ్చును. కావున మనమెటులయిన నామె మనసు త్రిప్పఁ బ్రయత్నింపవలయును" అని చెప్పెను. చంద్రహాసుఁడు మోమున విచారము పొడసూప "ఔను. నిజమె" అనెను. అప్పుడు వానిచేతియందలి చంగల్వవలెఁ బద్మిని వాలిపోయి యున్నది.

వెంటనే సన్నయుఁ దండ్రియుఁ బద్మిని యున్నగది సమీపించి తలుపు తెఱచిరి. పద్మినిలేచి నిలువఁబడి చేతులు మోడ్చి తూర్పు దిక్కున సగమువరకుదయించిన సూర్యునకు నమస్కరింపుచున్నది.

ప్రతా:—అమ్మా! ఏమి చేయుచుంటివి?

చంద్ర:—నాముద్దులచెల్లె లెవరికో మ్రొక్కుచున్నది.— నీపూజ కివిగో పుష్పములఁ గొనివచ్చితిని.

పద్మి:—ఏవి? ఏవి? (అందిపుచ్చుకొని శివాసిపై గ్రుమ్మరించి దోసిటపూల నెత్తిపట్టుకొని) ధర్మరాజా! ప్రభూ!

చంద్ర:—ధర్మరాజెవరమ్మా! ఎక్కడ?

పద్మి:—వారరుగో! విచ్చేయుచుండిరి. అదిగో మహిషవాహనము యమధర్మరాజు! (అని యొక పెద్దకొండను గనబర్చెను)

ప్రతా:—నీవాయమునారాధింప నేలనే చిట్టితల్లీ! లోకములో నెన్నియో ననుభవింపఁదగిన సౌఖ్యములు కలవు, ముక్కుపచ్చ లారనిదానవు. నీ వేమియెఱుఁగుదువు. యముఁడన ప్రాణాంతకుఁడు గాఁడటమ్మా! ఎట్టిరోగి యైనను, దరిద్రుఁ డైనను, దురదృష్టవంతుఁ డైనను, ఎంతవయసు చెల్లియున్నను బ్రాణముల తీపి తనివితీరక నింకను నెటులనో జీవింపఁ గోరుకొనుచుండును. అందులకే వేయి ప్రయత్నములు చేసికొనుచుండును—

పద్మి :—నిజమే కావచ్చును. వారలనెవరో ప్రేమించువారుండి యుండురుగద !

ప్రతా :—నిన్ను ప్రేమించువారలు లేరా తల్లీ ! మేమెవ్వరము నిన్ను ప్రేమించుటయే లేదా !—అమ్మా యేమిమాటలివి ? తల్లీ నీవు సదా యావిజయునినామమే స్మరించుచు వానినే తలపుల ధ్యానించుచు నుంటివేని పిచ్చియెత్తును. జబ్బుచేయును. తల్లీ నామాట వినవా !

పద్మి :—పోనిమ్ము తండ్రీ ! పిచ్చిది చచ్చిపోవునంట నాహృదయేశ్వరుఁడు నాకొఱకు విచారించునా ? ఇది పిచ్చి యూహ ! నాకంత యదృష్టమా !

చంద్ర :—అదియు నొకయదృష్టవిషయమేనా ? వానికరుణకు పాత్రమగుట ? వాఁడు !

పద్మి :—అన్న ! నీకిదితగునా ! నరునకు రెండునాలుకలా ! మహాత్ముల నేల పరిహసించెదవు ?

చంద్ర :—మొదట నేనును మోసపోతిని — మహాత్ములు ! ఆహా మహాదొడ్డమహాత్ములు !

పద్మి :—నీహేళనము నాకసహ్యముగ నున్నది. అకారణముగఁ బరోక్షమునందు పరుల నిందించుట న్యాయమా ! గౌరవమా ! ధర్మమా !

ప్రతా :—తల్లీ ! అకారణము కాదు. సకారణమే. మహారాణిని వలచిన జారుఁడు విజయుఁడు పాపి ద్రోహి మహాత్ముఁడా ! పయోముఖవిషకుంభము !

చంద్ర :—ఇప్పుడేమనుకొన్న నేమున్నది. ఇంటనుండి జారిపోయినాఁడు లేకున్న నాచెలియలి నింత మోసపుచ్చినందులకు వానిని—( ఖడ్గముపైఁ జేయివైచును. )

పద్మి :—[ హస్తపద్మములతోఁ గర్ణద్వంద్వము మూసికొని కన్నులవెంట నీరుకారఁ, డగ్గుత్తికతో ] అంతకంటె నాబాకులతో నన్నె

పొడిచినను నాహృదయమున కింతబాధ యుండదుగదః అన్నా! సోదరా! హా! పాపిష్ఠిలోకమా! ఊపలుగాకిమూఁక ధ్యేమహాత్ముల నామము నిష్కళంకముగ నిలువనిచ్చెను! శ్రీరాముఁడు పిఱికిపందయై రణరంగమున మూఁడడుగులు వెనుకకు వేసెను! ధర్మరాజు బొంకులాడి యుద్ధము నెగ్గెను! సూర్యభగవానుని ప్రభావము గాంచి చూపోవని గుడ్లగూబలు లేవా! ఊరక మాటలాడి వన్నెల నొప్పించెదరు!

ప్రతా:—అసత్యము కాదు. చక్రవర్తి వీరహారమునకు చేసిన కమలాకాంతునంతటివాని ముఖమునుండి వెలువడినదీమాట.

పద్మి:—వానిని నే నెఱుఁగుదును. మీరు నెఱిఁగి యుండిరి. దయామయుఁ డగు పరమేశ్వరుఁ డాపాపిని క్షమించునుగాక!

చంద్ర:—ప్రియసోదరీ! నీవును నన్ను క్షమింపుము. కోపమాగినది కాదు కాని నన్ను దిరస్కరించి పోవునప్పుడు నీవంక నైన చూడక యమృతకలశమును జారవిడిచి యెంగిలికల్లుకుండకొఱకువలె రంజనిమీఁద ప్రాణములుం పెట్టుకొని పరుగు లిడువానిజోలి నీకేల! వానినామమునే స్మరింపుచు— వానిరూపమునే ధ్యానించుచు నిద్రాహారముల వర్జించి కృశించిన నేమిఫలము చెప్పుము. ఇహమా! పరమా!—మందహాసము నీముఖము నెడబాసి యెన్నిసంవత్సరములో యయినటు లున్నదిగద— వెన్నెలబాసినచంద్రునివలె నున్న నీమోము జూడ మాహృదయము ముకుళించుకొని పోవుచున్నది. నీ తొల్లిటి వికాసము మాకనుల విందొనర్పభాగ్యములేదా! వృద్ధులగు మనతండ్రి నైన జూడవా! నీవిటుచెంగఁగొని యుండి పిచ్చిదానివలె వానినే కలవరించుచుండ నాన్నను జూచుము. గుంటపడిన నేత్రములందు విచార మెటులపీటవెట్టుకొని కూర్చున్నదో—

అని ప్రియసోదరుఁడు హితము నుపన్యసించుచుండగాఁ పద్మిని తివాచిపై పోగుపడిన పువ్వుల నల్లతుంచి రేఖల నేలపైఁ బఱచు

చుండెను. క్రమక్రమముగ విజయసింహునిరూప మేర్పడుచున్నది. పద్మిని కావలెనని రేఖల నట్లుపేర్చి యుండునా! లేదు! పద్మినియు మిక్కిలి యాశ్చర్యానందములతోఁ 'జూడుడు చూడుఁడీచిత్ర మెట్లు వచ్చినదో, * * * * * ఎవరుచేసినదీవని

ప్రతా :—విధి! విధి!

పద్మినీ స్మృతిపటమున వెంటనే నాటి మధ్యాహ్నము కొండ గుహాలయుండిటులనే పలవరించుట—పిదప నందులకు నవిస్తరముగ హేతువు చెప్పుట—తాను జాలిపడుట మొదలగు విషయము లెల్ల మిక్కిలి సన్నిహితములై కనబడుచున్నవి. అందుమూలమున నామె ప్రేమోన్మాదము మిక్కుటము కాఁజొచ్చెను—

తండ్రికిని సోదరునకును నిరాశయు దుఃఖము మిక్కుటమగు చుండెను. పద్మినియెడ జాలియు నంతకంటె మిక్కుటమగుచుండెను.

శీతలజలాలింగితకాని పద్మము సూర్యకాంతిచేతనే డస్సి వాడి పోవునటుల, విజయునిచే నిరాకరింపఁ బడినదగుటఁబద్మిని ప్రియమగు నిర్మలప్రేమ తేజంబునకు తాళఁజాలక డస్సి వసివాడఁ దొడంగె. ఆ వికసితహృదయపద్మము ప్రేమసౌరభము నూరక వెదజిమ్ముచుండెను. ఆమె మనమున నప్పుడెన్నెన్నియో వింతకోరిక లుదయింపఁజొచ్చెను. తండ్రి తొడలపై నొకచేయియు, సోదరుని అంజలియందొక చేయియు, వైచికొని పఱుండి పద్మిని తనమనమునఁ బొడమిన కోరికలఁ జెప్పు చుండెను. ప్రతాపుఁడు కాని చంద్రహాసుఁడు కాని యిప్పుడు తొల్లిటి వలె ఔఁ గాదని వాదింపలేక పోవుచుండిరి. జాలి వారిహృదయము లందు నిండి కన్నులవెంట బాష్పరూపమునఁ బొరలి పోవుచున్నది. "ఇప్పుడు నేను చిన్నపిల్లను. తిరిగి యొకమాఱు నాచిన్ని నావపై యమునమీఁద విహారమునకుఁ బోయెదను. మన ముసలితాత నన్ను దీసికొనివెళ్ళును. ఈమాఱు చాలదూరము ప్రయాణము చేసెదను. ఆపురుషోత్తముని సందర్శించి, వానికడ శెలవుదీసికొనవలెను. అంత

వలెకు నేజీవింతునా ? అన్నా ! ఎవ్వరో దివ్యగానము వినిపించుచుండి
చూడుము. నాన్నగారూ ! నా యీకోరిక చెల్లింపరా ? — ఇదియేకడ
పద్మిని మిమ్ముఁగోరు కడసారి కోరిక ! ”

ప్రతా :— అవశ్యము తల్లీ — దానికేమి భాగ్యము. నీముద్దు
చెల్లించుటకన్న నాకుఁ గావలసినదేమున్నది ? నీకుఁ దిరిగి పూర్ణా
రోగ్యము కలుగనిమ్మ. తప్పక యమునపై నావికావిహారమునకుఁ
బోవచ్చును.

ప్రతా :— కాదు. అన్నా ! లెమ్ము — నే నేలనో గాలిపైఁ
దేలిపోవుచున్నటులఁ దోచుచున్నది. త్వరగఁ దెమ్ము...... కలము
...... కాగితము చంద్రహాసుఁడు పద్మినికి కలము కాగితము నిచ్చెను.
పద్మిని కష్టముమీఁద గొన్ని పంక్తులు వ్రాసి ముగించెను. “ ఈయుత్త
రము నా చేతియందుంచుకొని తీసికొని పోయెదను నావిజయుని
కడకు ” అని చెప్పుచు నుత్తరమువైపు చూచుచు పద్మిని నిశ్చేతన్యయై
శయ్యపైఁ బడిపోయెను. ఆమె ప్రాణములు ముందుగఁ బోయి పురుషో
త్తమునియందు లీనమాయెను.

* * * * *

ప్రతాపుఁడును జంద్రహాసుఁడును దుఃఖాతిశయముచే బిగ్గఱ
నేడువఁజాలకపోయిరి. వారికన్నులవెంటఁ గన్నీరుకూడకట్టువడిపోయెను.
అటుల పెద్దతడవుండి యుండి,

ప్రతా :— “ నాయనా ! నీముద్దుచెల్లెలి కడసారికోరిక ” అని
చెప్పునరికి కట్ట తెగినట్టు లయి, వెల్లువగ దుఃఖము పొంగిపోయినది.
చంద్రహాసుఁడు బారున బాలునివలె రోదనము గావించెను. అందు
మూలమున నిరువురకును గొంతశాంతి కలిగెను. అప్పుడు వారు
పద్మిని కోరినకడసారికోరిక చెల్లింప నుద్యుక్తులై మూగనేవకుని
రావించి తగునన్నాహము గావింపఁ దొడఁగిరి. వారల కిప్పుడు
శబ్దము నిశ్శబ్దముగను, జీవము మృత్యువుగను పొడగట్టెను. కాని

యమున తొల్లిటివలెనే నిర్లక్ష్యముగఁ బ్రవహింపుచున్నది. దానిపై మూగవాఁడు నావ నడిపించుచుఁ గడు దవ్వరుగుచుండెను. ప్రతాప చంద్రహాసులు చూపానువటకు గట్టునను నిల్చి, రెప్పవేయక చూచుచుండిరి. నావ యదృశ్యమైనంతనే, "పద్మిని నిజముగ మృతిఁజెందిన దిప్పుడె" అని వాపోవుచు నిలువలేక క్రింద యమునాతీరమున శిలలపైఁ గూలఁబడి ఆదిమధ్యాంతరహితమగు సృష్టిప్రవాహమువలెఁ బ్రవహించుచున్న యమునచేఁ గొంతఁ యూరడింపఁబడిరి.

## ౨౮

తన పాలరాతిమేడయందు గవాక్షముకడ రంజని నిలువఁబడి క్రిందుగఁ బ్రవహించుచున్న యమునను రెప్పవాల్పక చూచుచుండెను. ఆమె మృదులాంగుళులు మాలతీపుష్పపత్రముల నూరక తుత్తునియలుగఁ జిదిమి పోయుచుండెను. బాలకములనంటి పెనుగుచున్న మాలతీలత శక్తికొలఁది సౌందర్యమును సౌరభ్యమును నొడగూర్చుచున్నదే కాని మతేమిదోషము చేసినటులఁ దోపదు. అయినను నేఁడీశిక్షకు లోను గావలసి వచ్చుచున్నదిగద! విజయసింహుఁడు ముందు మోకరించి చేతులతో మణిహారము నెత్తిపట్టి తన మనోహారిణియగు రంజని కందియ్యఁబోవుచుండెను.

రంజ :—వలదు.

విజయ :— అంగీకరింపవా ?— అనుగ్రహింపవా ? ఆ శ్రమ — ఆవేదన ఏ యాశాబలమున వహించి ప్రాణంబుల నీ దేహంబున నిలువ గలిగితినో, ఆ యాశ—ఆనందము—స్వప్నతుల్యము కావలసిన దేనా ! ఓకంబుకంఠి ! నీవీమణిహారము కంఠమున ధరింప నయ్యది సగర్వముగ నీసమున్నతవక్షంబు నధివసించి ధన్యతఁ గాంచి శోభించుచుండఁ గన్నులపండువుగ హృదయమునకుఁ దనివితీర—మనస్సానందమునఁ దేలి యూఁగ—నా శౌర్యపరాక్రమంబులు సఫలత నొంద—నెన్నఁడు

కనుగొందునో యని యెంతిరో యువ్విళులూరు నన్నిటుల పరాభవించుట నాహృదయరంజని వగునీకుఁ దగునా?

రంజ:—విజయసింహా! వలదు. నాకక్కఱలేదు.

విజయ:—హా! ప్రియా— స్వప్నమందైన నిటుల తలఁచి యెఱుఁగనే? మేల్కాంచి జీవించి యున్నప్పుడే యేమి వినుచుంటిని— ఈహతభాగ్యుఁ డేమిదోషము గావించెనో యెఱుఁగఁడు.

రంజ:—విజయా! నీయందేమియు దోషములేదు.

విజయ:—ఇంకను గ్రౌర్యము వహింతువా? నన్ను పరిహసింతువా? పరిహసింపుము—ఏమైనఁ జేయుము—విజయుఁడు నీవాఁడు నీసొమ్ము నీసొత్తు! నీప్రేమదాసు. ఈ విజయుఁ డింకను జీవించియుండుటయే నీయిచ్ఛయేని యీమణిహారమును స్వీకరింపుము. ధరింపుము.

రంజ:—నే నేలధరింపవలయును?

ఆప్రశ్న విజయుని మూఁగవానినిగఁ జేసెను.

రంజ:—ఎవ్వతెకొఱ కీహారమును జయించితివో, జయము గాంచుటయం దేసుందరియిచ్చిన పచ్చలపతక ముపచరించెనో, యెవ్వతె ప్రేమోపచారముల నంగీకరించి తన్మూలమున నీగాయముల బాధ నివర్తింపఁజేసికొంటివో యాకన్యకామణియె యాత్రిలోక సుందరియె, యాజగన్మోహినియె, రంజనిని డిందుపఱచిన యా నీహృదయేశ్వరియే నీమణిహారమును ధరించుట కర్హురాలు. ఆపెకంబుకంఠమె సమున్నతవక్షమె నీమణిహారమునకు మిక్కిలి శోభనిచ్చును. లెమ్ము! పొమ్ము! ఆకోమలిహృదయము నీవిరహమునకు తాళఁజాలదు.

విజయ:—ఇంకను గొనయూపిరి యాడుచున్నది!

రంజ:—ఏమి? ఏమంటిని? యవనసామ్రాట్టున కేకపుత్రిక భారతీయసార్వభౌమునిపట్టమహిషి— మహారాణి రంజనికి— వనవాసిని, నిరుపేద, నీచురాలు, పాపిని పద్మినియా యెదురునిలుచుట? కా కి

ముకుళ్ళన ముత్యము కావలయునేమి? ఏదీమణిహారమునాది. నాయిచ్చ వచ్చినటుల గావించెదను (అని విజయునిచేతిలోని హారమును లాగి పుచ్చుకొని గిరగిర త్రిప్పుచు) పద్మినీ! రారమ్మా!— ఇదిగో నన్నుఁ బరాభవించి నిన్ను ప్రేమించెడి నీప్రియుఁడు, తెచ్చిన మణిహారము తీసికొనుము. యమునలో మునిగి తీసికొమ్మా.

అని తనదుఃఖము, ననూయఁ గోపముఁ తృప్తిచెంద నామణిహారమును యమునపై విసరికొట్టెను. విజయుఁ డాత్రముతో లేచి చూచుచుండెను. ఆమణిహారమును జలములోఁ బడుటకు పూర్వమె యొకనావ గవాక్షముక్రిందికి వచ్చెను— ఈహారము నావయందు కలువపూసెజ్జపైఁ బఱుండియున్న యొక బాలామణికంఠమునఁ బడెను.

రంజ :—ఎవ్వ రీనావయందు?

విజయు :—పద్మిని.

రంజనీవిజయు లిరువురును గ్రూన్పడి చూచుచుండిరి. నావ ముందుకు మెల్లగ జరిగిపోవుచున్నది. విజయునకుఁ గట్టెదుట గాఢాంధకారములో స్ఫుటముగా వెలుగు నేకనక్షత్రమువలెఁ పద్మినీవదనబింబము ప్రకాశించుచుండెను. ఆముఖమె రంజనికి నరునినంకల్పములఁ దారుమారు చేయువిధి పరిహాసగర్భితమందహాసమువలెఁ బొడగట్టెను.

ఇంతలో ప్రభాకరుఁ డచ్చటకు వచ్చి రంజనీవిజయులను యమునయందలి నావను, యానావయందలి యాబాలికను, బాలిక మెడయందలి రత్నహారమును గాంచెను.

ప్రభా :—విజయా! ఎప్పుడు వచ్చితివి? ఆబాలిక యెవ్వతె?

రంజ :—ఇప్పుడే వచ్చెను. ఆబాలిక మనవిజయుని ప్రేయసి యట! విజయునిబహుమానము అదిగో! మణిహార మామెకంఠమున మెఱయుచున్నది.

ప్రభా :— ఈమె మోమెన్నడో చూచినటు లున్నది. ఆగుము— "ప్రతాపసింహుని తనయ పద్మినికాదా ఆచిన్నది— ఆదినములలో దేవి! మేము కారాగారములయందు నెచ్చెలులమై

కులఁగితిమి—తిరిగి యెన్నిదివసములకు గంటిని—చైతన్యము కల
రాదే? ఎవ రక్కడ?—వెంటనే బోయి ఈదిగువ యమునయందలి
బాలికను ఆనావనడుపు వానిని దోడ్కొనిరండు!" అని యాజ్ఞా
పించెను. తోడనే రాజసేవకు లరిగి బద్మిని మృతకళేబరమును నావనడుపు
మూగిముసలిసేవకుని గొనివచ్చుచుండిరి. విజయునకు దేహము కంపిం
చుచున్నది. రంజనికి హృదయావేదన మిక్కుట మగుచుండెను. నావ
యందున్నటులనే పూసెజ్జసహితముగఁ బద్మిని మృతకళేబరమును,
మూగవానిని దోడ్కొని వచ్చి సార్వభౌముని యెదుట బెట్టిరి.

ప్రభా:—కటకటా! ఈబాలిక మృతి చెందినదే! అయినను సుఖనిద్రంబొందినదానివలె నెంతదర్శనీయమై, మనోజ్ఞమై, యొప్పా చున్నది?—ఓయీ ముదుసలీ! ఈచిన్నదానిని నెచటనుండి గొని తెచ్చుచుంటివి?

వృద్ధుఁడు వంగి సమస్కరించి నోరు తెఱచి నాలుకలేమిఁ జూపి సవినయముగఁ దావచ్చినదిక్కు కనుబఱచి పద్మినిపై దృష్టి నిలిపి లోలోన దుఃఖించుచుఁ గన్నులనీరు గ్రమ్మ నొత్తుకొనుచుండెను.

ప్రభా:—విజయా! ఏమి చిత్రమిది! నీకు నాఁ డీపచ్చలపతక మిచ్చిన దీకన్యయేనా? నీవొకయింటివాఁడ వగుచుంటివని నాఁడు మేమిరువురము నెంతయో సంతసించితిమి. కాని యింతలో నెంత దురదృష్టవంతుఁడ వైతివి. ఈబాలిక మరణించుట కేమి హేతువో! ఇట వచ్చుట కేమికతమో?

రంజ:—తనరూపము దిరిగి పంచభూతములకు పంచియిచ్చుటకు పూర్వము ప్రాణేశ్వరుని కొకమాఱు కంటఁబడవలయునని—

విజయుఁడు రంజనివంక వాడిచూపులను బఱపుచుండెను.—

ప్రభా:—పరిశీలింపుడు— ఈసుకుమారిహస్తమున నరుణవర్ణముతోఁ బాటదేమియో తెల్లగాఁ గానవచ్చుచున్నదేమి? విజయా! యది యేదియో చూడుము— విచారింపకుము— విచారింపకుము, విచారించి యేమిప్రయోజనము!

విజయ:—మహారాజా! నాకు కీలాడుటలేదు.

సేవకులోకజాబు నాచేతిపట్టునుండి పదిలముగ నీవలకుఁ దీసి ప్రభాకరున కిచ్చిరి.

ప్రభా:—దేవీ! చదువుము.

రంజని యిటులఁ జదువఁదొడఁగెను!—

"విజయావతార విజయసింహ వీరాగ్రణిచరణకమలములకు దాసి పద్మిని భక్తిపూర్వముగ వేసహస్రప్రణామములు—

అజ్ఞాతంబుగఁ గురురంగమున కరుగుచో మీ రెవ్వనివనదుర్గంబున కరుదెంచి యుద్ధానిపావనము గావించిరో యాప్రతాపునికూతును, బద్మిని యనుదానను—తుదకు నాతోడఁ జెప్పక యొవచ్చినను మీకడ నేను నాకడసారి వీడుకోలు గైకొన వచ్చినందులకు—నా సాహసము మన్నింతురని ప్రార్థించుచున్నాను. నేను మిమ్ములఁ బ్రేమించితిని. కాని యాప్రేమ నిరాకరింపఁబడెను, కావున నాప్రేమయే నాకు దయా స్వరూపమగు మృత్యువును శరణ్యముచూపెను. నామహారాజ్ఞి రంజనీ దేవికి నమస్కారములు—నా బాల్యసఖుడు ప్రభాకరసార్వభౌముఁడు దిగ్విజయము గాంచి యార్యధర్మమును శాశ్వతోన్నతిజగద్గురుపీఠ మందు సుస్థాపితము జేయుగాక! అందరికడ సెలవు. ఈనా దేహమున కుచితసంస్కారములు జరుగఁగలవని నమ్ముచున్నాను. నీవును విజయా! నాయాత్మశాంతికొఱకు దైవము * *

అటుపై నిఁక నక్షరములు లేవు. వంకరలు తిరిగి యొకగీత పడియున్నది.

రంజనిమోము పాలిపోయెను. నాలుక తడఁబడఁజొచ్చెను. విజయ సింహుఁడు గోడనానుకొని నేలపైఁ జతికిలఁబడి కూర్చుండెను. అచ్చటివారందఱకును గన్నులవెంట నప్రయత్నముగ నీరు కారఁ జొచ్చె.

ప్రభా:—చూచితివా రంజనీ! విజయా! ఏమిది? నీ విటులఁ జేయువాఁడవని నేనెన్నఁడు ననుకొనలేదు.

విజయ :—ఆకన్యాలలామ నన్నుఁ ద్రికరణశుద్ధిగఁ బ్రేమించిన మాట వాస్తవము కాని యది స్వేచ్ఛాయుక్తం బగునని యిష్టానిష్టముల నాధారముచేసికొని యుండ నేరదుకద—ఆపితృండ్రి కోరిన చొప్పున నేనటులచేసితిని. అయిన నిట్టిస్థితి సంభవించునని యెఱుఁగ నైతి.

రంజ :—ఎట్లయినను నీవామెను మరణమునుండి కాపాడవలసినది. రంజనీవిజయుల నాలుగునేత్రములు కలిసికొనెను. తోడనే రంజని చూపులు నేలకు వ్రాలిపోయెను.

ప్రభా :—అయినచో నీమణిహార మాబాలిక కంఠమం దేల యున్నది.

రంజనీవిజయులు నిరుత్తరులైరి.

ప్రభా :—ఏమి! ఎవ్వరును మాటాడరు ?

అంతట మూఁగవాఁడు రంజనిని జూపుచు నామె గవాక్షమునుండి పద్మినిపై విసరికొట్టెనని సంజ్ఞలతోఁ బ్రభాకరున కెఱింగించెను. ప్రభాకరుఁ డొకక్షణమాత్రము కన్నులు మూసికొని,

ప్రభా :—రంజనీ! నీవు భారతసామ్రాజ్యపట్టమహిషివి? నా ధర్మపత్నివి. విజయా! నీవు నాకు బాల్యస్నేహితుఁడవు ఆర్యోత్కృష్టధర్మసంరక్షణదీక్షాబద్ధకంకణహస్తుండవై చంద్రహాసము ధరించినిలిచెడి సర్వసైన్యాధిపతివి.

రంజ :—ఆర్యసార్వభౌమా! కాను నేనట్టిదానను గాఁజాలను.

విజయ :—మహారాజా! తగను. అందులకు నే తగను. పదవీచ్యుతుఁడను.

ప్రభా :—హా! తాత! వసిష్ఠ! నీవాక్యముల కర్థమిప్పుడు భయంకరముగఁ బ్రత్యక్ష మగుచున్నది—హా! ప్రభాకరా! నీజీవిత మెటుల వ్యర్థమగుచున్నది. ఓపావనమగువిధీ! నీ వంధురాలవని క్రూరురాలవని నిందించువారు రజ్జులునుమా! నీవు ధర్మమూర్తివి.

మానవుని కర్మలకు నిష్పక్షపాతముగ ఫలము నిచ్చుచుండును. మంచిది—రంజనీ! విజయా! మిమ్ముల నేను నిందింపను, మానవుని మానవుఁడు నిందించుట కనర్హుఁడు. మానవావస్థయందు కించిజ్జ్ఞత యపరిపూర్ణత సహజముగఁ జేరియున్నవి. సృష్టియందలి యావ్యక్తులకు దయామయుఁడగు పరమేశ్వరుఁడే పశ్చాత్తాపము కలిగించి విశుద్ధులం జేసికొని జక్కఁబఱచుకొనును—కానివో! రంజనీ! విజయా! మీతోడ నే నెట్టిసంబంధము నుంచుకొనఁజాలను. పొండు యథేచ్ఛం బొండు. భరతమాత దురదృష్టము. పొండు నేనొంటరిగ నీసైన్యముల నెల్లవెంట గొనిపోయి యవనుల నెదుర్కొందును. ఈ స్త్రీతిలకమునకు చందన దారువులతో దహనసంస్కారములు జరుగుఁగాక. ఈ నారీమణిరూపము సువర్ణమునందు లిఖించి అచ్చోటనే స్థాపింతురుగాక! ఈదివ్యమణిహార మాస్వర్ణపద్మినీకంఠసీమయందు ఖచితమై యాచంద్రార్కము వెలయుగాక—ఇది ప్రభాకరసార్వభౌముని శాసనము.

సేవ:—దేవరవారి శాసనములు విధిసర్జితములుబోలె నవిలంఘనీయములు

చారులు ప్రవేశించి పాంచాలకాశ్మీరపతులు యవనపక్షము చేరిరనియు, గమలాకాంతుఁ జేలనో మతిచెడి తిరుగుచుండ వానిని ద్వైతవనంబున యవనులు బందిగఁగొనిపోయి రనియు నెఱింగించిరి. ప్రభాకరున కావార్త లేమియు విపరీతముగఁ దోఁచవాయె—నూతన విచార మెద్దియుఁ గలుగదాయె.

ప్రభా:—మంచిది. ఇఁక నేమియు విశేషములు లేవా? పొండు. అని చారులను బందివేసెను. రంజని వీడిన కేశపాశములు నేలనంట వంగి తనతలను వంచి ప్రభాకరుని పాదపద్మములపై మోపి మ్రొక్కి నమస్కరించి నోట మాటరాక నంతఃపురము వీడి యెటకో వెడలిపోయెను.

విజ:—పాపినగుట నేపిరికివాడనైతిని. కావున నేనాత్మహత్య గావించుకొనఁజాలనైతిని. అయిన నీవిజయుఁడు బొందిలో ప్రాణ

మున్నంతకాలము యథాశక్తి తనదేశమాతఋణము తీర్చికొనుటకే ప్రయత్నించుచుండును.

అని పద్మిని మృతకళేబరమునకు నమస్కరించి వెడలిపోయెను.

ప్రభాకరుఁడు పెద్దగట్టూర్పు విడిచి ".మహావిప్లవ మాపన్న మగుచున్నది. ధర్మాధర్మములు రెండును ఖాండవకౌరవాక్షౌహిణులవలె ప్రళయమునందు లయము కానున్నది. ఏల విచారము ?—ఏల యానందము ?— కాని 'హా'—హా! ఈపద్మి—ని—ప్ర—భా—క—రు—లకే పరిణయమయిన * * * "ధర్మసామ్రాజ్య మీ యార్యావర్తమున సుస్థిరంబై వెలసియుండదే" అని అశరీరవాక్య మొండు వినబడినది. ప్రభాకరుఁ డులికిపడి నింగి దిక్కు చూచుచు "ఔనిది వసిష్ఠ వాక్యము—నిశ్చయముగ జాతికుల సాంకర్యదోషకర్మపరిపాక మిదియ" అని సత్యమును గ్రహించెను. కాని యిప్పుడేమిలాభము ? లోకపరిణామమున కాధారమాత్రమగు కాలమునందు జారిపోయిన యొక్క క్షణము దిరిగి చేఁజిక్కదుకద !"

అయినను నిష్కారుణకర్ముఁడగు ప్రభాకరుఁడు రాత్రి మందిరమును వీడి కవచఖడ్గములఁ దాల్చి సైన్యములకు స్వయముగ నాయకత్వము వహించి వహ్నిసూర్యాభిముఖుఁడై శత్రువుల బాఱఁదోలఁ జనుచుండెను.

౨౯

సార్వభౌమునిశాసన మనుసరించి పద్మినికి మహారాణికివలె నంత్యసంస్కారములు జరిగెను. ఆయువతీరత్నముయొక్క స్వర్ణవిగ్రహము కూడ శ్మశానవాటికయందు ప్రతిష్ఠింపబడెను.

సాయంసమయమైనది. భూమ్యాకాశంబులు రక్తవర్ణము దాల్చినవి. కమలాకాంతునిభార్య వసుమతి యానమయమున నొంటరిగ రుద్రభూమియందు విహరించుచు పద్మినిస్వర్ణవిగ్రహము కడకు వచ్చి

"నాకమలాకాంతుఁ నెందు దాచితివి చెప్పవే" అని కాలితో గట్టిగఁ దన్నెను. పద్మిని మాటాడలేదు. కాని వసుమతి కాలువగిలి రక్తము చిమ్మజొచ్చెను. వసుమతి యది సరకు సేయకయే పిచ్చిదానివలె నేమేమియో ప్రేలుచుండెను. నిజముగ వసుమతికి గూడ బిచ్చియెత్తి నటులనే తోఁచుచున్నది. ఇంతలో రంజని అచ్చటికి వచ్చి "చెలీ! వసుమతీ! ఏమీ కాలు రక్తము కారుచున్నది!" అని ప్రశ్నించెను. శ్మశానవాటికయందు మహారాణిని గాంచినంతనే వసుమతి విభ్రాంతపడి నిల్చి "ఏమిది! నాఁడు నిన్ను బరిహసింపఁదలఁచినందులకు ఫలము నేఁడు నాకే ప్రత్యక్షమైనది. కాని మహారాణి నేఁడిందులకు రాఁగతం బేమి!" అని యడిగెను.

రంజ:—మహారాణి యెవరు!

వసు:—రంజనీదేవి.

రంజ:—కాదు.

వసు:—మ తెవ్వరు?

రంజ:—పద్మినీకాంత

వసు:—అదేల?

రంజ:—రంజని ప్రభాకరునికి తగదు. పద్మినీ ప్రభాకరులకు తగియుండెడిది.

వసు:—అయ్యో! అట్లనెదవేమి?

రంజ:—సత్యమునే వచించుచుంటిని. రంజని యిఁక నసత్యము లాడదు. కపటము బూనదు.

వసు:—నాకేమియు బోధపడుట లేదు.

రంజ:—సార్వభౌముఁడు నన్ను బరిత్యజించెను.

రంజనీవసుమతు లిరువురును బిట్టు వాపోయిరి. వసుమతి "ఏల పరిత్యజించెనే" వని యడుగలేదు. రంజని చెప్పలేదు. కారణ మిరువుర కును విప్పి చెప్పినటులనే యున్నది—ఎట్టకేలకు రంజని "వసుమతీ!

ఇంచుమించుగ మన మిరాపుర మొక్కతీరుగనే యుంటిమి——ఇఁక మనకు గతియేమి ?''

వసు :——ఏమున్నది దేవీ ! అధోగతియే !

రంజ :——నాకొక్కయుపాయము తోఁచుచున్నది.. ఎట్టి నిర్భాగ్యురాలి నైన నాకలిబాధ తప్పదుగద ! ఎటులయిన నాకు నాతండ్రియగు యువనాథునికడకు బోవలెనని యున్నది. కాని యొంటరిగఁ బోవుటకు సాహసము చాలకున్నది. సిగ్గగుచున్నది. నీవుకూడ వచ్చిన యెడల మన మిరువురము కలసిపోదము——ఇచ్చట నిఁక మన కేమున్నది ?

వసు :——నాథ ర్త యెటుబోయెనో వెతకికొన నక్కఱలేదా ?

రంజ :——కమలాకాంతుని వారు బంధించిరఁట, ద్వైతవనంబున జిక్కెనఁట. వాని విముక్తునిజేయు నుపాయము నే నరసెద. రమ్మా ! చెలీ ! కలసిపోదము.

వసుమతి వల్లెయని యంగీకరించెను. ఇరువురును యడవిదారులఁ బట్టి యువనస్కంధా వారము చేరఁబోవుచుండిరి. మార్గమధ్యమునఁ జీకటిపడినది. రంజనీ వసుమతు లిరువురు మఱ్ఱివృక్షముక్రింద నెండుటాకులపై బరుండిరి. వసుమతికి క్షణములో గాఢనిద్ర బట్టెను. కాని రంజనికి నాఁడు కన్ను మూతపడదాయె. అటులనే వటశాఖాంతరములనుండి గగనము తిలకించుచు గతము తలపోసికొనుచు రంజని పండుండి యుండెను. కట్టెదుట—— మఱ్ఱియాకుల నడుమనుండి యొక నక్షత్రము మినుకుమినుకు మనుచుఁ గనబడుచుండెను. రంజని తెప్పవేయక దానినే తిలకించుచుండెను. ఇంతలో నానక్షత్రము క్రమక్రమముగ వృద్ధిగొంది పెద్దదగు భూతలమునకు దిగుచున్నటులఁ దోఁచె. ఇంకను మిక్కిలి నమీపించె. మిక్కిలి చేరువకు దిరుగుచున్నటులఁదోఁచె. నమీపించినకొలఁది కాంతిపుంజము యొక కాంతామణి యాకృతి దాల్చుచుండెను. ఇంకను సమీపించెను. భూమికి నొక

జానెఁడువఱకు వచ్చినటు లుండెను. రంజని యుదరిపడి లేచి యెడమ చేతిపై నానికూర్చుని—భూమిని తాకకుండఁగ నతిసామీప్యముగ వచ్చిన యా తేజోమయస్త్రీరూపమును గాంచి భయమంది దిగ్భ్రమ గాంచి డగ్గుత్తికతో—

రంజ:—ఎవరు?

ప్రియం:—మీకొఱకు ప్రాణముల విడచిన నేను—

రంజ:—హా! ప్రియంవదా! ప్రియంవదా! ప్రియంవదా! క్షమింపుము. ఇంతవఱకు నీమాటయే మఱచిపోతిని. ఉన్నతపదవియం దున్నది. ఆమాంద్యత, అధికారమదాంధత!

ప్రియం:—కోరున దేమనగా—

రంజ:—ఇప్పుడు నేనేమికోరికలఁ దీర్పఁగలను. సఖీ—నన్ను గూడ నీవెంటఁ గొనిపొమ్ము. తప్పక వచ్చెదను.

ప్రియం:—నీవు చేసినద్రోహము చాలును. అలకసుందరునితోఁ గలియవలదు — భరతఖండమునకు సామ్రాజ్ఞివిగాఁ గోరకుము. పశ్చాత్తప్తురాలవు గమ్ము — ఉపవాసాదివ్రతంబులఁ బూనుము — అరిషడ్వర్గమును జయింపుము — ఆశల కింకను లోనుగాకుము — అలకసుందరునిఁ జేరబోకుము — ఆ ప్రవచనముల నాలకింపుము.

అని వాక్యపరంపరలు తంత్రీస్వనంబుగ నస్పష్టముగ వినబడఁ జొచ్చెను. క్రమక్రమముగ నింద్రధనుస్సువలె యా తేజోరాశి యంతర్ధాన మందెను. "ఆలకింపుము" అనువాక్యము ముగియుసరికి అటనంతయు నంధకారమే. రంజని నల్గడల తేరిపారి జూచెను. ఎప్పటి స్థానమున మునుపటివలెనే చుక్కమాత్రము మినుకుమినుకుమని మెఱయుచుండెను. కీచురాలనిస్వనము యథాప్రకారము వినఁబడుచుండెను. వసుమతి యింకను ప్రక్కను నిదురించుచునే యుండెను.

రంజ:—ఆహా! ఏమిచిత్రమిది? ఇంద్రజాలమా? కాదు—ఇంద్రియవిభ్రమమా? అదియుగాదు—నామనోగతంబగురహస్యము, ఈవ్యక్తి యెవరు? ఎటుల గ్రహించెను? వసుమతితోనైనఁ జెప్పలేదే

లేక యిదియొకస్వప్నమా? ఏమైన నేమి? — ఇప్పు డటుపోవుదునా? యిటుఁ బోవుదునా? ఎటు బోవుదును? నేను దురదృష్టవంతురాలనని నాగతచరిత్రయే చెప్పుచున్నది. ముందుమాత్రము నాయాశలు ఫలించి విజయుఁడు మహారా జగుటయు నే మహారాణి నగుటయు సంభవింప నేర్చునే? అదేమిపాపమో, పుణ్యమో కాని విజయునియెడఁ బ్రేమ నాహృదయమును వీడుటలేదు.

గాండ్రుగాండ్రుమని బొబ్బలిడుచు భయంకరమగు వ్యాఘ్ర మొండురంజనీవసుమతు లున్నచోటి కతివేగముగ నుడాముఃలమీద వచ్చుచుండెను — ఆచిమ్మచీఁకటియందు పెద్దచింతనిప్పులవలె దాని రెండుకన్నులుమాత్రమె దృగ్గోచర మగుట మఱింతభీతిఁ గొలుపు చుండెను.

రంజనిమనస్సును వేధించుచుండిన సమస్య నతిత్వరితముగఁ బరిష్క రింపఁబడెను—ముందునకు పయనము సాగుట యీశ్వరున కిష్టము లేదు కావుననే ఈబెబ్బులి మనమీఁది కిప్పుడు పంపఁబడుచున్నదని రంజని నిశ్చయించుకొని—వెనుకకుఁ బాఱిపోవుటయు నసంభవమే. మరణమే ధృవమని నిశ్చయించుకొని "యీశ్వరా! మేము నీచేతి లోని కీల్బొమ్మలము — అంతయు నీదే భారము—నీయిచ్చవచ్చినటులఁ జేసి వినోదించుము" అని యూరక కొయ్యబొమ్మవలె నిలువఁబడి యుండెను వసుమతి లేచి యేమియుఁదెలియక బిగ్గరగ వాపోవు చుండెను. పులియు నూఱుగజముల దూరములో నున్నది. అంతలో నెచ్చటనుండియో నారసము వచ్చి దాని కుడిప్రక్కలోనుండి జొచ్చి ముఖమునుండి నగమువఱకు దూసుకొని వచ్చెను—తోడనే పులియుఁ దన సహజశౌర్యము ప్రకటితము కా వెనుకకుఁ దిరిగి తనశత్రువుపై నొక్కుమ్మడి లంఘింప నుంకించుచుండ మఱియొక బాణము వచ్చి దానిముందరపాదముల నఱికివైచెను. అంత తన దేహమునుండి కారిన రక్తపుమడుగులోఁబడి పొరలిపొరలి ప్రాణముల విడిచెను.

ఇంతలో నచ్చుటికి విల్లంబులు బూని కవచఖడ్గములఁ దాల్చిన విజయసింహుఁడు వచ్చి రంజనీవసుమతులఁ గాంచి,

విజయ :—మీ రెవ్వరో మిక్కిలి యదృష్టవంతులు—మిమ్ముల నేఁజూడనే లేదు. వ్యాఘ్రముగదా యని శబ్దమును బట్టి గురిపెట్టి కొట్టితిని.

వసు :—విజయసింహప్రభూ! నేను గమలాకాంతుని భార్యను, దురదృష్టవంతురా లగు వసుమతిని ఆమె మనమహారాణి రంజని. మీ మూలమున మేము తిరిగి తల్లిగర్భమునుండి బ్రతికి బయటఁబడితిమి.

రంజ :—విజయా! విజయా! విజయా!

విజయ :—మీ రెందుబోవుచుండిరి?

రంజ :—నీవు?

విజయ :—రణరంగమునకు.

రంజ :—ఏల?

విజయ :—విధ్యుక్తకర్మనిర్వహణార్థము— దేశమాతృ ఋణ విముక్త్యర్థము—సార్వభౌమ విజయసంపాదనార్థము—

రంజ :—విజయము ధ్రువమా?

విజయ :—పద్మినీదేవి పాదకమలములఁ బూజించి వచ్చుచుంటిని. విజయమునందు నాకు విశ్వాసము కలిగినది.

రంజ :—విజయమందిన నీ కేమిలాభము?

విజయ :—ప్రభాకరుని సామ్రాజ్యము నిలుచును. ఆర్యధర్మము సంరక్షితమగును. రంజనీ—ఏమిమాటలివి?

రంజ :—మన కేమిలాభము? నాతండ్రి యవనసార్వభౌముఁ డివ్వా డచ్చట విడిసియుండెనో!

విజయ :—ఇవ్వా డచ్చటికి పోవలెనని యున్నదా?

రంజ :—నీవుకూడ రావచ్చును. వారు మనల సత్కరింతురు. కార్యావసరమున్నవారు తప్పక సత్కరింతురు. నీకే భరతసామ్రాజ్యము

పట్టముకట్టెదరు. మనము గోల్పోయిన యున్నతస్థానములఁ దిరిగి యాక్రమించుకొనవచ్చును.

విజయ :—నన్ను పట్టభద్రుని చేతుమనియు నీవు నాకుఁ బట్ట మహిషివగుదు వనియు నాకడ కిదివఱకే నీతండ్రి రాయబార మంపి యున్నాఁడు. కాని నేనప్పుడే యా రాయబారము తిరస్కరించితిని. ఇప్పు డికఁ జాలును. రంజనీ మనకిఁకఁ జాలును:—ఉన్నతపదవులు చాలును. వైవాహికసుఖములు చాలును—జీవితములు క్షణభంగుర ములు—మృత్యువు వెన్నంటి వచ్చుచున్నది. అది గుర్తించుకొనుము. ఇప్పు డీవ్యాఘ్రమువలని గండమే ఆవశ్యము నీకుఁ గొంత యనుభవము లోనికి తెచ్చియుండును. నీవు చెప్పినటుల వల్లెయని మన మొక యడుగు ముందు వేయఁగనే యేనల్లత్రాచయిన నీచీఁకటిలో మనల నొక్కరిని కాటువైచిన నైవరాదా? అప్పు డీనీయోజనలు, ఆశలు, ఆకాశహర్మ్యము లేమగునో—ఐహికభోగము లెం దరుగునో యించుక యూరసి వానిఁ దెలిసికొమ్ము. చాలును. మనకీసంబంధ మిఁకఁ జాలును. నీతరుణోపాయము చూచుకొనుము. అజ్ఞానమునఁ బడి పోకుము.

రంజని కొక్కమాఱుగ మనను విరిగిపోయెను. వైరాగ్యము కలుగుచున్నది.

రంజ :—పాప మీవసుమతి భర్తను విడిపింతు నని మాట యిచ్చితినే!

విజయ :—అయ్యో! కమలాకాంతుఁడా! కాలముచేసినాఁడట. వారుబంధింపయులకసుందరునిద్రోహాల నుంచిరి. అంతట వాఁడు పాముల చేఁ గఱపించి చంపించినాఁడు. పిచ్చివాఁడని యైనఁ గనికరింపఁడాయె.

ఆవార్త వినినంతనే వసుమతి భూమిపై బడి దొరలుచుఁ బొక్కి పొక్కి యేడ్వసాఁగెను. ఎట్టకేలకు వసుమతి నూరడించి రంజనీవసు మతులకు త్రివేణీప్రాంతమునకు దారిచూపి విజయుఁడు పాంచాలమం దేర్పడియున్న రణరంగమున కరిగెను.

పాంచాలమున యవనులకును నార్యులకును ఘోరయుద్ధము జరుగుచుండెను. యవనుల యుద్ధకౌశలమును, నార్యుల ధైర్యసాహసములును యవనుల విజిగీషయు, నార్యుల స్వేచ్ఛాసక్తియు, యవనుల ప్రభుభక్తియు, నార్యుల దేశభక్తియు నొండొంటిఁ బ్రతిఘటించి బహువిధముల విజృంభించుచుండెను. కాని మొత్తముమీఁద జయము యవనుని వైపునకే మ్రొగ్గుచున్నటు లున్నది. అయినను బ్రభాకరుఁడుత్తమాశ్వముపై నెక్కి చంద్రహాసాలంకృతమగు హస్తమునెత్తి, తనసైన్యపంక్తులనడుమ నెల్లెడల మెఱుపువలె మెఱయుచు, నిరాశాంధకార మించుక పొడసూపునంతన తిరిగి వెంటనే యట నూతనోత్సాహకాంతుల వెదఁజిమ్ముచుండెను.

సాయంతన మైనది. ప్రభాకరుఁడు శిబిరమునం దొంటరిగఁ గూర్చుండి యిటులఁ దలపోయుచుండెను. యవను లజేయులై తోఁచుచుండిరి. అక్కటా! వారి పాఱఁదోలు నుపాయము గానరాకున్నది. నాసైన్యములో నిరుత్సాహము పొడసూప మొదలిడెనుగా నేఁడు! హా దైవమా! నీకింక నార్యావర్తముపై దయకలుగ లేదా?

ఇంతలో విజయసింహుఁడు గూఢచారివేషంబున శిబిరముఁ బ్రవేశించి సార్వభౌముని పాదములకడ సాష్టాంగపడి లేచి నిలువఁబడెను. విజయుఁడు ప్రభాకరునికడ గూఢచారిగాఁ గుదిరెను. యుద్ధమునం దొక సైనికుఁడుగ నంగరమొనర్చెను. ప్రభాకరుఁడు విజయునిఁ జాలవఱ కానవాలుపట్టెను. కాని గాంభీర్యమును వహించి యావిషయమై విజయుని నేమియు నడుగలేదు.

విజయ:—జయము మహారాజా! జయము.

ప్రభా:—నీవు మాకీయుద్ధమున మొదటినుండియు తోడ్పడుచుంటివి. కాని నేఁడు......,

విజయ :—అట్టిమాట ప్రభువువారినోటినుండి రాఁదగినది కాదు. మనబలములనిరుత్సాహ మంకురింపఁదొడగినమాట యనుమానము. కాని శత్రుబలములు నిరాశయందు మునిగిపోయి యున్నవి—నేటికి వారిబలములలో మూఁడవవంతు నర్మదప్రవాహమున నశించినది. నేఁడు వారి యేలికనేఁ నల్లత్రాచు కాటువైచినదఁట.

ప్రభా :—అక్కటా! యేమి దురదృష్టము!

విజయ :—మనమహాదృష్టము! ఈశ్వరుఁడు ధర్మపక్షమునకే యుండును.

ఇంతలో గొందఱు సేనానాయకులు వచ్చి "యవనులు తెల్లజెండా నెత్తిరి. ఏమిసెలవు! ఏమికర్తవ్యము!" అని యడిగిరి.

ప్రభా :—వారు తెల్లజెండా నెత్తిరా! వెంటనే మనసైన్యములనుగూడ "నాగు" డని యాజ్ఞాపింపుఁడు.

ఒక సేనాని :—దేవా! ఇట్టి మంచితరుణమును మనమేల జారవిడువవలయును.

ప్రభా :—వారి ప్రభువు నర్మదపాలైపడియుండెనఁట!

సేనాని :—మఱియు మంచిదికద! ఇప్పుడే యొక్కుమ్మడి వారిపైఁబడి పేరులేకుండ నాశనము చేయవచ్చును. మనసైన్యము లలసిపోవుచున్నవని తెలిసి భగవంతుఁడే మనకిట్టి శుభావకాశము కలిగించియుండును. 'ధర్మమేవ జయతి' యనునూక్తి యేలయనృతమగును!

ప్రభా :—ఆర్యులు ధర్మాశయబద్ధులగుదురో కాదో యిప్పుడుగదా సత్యము తెలియవలయునని యీరీతి కల్పించెను. ఇప్పుడు యవనులపై విజృంభించుట నీచము. పిఱికిదనము—పౌరుషహీనము అధర్మము—ఆర్యులకుఁ దగనిపని. ఇంతకుపూర్వమే పాముకాటునకు విఱుగుఁడు వారికిత్తుమని వార్తనంపి యుంటిమి. కాని మనయొద్దనుండి అట్టిసహాయము కోరి యంగీకరించుట వారికి గౌరవము కాదని వారు నిరాకరించి యుండిరి.

విజయు:—దేవా! అటుల కాదు. మన మేవిషమునైన నంపుదు మేమోయని వారు భయపడిరి. ఎట్టివారి కట్టియూహాలే తోఁచుచుండును.

ప్రభా:—కాని వారి కీసర్పవిషమునకుఁ దగుచికిత్స తెలియదు. ఆ కారణమున నిండుజీవు లెన్నియో గతించుచున్నవి. ఇఁక నాలసింపఁ జనదు—నేనే యిప్పుడు స్వయముగాఁ బోయి అలకసుందరుని మృత్యువు బారినుండి కాపాడెదను.

అందఱును దిల్లబోయిరి. ఏమి చేతురు! నాఁడు కురుక్షేత్రమున ధర్మరాజు గురువందన మాచరింప కౌరవశిబిరమునకుఁ పాదచారియై పోవుచుండ నెవ్వ రాపగలిగిరి?

యుద్ధము తాత్కాలికముగ విరామమందినది. * * *

యవనస్కంధావారమున నొక విశాలపటకుటీరమున నలక సుందరుఁడు పాన్పుపైఁ బడియుండెను. అతనిపజ్జ నొక యోగిపుంగవుఁడు పద్మాసనము వైచికొని ధ్యాననిశ్చలుఁడై కూర్చుని యుండెను. అతని చూపు అలకసుందరుని వామపాదముపై స్థాపితమైనటు లున్నది. ఆ కాలి బొటనవ్రేలిపైననే పాము కఱచినది! ఆప్రక్కనే సాయుధులై యంగరక్షకులును కొందఱు యుద్ధమంత్రులును, యవనరాజ వైద్యులును రెప్పవేయక యోగిపుంగవుని ధీరమూర్తివంతమును తిలకించుచుండిరి. సూదిరాలినను వినబడునంతటి నిశ్శబ్దము! అలకసుందరుని యవయవములందు చైతన్యము దృశ్యాదృశ్యముగఁ బొడగట్టుచుండెను. ముఖమున జీవకళ మబ్బుమాటునుండి కానవచ్చు లేవెన్నెలవలె నించుకించుక దోఁచుచుండెను. యోగిమోమున పూర్ణనిర్మలానందము సూర్యోదయమువలె స్పష్టముగఁ బ్రకటితమగుచుండెను.

అంతఁ నాతఁ డలకసుందరుని కుడిచేతి నెత్తిపట్టి నాడిపరీక్ష జేయఁ దొడఁగెను. అందఱును వింతగా నాత్రముతోఁ జూచుచుండిరి.

ప్రభా:—"బ్రదికెను! భయములేదు." అని చెప్పెను. అప్పు డచ్చటివారిమనస్సెంతయానందించెనో వారికే యెఱుక! మృత్యుంజయుఁడని భావించి భక్తిగౌరవములతో యోగిని వీక్షణమాలికలతోఁ బూజించుచుండిరి. యోగి స్వచ్ఛమగు జలము నించుక తెమ్మని కోరెను. తళతళ మెఱయుచున్న చిన్నగాజుగిన్నెతో నిర్మలోదకములు క్షణములోఁ దీసికొని రాఁబడెను. ఆజలమును బరిశీలించి చూచి యోగి తనయొద్దనున్న యొకయొట్టినివేళ్ళముక్క నాసీటియందు పడవైచెను. పదికనురెప్పపాటుల కాలములో నీరంతయు కూడ నెఱ్ఱ పడిపోయెను. ఆనీటిలో వేపచిగురు ముంచి యలకసుందరుని మొగము కాలిబొటనవ్రేలిపై నద్దెను — అటులనే వానిపెదవులఁగూడ నీటితోఁ దడిపెను.—అప్పు డచ్చటివారంద ఱొక్కమాఱేలనో యులిక్కిపడిరి. కాని యేమియు మాటాడలేదు — అలకసుందరుఁడు పెదవులు విప్పి చప్పరింపఁదొడగెను. యోగి మఱిరెండుమూఁడులు జలబిందువులతో వానినాలుక తడపెను—అలకసుందరుఁడు కనువిచ్చి చూచెను.

ప్రభా:—యవనసార్వభౌమా! యెట్లున్నది?

అని పలుకరించెను. అలకసుందరున కాపిలుపు వినఁబడినట్లు స్పష్టమయ్యెను. కాని తిరిగి చెప్పిన జవాబు స్పష్టముగ వినఁబడలేదు.

ప్రభా:—ఈఔషధమును గుటక వేయుము.

అనిచెప్పి పదిలముగ నాజలపాత్రము నోటికందిచ్చెను. మొదట యించుక శ్రమమైనను; రెండవగుటుక నులువుగఁ బడినది.

ప్రభా:—(అచ్చటనున్న మంత్రివంకఁ దిరిగి) చికిత్స పూర్తి అయినది. నేను వెడలిపోయెదను.

మంత్రి:—అటుల సెలవీయవలదు. యవనులు కృతఘ్నులు కాఁజాలరు.

ప్రభా:—చాలు. ఈమున్నదయె చాలు. పరుల కుపకారము చేసిన నాకేయుగలుగుటయందే తత్ప్రతిఫలము కలదు. అన్యమువలదు అని లేవబోవుచుండ

అల :—మహానుభావా! అవిమీకుఁ దగదు. పోవలదు మీ ఋణము మే మెట్లును దీర్చుకొనఁజాలము. అయినను యేదో......

ప్రభా :—ఆహా! సార్వభౌమా! నీవు బ్రదికితివి. నాకదియే కావలసినది. నే నన్యము కోరను.

అల :—మీరు మహాత్ములు! మీ యార్యజాతిని నేను సంశయించి యవమానపఱచితిని. ఒకప్పుడు మీయేలిక ప్రభాకరుఁడు మాకు సందేశమంపియుండెను. "సర్పవిషమునకు విఱుగుఁడు కావలయునేని మేము సంతోషపూర్వకముగ మీకా యౌషధి నిచ్చెదము" అని. కాని యప్పుడు మీ మార్యుల విశాలౌదార్యహృదయము తెలిసికొని నమ్మజాలకపోతిమి. ఆపాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్త మైనది.

ప్రభా :— జరిగినదాని కేమి? ఇప్పుడు మీరు కోరుదురేని యామూలికాప్రక్రియ నే నెఱింగింపఁగలను.

అలకసుందరుఁడు మంత్రులవంకను, రాజవైద్యులవంకను జూచెను. యవనవైద్యులు యోగికి నమస్కరించి "మహాత్మా! తమకట్టి యనుగ్రహము కలుగుటచే మేము ధన్యులము —ఆహా! ఆర్యావర్తమునందే కద మొదట జ్ఞానసూర్యుఁడుకూడ నుదయించుచుండుట!"

అంతట యోగి తనయొద్ద నున్న యౌషధి వారల కిచ్చి దాని పేరెఱింగించి, యుపయోగించువిధానమెల్ల నుపదేశించెను.

అలక :—మీరు మావెంట మాదేశమునకు విచ్చేసి మమ్మను గ్రహింపరా?

ప్రభా :—వచ్చిన రావచ్చును. కాని యార్యులు స్వప్రయోజనాపేక్షితులై యన్యదేశములకుఁ బోవువారు కారు. నేను సెలవుఁ దీసికొనియెద.

అలక :—పునర్దర్శనము—

ప్రభా :—"భగవద్విలాసము" అని చెప్పుచు వెడలిపోయెను. యవనస్కంధావారమున వాని కెమ్మరైన వారందఱును సాక్షాత్క-

రించినపరమేశ్వరునివలె భక్తితో సమస్కరించిరి. యోగి యవనశిబిరములు దాఁటి, ఆర్యశిబిరాభిముఖులై చనుచుండెను— ఇంతలోనె, పేమాటులనుండియో, ఆర్యసేనానులు వచ్చి వానికి సమస్కరించి సగౌరవముగఁ దమస్కంధావారమునకు గొనిపోవుచుండిరి. ఆ యోగి ప్రభాకరుఁడని వేఱుగ వ్రాయనక్కఱలేదుగద!

అయినను నావిషయము యవనులకు స్పష్టముగఁ దెలియదాయె. ప్రభాకరుఁడా! లేక ప్రభాకరునికడ నుండు ఘనవైద్యుఁడా యని సంశయింపఁదొడఁగిరి. ఎట్లయినను యవనగౌరవమునకు నేఁడు కొంత వన్నె తరిగెను, లాఘవము కలిగెననుభావము యవనశిబిరముసందంతటను వ్యాపించెను.

* * * * * *

తిరిగి యుద్ధము ప్రారంభమాయెను. ప్రభాకరుని సైన్యములకు విశ్రాంతి చాలదు. విజయసింహుఁడు ఏకయోధుఁడై పోరుచుండెనే కాని సర్వసైన్యాధిపత్యము వహింపలేదు. విజయుఁడు తన్ను ప్రభాకరుని కలిగించుకొనలేదు. ప్రభాకరుఁడును యథార్థనిశ్చయము చేయఁదలచుకొనలేదు. దైవయోగమునఁ ప్రభాకరుని సైన్యము లోడిపోయెను. చాలవఱకు యుద్ధభూమిని మడసినను, మిగిలినవారు నల్దిక్కులకు చెల్లాచెదరై పాఱిపోయిరి. అయినను ప్రభాకరుఁ డింకను యుద్ధము విరమింపఁడాయెను. కాని యేమి లాభము? తుదకు యవనులు ప్రభాకరునిపట్టుకొని ఖైదుచేసిరి. యవనస్కంధావారము ఎల్ల విజయోత్సవములతో మాఱుమ్రోగుచుండెను.

నేఁడు విద్రోహి యగుప్రభాకరుని యవనసార్వభౌముఁడు విచారించి శిక్షించునఁట!

తెల్లవారునప్పటికే పటమండిర మెల్ల నానాదేశగతులగు రాజబృందములతో, దండనాయకులతో, సాయుధులగు యవనయోధు

లతో నిండియుండెను శృంఖలా బద్ధహస్తుండగు ప్రభాకరుఁ డలకసుంద రుని ముందు నిలువబెట్టఁబడెను. అంతట

అంతి :—మహారాజా! యీప్రభాకరుఁడు పాతనేరగాఁడు. ఇదివఱకొకసారి దేవరవారిచే శిక్షింపఁబడి ఖైదు ననుభవించెను.

అలక :—ఔను. చక్కఁగా జ్ఞప్తిచేసితివి ప్రభాకర! అప్పుడు మాయవ్యాజకరుణాకటాక్షము చేతనేకద చెఱనుండి విముక్తుడవై తివి! ప్రభాకరుఁడు జవాబుచెప్పక నిర్లక్ష్యముగ నిలువబడి యుండెను.

అంతి :—సత్యము. కాని కృతఘ్నుఁడగుటచే నామేలుమఱచి ప్రభువుగారిమీదనే కుట్రలు పన్ని విద్రోహము గావించినాఁడు. ఈమాత్రమైనను దయకు పాత్రుఁడుకాఁడు.

అలక :—ప్రభాకర! నీవు రాజద్రోహివై యవనసామ్రాజ్య మునకుఁ జెందిన యార్యావర్తమునందు తిరుగబాటు లేవదీసితివని నీపై నేరమారోపింపఁబడినది. నీవేమి చెప్పఁగలవు?

ప్రభా :—నేనార్యుఁడను. మీరు యవనులు. యవనరాజగు నలకసుందరుఁడు నాప్రభువని నేనిదివఱకెన్నఁడును నంగీకరించియుండ లేదు. ఇప్పుడును నంగీకరింపను. కావున మీరు వచించెడి "రాజ ద్రోహి" శబ్దము నాకెటు లన్వయించెనో తెలియకున్నది. నేను ప్రతి మానవునకు ధర్మమగు స్వదేశోద్ధరణమునకై నాశక్తికొలఁది పాటు పడితిని. దానిని మీరెటుల భావించికొనినను నే నరకుచేయువాఁడను గాను.

సభ యంతయుఁ గోపముతోడను, ఆశ్చర్యముతోడను పులకాంకితమై పోయెను.

అలక :—బీరములు చాలును. మొన్న మొన్ననే యాశమలా కాంతుని గతి యేమయ్యెనో యెఱుఁగవు కాఁబోలు.

అంతి:—ప్రభాకర! ఇటువినుము. వాఁడును రాజద్రోహము గావించినందులకే శిక్షింపఁబడెను. అరచేతులలో సివ్వాలుంచఁబడెను. గడ్డము, మీసము, తలవెండ్రుకలు కొంచెముకొంచెముగ పీకివేయఁబడెను. పిదప గ్రుడ్లు పీకివేయఁబడెను. పిమ్మట కాలివ్రేళ్లు నరుకఁబడెను. తరువాత రెండుచేతులకును రెండు నల్లత్రాచులు చుట్టుకొని కంఠమునందును, కడుపుమీఁదను గాటులు వైచి చంపివేసెను.

ప్రభాకరుఁడంతట నొకమందహాసము గావించి "దేవుడు దయాసముద్రుఁడు మిమ్ముల క్షమించుఁగాక!" యని యనెను.

అలక:—నీయమోఘం బగు మాశీర్వచనముచే మే మెల్లరము ధన్యులమైతిమి. రంజనిని నీవేల లేవఁదీసికొని వచ్చితివి?

ప్రభా:—విధివిలసితము:—

అలక:—ఇప్పు డెచటనున్నది? మిమ్ముల నిరువుర కలపియే శిక్షింపవలయును.

ప్రభా:—రంజనినిగాని మరెవ్వరినిగాని మీరు శిక్షింపనక్కఱ లేదు. ఎవ్వరెవ్వరిపై మీర లేయే నేరముల మోపఁదలచిరో ఆయా నేరములకెల్ల నేను బాధ్యుఁడనని ప్రకటించుచుంటిని. కావున మీయిచ్చ వచ్చిన శిక్షకెల్ల నేన గుఱియగుటకు సంసిద్ధుఁడను.

అలక:—బలత్కారముగా సంఘటింపచేసికొనిన బాంధవ్యము తలంచితో — నీవు కృతఘ్నుఁడ వన్నమాట మఱచి నీమెడ దయ వహించితో నిన్ను నీమాఱు క్షమించి విడుతురని యాశ కాఁబోలు. వెఱ్ఱియాశల బెట్టుకొనకుము. నీమాటల కర్థము తెలిసి మాటాడుము. ఇది యవనసార్వభౌముఁడు న్యాయము తీర్చుటకు కొలువుతీరి యున్న దర్బారుయని గ్రహింపుము.

ప్రభా:—యవనుఁడు బంధించినంతమాత్రముననే నే భీతావహుఁడనై దిగ్భ్రమచెంది యుండలేదు. వృథా కాలయాపనతోఁ బనికాదు.

అలక :—అంతిమోహకుఁడా! వీని నిప్పటికి బంధించి యుంచి రంజని మెచ్చుటనున్నదో వెతకింపుము ఇరువురను జేర్చి యపూర్వం బగుశిక్ష విధింపవలయు.

ప్రభా :—మంచిది. నాజీవితనాటకమందు చెఱసాలయె మొదటి యంకము. తుదియంకముకూడఁ జెరసాలయె యగుట కడుంగడు రమణీయముగద ?

అని భటులవెంటఁ జెరసాలకు నడచుచున్నపుడు ప్రభాకరుని మోము మిక్కిలి ప్రశాంతమై గంభీరమై యార్యనిప్రతిభ యుండే మూర్తీభవించెనోయన నుత్తేజితమై యొప్పుచుండెను. ప్రభాకరుఁడు వెడలిపోయెను. కాని వానిరూపము, కంఠస్వరము యాయపూర్వ దివ్యమందహాసము, యచ్చటివారి మనోఫలకములపై గాఢంబుగ ముద్రింపఁబడి యనిర్వచనీయం బగుభయవికారమ్మును గలగించు చుండెను. ఇప్పుడెవరు జయముగాంచిరి ? ప్రభాకరుఁడా! అలకసుంద రుఁడా! అని యందఱు నొకవిధ మగుసంశయమునకు లోనయిరి.

చీఁకటి పడినది. జాములు గడచుచున్నవి. విజయోత్సవములతో నాటపాటలతో, విందులతో మద్యపానములతో యవనశిబిరములు మునిగి తేలుచుండెను.

మూఁడవజాము గడచినది. శిబిరమెల్ల నిద్రాదేవి కౌఁగిటిలోఁ జొక్కి సుఖించుచుండెను.

"ప్రభాకరు నెటులనైన విడిపింపఁగలుగుదునా!" యని విజయ సింహుఁడు తత్పరిసరములయందె డాఁగి తిరుగుచు నెన్నియో విధ ములఁ బర్యాలోచనల గావింపుచుండెను. తుదికెద్దియు నుపాయము తోఁపక "ఒక్కసారి యాశిబిరముపైఁబడి కత్తికందినంతవఱకు కసి దీర దెగవేసి హారిప్రేతులపడి సుఖముగఁ బ్రాణముల విడుతునా!—" అని తలంచును. తిరిగి "అది కార్యకారి కాదు. అందువలన నేమియు బ్రయోజనము లేదు. నే నిటుల కేవలము క్రోధవివశుఁడనై పిచ్చివాని

వలెఁ బ్రవర్తింపఁదగదు." అని యనుకొనెను. "దేశములోని కరిగి ప్రయత్నించి పీలగునాడలఁ గొంతిబలమును కూర్చుకొని వత్తునా!— "అయ్యో! అది యెంతయో కాలము బట్టునే!— ఈలోపునే సార్వభౌముని వా రేమిచేతురో!" అని వితర్కించుచుండును. "అయినచో నాపాపపరిహార మగునట్టుల — నామనను దహించి వైచుచుండిన పశ్చాత్తాపము ప్రకటితమై కొంత యుపశమించునట్టుల నేనా ప్రభాకరసార్వభౌముని యవనచెఱనుండి విడిపింపఁజాలకుంటినిగదా!" అని నిస్పృహ చెందుచుండెను. ఇంతలోఁ జంద్రహాసుఁడు మూఁడువందల యాటవికులతో నటకు వాయువేగమునఁ బరుగిడుచు వచ్చెను. "కాని యుద్ధము పరిసమాప్తి యాయెను. ప్రభాకరుఁడు బందీకృతుఁడాయెను." అని వినినప్పుడు చంద్రహాసుని హృదయ మెట్లుండెనో యెవ్వరు వర్ణించి చెప్పఁగలుగుదురు! అది కేవలానుభవము వలననే తెలియఁదగినది. విజయసింహుఁడుఁ జంద్రహాసుని యా యాశాభంగజనిత మగు దుఃఖమునుండి తేర్చి

విజయ:—అయిననేమి? నాఁడు హనుమంతుఁడు సంజీవితో వచ్చినట్టుల నీయాటవికులతో సరియగు సమయమునకే వచ్చితివి. ఈమూఁడువందలబలములు చాలును—, నిశాదేవియు, నిద్రాదేవియు మనపక్షమున యవనస్కంధావారము నిదివఱకే ప్రవేశించి యాక్రమించి యున్నవి. ఈవిలుకాండ్ర నీ చేరువనే కూఁతవేటు దూరములో నూచల నెక్కవెట్టి బారులు తీరి నిలువుచునుము మనమిరువురము ద్రోణకృపాచార్యులు పాండవశిబిరమునఁ బ్రవేశించినట్టుల నేఁడీయవనశిబిరముల జొత్తము. మన చక్రవర్తిని విడిపించుకొనివత్తము.

చంద్రహాసుఁడు డందుల కత్యంతోత్సాహముతో నంగీకరించెను. విజయసింహుఁడు నిర్ణయించిన వ్యూహముచొప్పున యాటవికులందఱు నిలచియుండిరి. విజయచంద్రహాసులు యవనస్కంధావారము సమీపించిరి. సేన యంతయు సమ్మోహనాస్త్రబద్ధమై యున్నట్టుల నిశ్శ

బ్ధము — నిశ్చైతన్యము — విజయచంద్రహాసు లిరువురును మొదటి ద్వారము దాటి లోనప్రవేశించిరి. ప్రభాకరు నెచ్చట నుంచిరో యని వెతుక నారంభించిరి. ఎందరెందరివో మహావీరుల నాయకుల పటకుటీరములు కానఁబడుచున్నవే కాని ప్రభాకరు నుంచిన తావు కానరాదయ్యె ఎట్టకేలకు శిబిరమధ్యంబున నంతియోకుని గుడారంబునకు సమీపంబున నొక్క చిన్నపటకుటీరములో నిరాయుధుఁడుగాఁ జేయబడిన ప్రభాకరుఁడు కనబడెను. పద్మాసనాసీనుఁడై యూర్ధ్వముఖుఁడై యేదియో తీవ్రముగ నాలోచించుచుండెనో లేక పరమేశ్వర ధ్యానతత్పరుఁడై యుండెనో యనఁ బొడకట్టుచుండెను. చుట్టును బండ్రెండుగురు యువకవీరులు విచ్చుకత్తుల నేలమోపి యానుకొని నిలుచుండియే సరగన్ను వెట్టి కునుకుచుండిరి. శుద్ధస్వరూపంబగు నాత్మ కర్మవశంబున దేహమునందు బంధింపఁబడి యున్నటులఁ దోచుచున్నది. విజయుఁడును — చంద్రహాసుఁడును లోనఁబ్రవేశించిరి. ఇరువురకును కంటికొలకులవెంట నప్రయత్నముగఁ గన్నీరు కాఱుచుండెను. ఆ యిరువురిలో నెవరును ముందుగ సాహసించి పలుకరింపఁ జాలకపోయిరి. కరిములు స్తంభించెను. ఎట్టకేలకు విజయుఁడే ధైర్యము వహించి గొంతు సవరించుకొని

విజయ :— దేవ!

ప్రభాకరుఁడు విజయచంద్రహాసుల నిరువుర సదయవీక్షణంబుల బహూకరించెను. చంద్రహాసుఁడు మూఁగవానివలె ప్రభాకరుని పాదములకు సాష్టాంగనమస్కారముచేసి నిలువబడెను.

విజయ :— దేవ! విచ్చేయుఁడు. మార్గము నిరాటంకముగ నున్నది. దేశము మీకొఱకై పరితపించుచున్నది.

ప్రభ :— (మందహాసము గావించి) నేను రాఁజాలను—ప్రభాకరుఁడు దొంగవలెఁ జెఱనుండి పాఱిపోవుట కిష్టపడఁడు.

చంద్ర :—మహారాజా! అట్లక్కఱ లేదు. సార్వభౌముని యాజ్ఞయైనచో వీరధర్మోచితంబుగ నావెంట వచ్చినమూడువందల యాటవికుల విచ్చుకత్తులవంటివారు — బొబ్బరించు బెబ్బులినైన ముష్టిఘాతంబున మృత్యువాతఁ బడద్రోయువారు—

ప్రభా :—నాయనా! చంద్రహాస! వలదు.

చంద్ర :—ప్రభూ! నాఁ డిట్టియవనచెఱసాలయందె నాసోదరిని మృత్యుముఖమునుండి తప్పించి కాపాడిరి. ఆఋణము దీర్చుకొనుటకే యీశ్వరుఁడు నాకీసమయమున నిట్టియాటవికసేన నమకూర్చి యిచ్చెనని నమ్ముచున్నాను.

ప్రభా :—అటులనే ఇప్పుడు గతము స్మరింపఁ దగినదికాదు. విజయ! చంద్రహాస!—మీరాజభక్తికి నేనెంతయు మెచ్చుకొనుచుంటిని. ఈప్రభువిశ్వాసము మిక్కిలి కొనియాడఁదగినది కాని నాయొక్కనికొఱకు ఆమూడువందల యాటవికులు నిష్కారణముగఁ బ్రాణముల నేల గోల్పోవలయు? వారు శూరులు, వీరులు, బలాఢ్యులు, నాయందు భక్తివిశ్వాసము కలవారు. మఱియుఁ బసిబాలురవలె సత్యసంధులు, నిష్కపటులు నిర్మలజీవితులు—కాని రణశిక్షితులై, అసంఖ్యాకులై వివిధమారణ యంత్రోపకరణసహాయులై యున్న యీయవనుల కెదురునిల్చి పోరుసలుపుమనుట క్రూరకార్యము. ఇప్పుడు తప్పి వచ్చిన మఱియొకప్పుడైన తప్పక తగునత్కాలము వచ్చితీరును. అప్పుడు విజయము ధృవము కావున నిస్పృహఁ జెందకుఁడు. పొండు. సత్ప్రవర్తనము కలిగి యుండుఁడు. ఐకమత్యము పెంపొందించుకొనుచుండుడు. ఈశ్వరుఁ డచిరకాలమున మిమ్ముల నాశీర్వదించును.

విజయసింహుఁడును, చంద్రహాసుఁడును, ప్రభాకరుని ప్రత్యుత్తరము వినినంతనే వాని యౌదార్యము నుగ్గడించి సంతసింపవలయునో లేక తమకోరిక యీడేరనందులకును ప్రభాకరుఁడు కష్టములపాలుగానున్నందులకు దుఃఖింపవలయునో తెలియకుండిరి.

విజయ, చంద్ర :—ప్రభాకరమహారాజా! దేవర యిటులసెల విచ్చుచుండ మాకేమియుఁ దోఁచుటలేదు. ఈసేవకుల కేమియాజ్ఞ!

ప్రభా :—మీ ధైర్యసాహసోపేత ప్రభుభక్తివిశ్వాసములకు నేనెంతయు సంతసించితిని—కాని నేను మీవెంటరాఁజాలను. మీరును శాంతముగ నిచ్చోటుఁ బాసి చనుఁడు. అదిగో వేగుచుక్క పొడుచు చున్నది. అని స్పష్టముగ జెప్పెను.

విఫలమనోరథులై—ప్రభాకరునకు సంపూర్ణభక్తితో నమస్క రించి—కడసారిదర్శనము కాఁబోలు నని. తనివితీరక యాసుందర విగ్రహమును నక్షత్రకాంతియందు మాటిమాటికి వెనుదిరిగి చూచుచు విజయచంద్రహాసులు యవనశిబిరము దాఁటివచ్చిరి—కాని విజయ చంద్రుల కిరువురకును యవనునిపైఁ గ్రోధము ప్రభాకరునెడ భక్తి మిక్కుటమై పట్టశక్యము కానందున చంద్రహాసుఁడొక్క యాల వైచెను. విజయసింహుఁడు " మేలుచంద్రహాస! మేలు—సార్వభౌముఁ డేమైనఁ జెప్పనిమ్ము—మన మీయవనుని గసితీర నఱకవలయును— లేనిచో నీప్రాణముల భరించుట దుర్భరమగుచున్నది, మన మాయలక సుందరునో నంతియోకునో చెఱగొంటిమా ధన్యులము. కృత కృత్యులము. "—

చంద్ర :—వారివారి నెలవుల నెఱింగియే యుంటిమికదా!

ఇంతలో నాటవికులదండువచ్చి వ్రాలినది. అంతియోకుని గుడారము తగులఁబడుచున్నది. ఎవరెచట నున్నది ఎవరికిని దెలియకుండెను. యవనులు యవనులనే నఱుకుచుండిరి. అంతియోకుఁడు బంధింపబడి ప్రతాపసింహుని వనదుర్గమునకుఁ గొనిపోఁబడుచుండెను. తెల్లవారినది. రాత్రివేళ దొంగపోటుగ శత్రువులు మీఁదబడుటచే యవనులైదారు వందలనఱకు నష్టమైరి. ఆటవికు లొక యిరువదిమంది మాత్రమె ప్రాణములతో నుండిరి. విజయునిసలహా చొప్పున చంద్రహాసుఁడును విజయుఁడును నాయిరువదిమంది విలుకాండ్రు నిచ్చవచ్చిన యవన

భటులు దుస్తులఁ దాల్చి యవనవేషమున నిరపాయముగ యవనభూమి దాటి ప్రతాపుని వనదుర్గము చేరి. పద్మిని మరణించిన నాటనుండియుఁ ప్రతాపుఁడు మంచముపట్టియుండెను. విజయుఁడుండి, సజీవుఁడై, చంద్రహాసుఁడింటికి వచ్చినంతనే వానిని జూచుటకు మాత్రమె యాఁగి యున్నవో యన్నటుల ప్రాణములా జీర్ణదేహమునుండి బాసి చనెను. చంద్రహాసుఁడు మిక్కిలి దుఃఖించెను. యథోచితముగా నుత్తరక్రియలఁ బరిసమాప్తిఁ గావించెను. పిదప విజయసింహుఁడు చంద్రహాసునకు "పద్మినీ ప్రణయగాథ" విషయమై తన నిజస్థితిని తెలుపుకొనుచు నెన్నియోవిధముల క్షమార్పణ వేడుకొనెను—

## ౩౧

ఇటు పాంచాలమున యుద్ధభూమియందు శిబిరములో ఖైదుచేయబడిన ప్రభాకరుఁడు "ఆర్యుల కిదియొక్క కళంకమై నిలుచునుగదా!— రాత్రివేళ నిద్రయందు మునిగియున్న శత్రువులపై దొంగపాటునఁబడి యుద్ధధర్మములు మంటగలిపిరిగద నేటి కార్యులు!" అని మిక్కిలి విచారించుచుండెను. ఇంతలో యవనదళనాయకులు వచ్చి "అంతియోకుని నెవరు గొంపోయిరి. ఎవరీరాత్రి దొంగపోటుగ వచ్చినది. నిజముచెప్పుము" అని మిక్కిలి వేధింపఁజొచ్చిరి. మఱొకమాఱు వచ్చి "రంజని నెచట దాచితివి!" అని వేధించిరి. కొట్టినను, తిట్టినను నేమిచేసినను ప్రభాకరుఁడు మాఱుపల్కక హిమాలయము వలె నచలుఁడై ధీరుఁడై నిలిచియుండెను. అలకసుందరుఁ డంతియోకుఁడు శత్రువశమైనందులకు విచారించి సిసిరోయనువాని నాసైన్యాధ్యక్షపదవియందు నియోగించి— దేశము నంతను నాక్రమించుకొనుచుండెను — సిసిరో ప్రభాకరుని యొద్దకు వచ్చి "ప్రభాకరా! అంతియోకుని మీ యార్యులెటుల పట్టుకొనిరో యెఱుగుదువుకదా! అట్టిది సికు నమ్మతమేని యటుల నేచెప్పుము. కాదేని

అంతిరోకుఁ డెచట దాఁచబడెనో చెప్పుము. నీ వెఱుఁగకయే
యీపని జరిగినదా! ఏల వ్యర్థముగ నీబాధల ననుభవించెదవు?"
అని యడిగెను. అంతట ప్రభాకరుఁడు "ఈకష్టసుఖములెల్ల దేహము
నకేగాని దేహికి నాత్మకు లేవు — నాదేహ మిప్పుడైన నశించునదే —
నేనెన్నటికి నశించువాడనుగాను— నాకీబాధ లెవ్వియు ముట్టఁజాలవు—
ఆమాట యటుండనిమ్ము— ఆర్యులు చోరవృత్తి నవలంబించుట నాకు
మిగుల లజ్జాకరముగ నున్నది. కాని వాని నెవ్వరు గొంపోయిరో—
యెచ్చట దాఁచియుంచిరో నేఁజెప్పఁజాలను. మీరు కావలెనని కోరు
నెడల 'నామాటయందు గౌరవముకల వారెవ్వరైన నాయవనవీరుని
బంధించి యుంచినచో వానిని వెంటనే మీకు నప్పగింపవలసిన' దని
యొక హెచ్చరిక వ్రాసి సంతకముచేసి యిచ్చెదను." అని చెప్పెను.
అంతట సిసిరో యలకసుందరునితో యోజించి, తమకు గౌరవభంగ
మైనను యవనులు ముఖ్యముగ కార్యవాదులుగాన, నటులనే వ్రాసి
యిమ్మని ప్రభాకరుని గోరెను. ప్రభాకరుఁడు నిండుమనస్సుతో లేఖిని
గైకొని యిటుల వ్రాసెను.

ఆర్యులారా! మీలో నెవ్వరేని యవనసైన్యాధ్యక్షుఁ డగు
నంతిరోకుని బంధించి చెఱఁబెట్టి యుంటిరేని నట్టివారు వెంటనే,
చోరవృత్తి నార్యులకు తగనిదిగావునను, యుద్ధధర్మముల మీరుట
మనిజాతికి గళంకముగావునను, నాయంతిరోకుని యవనసార్వభౌముఁ
డగు నలకసుందరున కప్పగించి తమయొక్కయు తమజాతియొక్కయు
గౌరవమునుగాపాడి నిలువబెట్టుకొనెదరుగాకయని మిక్కిలి కోరుచుంటి.

పాంచాలము, యవనశిబిరమందలి చెఱసాల రుధిరో<br>ద్గారినామసంవత్సర వైశాఖబహుళ అమావాస్య } "ప్రభాకర"

సిసిరో యాయుత్తరమునందుకొని మిక్కిలి యాశ్చర్యముతోఁ
ప్రభాకరుని నాపాదమస్తకమువఱకుఁ జూచి వెడలిపోయెను. ఆయుత్త
రమునకు బ్రతుల దీయించి భరతఖండమందు నల్గడల ప్రకటితము

గావించెను. కాని ఇంతవఱకు నంతిరెూకుని నెవ్వరు తెచ్చి యప్ప గింపలేరైరి. రంజనిజాడయుఁ దెలియ దాయె. యవనసైన్యములు మాత్రము నిరాఘాటముగ వఱదలవలె దేశము నాల్గుమూలల వ్యాపించుచుండెను. శ్మశానవాటికయందు స్థాపింపబడిన పద్మిని స్వర్ణ విగ్రహము యిప్పుడొకగొప్ప దేవతవలెఁ గొలువఁబడు చుండెను. చుట్టును నొకప్రాకారము గట్టిరి. అందొకయాలయము నిర్మింపఁబడి నది. ఆయాలయమునకు బోయి మ్రొక్కి పద్మినీదేవి సాక్షిగ శపథ మూని యార్యులు యవనుని రాజ్యము స్థాపింపనీయ మనుచుండిరి. ప్రాణములనైనఁ గోల్పోయెద మనుచుండిరి. ప్రభాకరుఁడు యవనులచే వేధింపఁబడుచున్న వృత్తాంత మెటులో వారలకుఁ దెలియవచ్చు చుండెను. అందుచే వారాయవనులు ప్రకటించుచుండిన యుత్తరము కల్పిత మసత్యమని నమ్ముకుండిరి. కాని విజయచంద్రహాసులు మాత్రము మొదటినుండియు నంతిరెూకుని నుచితగౌరవములతోడనే చూచు చుండిరి. ప్రభాకరుఁడు వ్రాసినన్నయుత్తరము విజయునిచేతికిఁ గూడ నందినది. భీమునకు ధర్మరాజుమీఁదవలెనే విజయునకుఁ బ్రభాకరుని మీఁద మిక్కిలి కోపము కలిగినది. కాని భీముఁడు ధర్మరాజునాజ్ఞ శిరసావహింపక తీరదుకద! ఇంతలోనే యలకసుందరుఁడు భరత ఖండమునకు సార్వభౌముఁడని ప్రకటించుచుఁ బట్టాభిషిక్తుఁడాయెను. కాని యామహోత్సవముచూచుటకు నార్యుఁడెవ్వఁడును పోఁడాయె.

అలక :—సిసిరో! ఏమిది. ఆర్యులింకను దమపురాతనపద్ధతులఁ మానినటులఁ గాన్పింపదు—మనరాజధానిని వీడి దేశపరిత్యాగము గూడఁ బూర్వమువలెనే సేతురు కాఁబోలు.

సిసి :—అటులనే తోఁచుచున్నది. ఆప్రభాకరునెడల వారల కింకను భక్తిశ్రద్ధలు నశింపవాయె. వాఁడును రంజని యున్నతావును గాని మన యంతిరెూకు నుంచిన నెలవుగాని చెప్పఁజాలఁడఁట. ఆయుత్తరము కల్పితమని యెవరును నమ్ముటలేదు.

అలక :—మంచిది. మూఁడు దినములలోఁ బ్రభాకరుఁడు రంజని యున్నచోటును, నంతియోకు నుంచిన నెలవును, వానిని గొంపోయిన విద్రోహుల నామనివాసములను నెఱిఁగింపనిచో వాఁడు మరణశిక్షకుఁ బాల్పడవలసి యుండును.

ఈవార్త నీటిపైఁ దైలబిందువువలె దేశమునందెల్ల బ్రాకిపోవు చుండెను. మొదటిదినము గతించినది. రెండవదినముగూడ జరిగిపోవు చున్నది. ముగిసినది మూఁడవదినము, గడువునకు తుదిదినము ప్రవేశించినది. జాములు గడుచుచున్నవి. కాలచక్రము మిక్కిలి నిర్లక్ష్యముగ ముందుకు సాఁగిపోవుచున్నది. కాని ప్రభాకరుఁడేమియు దిగులు పడఁడాయె. గడువు దాటినది. ప్రభాకరునకు [illegible] దుస్తులను దొడిగిరి. ఎఱ్ఱసిటోపిని బెట్టిరి ఎఱ్ఱని పూలదండను మెడను వేసిరి. వధ్యస్థానమునకుఁ గొంపోవుచుండిరి. యమకింకరులవలె యవనభటులు చుట్టును విచ్చుకత్తులతో నడచుచుండిరి. అలకసుందరుఁడు, సిసిరో, తక్కిన మంత్రులు, నాయకులు సామంతులు నందఱు నాస్థలము పరివేష్టించి సుఖాసీనులై యుండిరి. ప్రభాకరుఁడు వధ్యశిలపై కెక్కెను.

సిసి :—ప్రభాకర! రంజని యెచ్చటనున్నది?

ప్రభా :—(మాటలాడఁడు).

సిసి :—అంతియోకుఁ డెచ్చటనుండెను?

ప్రభా :—(మాటలాడఁడు.)

సిసి :—ఆరాత్రి యెవరు వానిని గొంపోయిరి?

ప్రభా :—(మాటలాడలేదు.)

అలక :—ప్రభాకర! నిన్నిప్పుడు వధింప బోవుచుండిరి. కావున నీప్రాణముదక్క మఱి యెద్దియైన నొకకోరిక నీవు కోరినచో యది నెఱవేర్పఁబడును.

ప్రభా :—భువనసార్వభౌమా! అలకసుందరచక్రవర్తీ! మీ భుజబలమునకు దైవము తోడగుటచే నారాజ్యశత్రువు మీకు వశమైనది. యువనగౌరవమునకు గాని నార్యధర్మమునకు గాని యెట్టి హానియుఁ గలుగకుండులాగున సామ్రాజ్యము పరిపాలింపుము. నాకు వేఱుకోరిక లేదు.

ఆవాక్యమచ్చటివారిహృదయములెల్లఁగరగించెను. అలకసుందరుఁడు కూడఁ దనహృదయమందు "నిజముగ రాజువు కమ్మనియే వీనిని ప్రకృతిసృష్టించినది" యని తలఁచెను. ఇంతలో సభలో కలకల ముదయించెను." రంజని యిదిగో! నేనే వచ్చుచుంటిని. తండ్రీ! కావుము—నానాథుని రక్షింపుము. నన్ను శిక్షింపుము." అని యుచ్చైస్స్వరమున నఱచుచు రంజని ప్రవేశించెను. అందఱు నిర్ఘాంతపడి చూచుచుండిరి. శిలాప్రతిమవలె నిలిచియున్న ప్రభాకరుఁడు తలవంచుకొనెను రూపుదాల్చిన శోకమువలె వీడిన కేశపాశముతో, కన్నీటఁదడిసి పాలిండ్లపై నంటుకొనియున్న వల్కలములతో దుఃఖావేగమునఁ గంపించుచున్న మైతీఁగతోఁ గట్టెదుట నిలచియున్న కన్న కూఁతును రంజనిని జూచినంతనే యలకసుందరునకుఁ బ్రొల్లిటివాత్సల్యమును దదనుగుణముగ విచారమును గలిగి వాని విశాలనయనంబు లశ్రుపూరితము లగుచుండెను.

రంజ :—హా! తండ్రీ నేను దిక్కులేని పాపినినైతిని. నీముఖము చూడ ధైర్యము చాలకున్నది. ప్రభాకరుఁడు దేవుఁడు. ఆమహాత్ముని ధర్మపత్నినై యుండియు – వారి యున్నతాదర్శముల కనుగుణ్యముగ నా జీవితమును నడుపుకొనఁజాలక తుచ్ఛమగు నింద్రియ సుఖముల కొఱకు నానతీత్వగౌరవమును, ధర్మమును గోల్పోయితిని. కావున పరిత్యజింపఁబడితిని. తపోవనంబుల వల్కలంబులఁ దాల్చి తాపసివృత్తిఁ బూనియుంటిని. ప్రభాకరుఁడు నేనెందుంటినో యెఱుగఁడు. ఈ నీచురాలు కానరామి యామహాత్ముఁడు ప్రాణములు విడువ

పలసి వచ్చుచుండెనని నాకు వినబడిన వెంటనే వచనము చేసికొనుటకై తెచ్చుచుండిన కందమూలమ్ముల నచ్చటనే పాఱవైచి రెండుదినముల నుండి పరుగుపరుగున నిద్రాహారములమాటఁ దలపక రొండలెఱుఁగని వేగమున నిటవచ్చి పడితిని.

అని చెప్పుచు కలకానుంకరుని మోకాల మోకరించి "తండ్రీ! నానాథుని గావుము. నన్ను శిక్షింపుము. వలయునన్న నిహాపురి శిక్షయు నేనే యనుభవించెద. ప్రభాకరుఁడు మహాత్ముఁడు. దేవుఁడు" అనెను.

రంజని యిటుల చెప్పుచు తండ్రిని వేఁడుకొనుచుండ జూచువారల కును వినువారలకును మనసు నీరగుచుండెను. హృదయము కరుణారస ముతో నిండుచుండెను.

అలక :—కానిమ్ము. నిన్నే మందును! నీవు మిక్కిలి దురదృష్ట వంతురాలవు రంజనీ! ప్రభాకరుని క్షమింపనే వచ్చును. కాని యవన రాజకుమారిని యార్యుఁడొకఁడు రహస్యముగఁ గొనిపోయి వివాహ మాడుట మనజాతి సహింపకున్నది.

రంజని :— ఈపరిణయమువలన యవనునికంటె నార్యుఁడే యెంతయు గౌరవము గోల్పోయెను. మన్నించిన నొక్క ప్రశ్న యడిగె దను. యవనులు యార్యులు, యనినపులులు, మేకలవలె సహజవైర జంతువులా? తండ్రీ!"

ఈప్రశ్నము జాతివైషమ్యానలదగ్ధంబు లగుచున్న హృదయసీమ లపైఁ బ్రేమామృతవర్షము కురిసెను. అలకనుందరున కేమని సమా ధానము చెప్పుటకును దోఁచకుండెను. ఇంతలో నతిరయంబున విజయ సింహుఁడును, చంద్రహాసుఁడును, నంతిమోకుని వెంటఁబెట్టుకొని యచ్చటకు వచ్చిరి.

ప్రభా :—ఇఁక నామనమున కేవిచారమును లేదు. సుఖముగఁ బ్రాణముల విడుతును,

విజయ :—మాసార్వభౌముని యాజ్ఞానుసారముగనిదిగో యవన సైన్యాధ్యక్షుఁడు నంతియోకుఁడు యవనసార్వభౌమున కిచ్చివేయఁ బడుచుండెను. అంతియోకవీరాగ్రణీ! నీవు మాబందినుండి విముక్తుఁడ వైతివి. అలకసుందరచక్రవర్తీ! వీరిరుగో మీ సైన్యాధ్యక్షుఁడు మహాత్మా! ప్రభాకర! తమయాజ్ఞ మేమించుక మీరితిమి. సాధారణ మానవుల మగుటచే మాకారాత్రి కోప మాగినదికాదు.

చంద్ర :—దేవా! ప్రభాకర! ఈదృశ్యమును జూడఁజాలను. సేవకుఁడు ముందరిగి తమరాకకొఱకై స్వర్ణకవాటమున నిరీక్షించు చుండును. ఆశీర్వదించి యనుజ్ఞ యిండు.

అని కన్నులు మూసికొని యొరనుండి కత్తిదూసెను.

ప్రభా :—కుమారా! చంద్రహాస! వలదు. ఆత్మహత్య నీచము పాపము కానిచో నీవలెనే యీప్రభాకరుఁ డీలోకమును విడిచి యుండెడివాఁడు.

అలక :— అంతియోకుఁడా! కుశలమా! సప్తసముద్రములఁ దాటివచ్చి తుదకు పంటకాలువలో మునిఁగిపోయినట్లున్నది.

అంతి :—సార్వభౌమ! ఏమనిచెప్పుదును! ఎంతని వర్ణింతును! కలనైన నేనెన్నఁడటులఁ దలపనైతి. శత్రువు నగునన్ను తమతో సమానునిగ సోదరునివలె భావించి గౌరవించిరి. ఆర్యు లనాగరకు లను కొంటిమి. అది పొరబాటు. వారు నాగరికులన్నంత మాత్రమున చాలదు. నరునకు నీశ్వరునకు నడుమ నొకజాతి యుండెనేని నార్యులే యాజాతివారని చెప్పుటయం దతిశయోక్తి లేదు. స్వార్థత్యాగము, పరమతసహిష్ణుత, సత్యసంధత, ధర్మతత్పరత, ఆర్యునకు సహజలక్షణములని నాకు తోఁచుచున్నది. అట్టి యీజాతితో వైరమూనుటచే మనము ఘనతఁ గాంచితిమి.

అందఱు చిత్రరుపులవలె నుండి వినుచుండిరి. అలకసుందరుఁడు కన్నులమూసికొని యొక్క-క్షణమాత్రముండి దిగ్గునలేచి ప్రభాకరుని

డాయంజని దగ్గఱకుఁ దీసికొనెను. అచ్చటి వారందఱు "ఏమది" అని మిక్కిలి యాశ్చర్యముతోఁ జూచుచుండిరి. లోకి మంతయు బోటపస్వేచ్ఛపై లేచి చూచుచున్నటులుండె. సూర్యుఁడటులనే యాగి చూచుచున్నటుల నుండెను. దేవతలు మేఘమాలికల నుత్తరించుకొని పుష్పహారముల నెత్తి పట్టుకొని యుండిరో యన నంతరిక్షము మనోహర చిత్రవర్ణశోభితమై యుండెను.

అలక :—ప్రభాకర! నీవ యీ ఆర్యావర్తమునకుఁ దగిన సార్వభౌముఁడవు. కావున నీసామ్రాజ్యము నీవ యథోచితముగఁ బరిపాలించుకొనుము. నీయౌదార్యము ప్రత్యక్షముగ నెఱిగియున్న మేము మమ్ముల మన్నింపుమని యడుగుటకూడఁ దగదు. ఇటుపై యవనార్యావర్తములు రెండునుగూడ సంతసముతో నన్యోన్యమైత్రిం దవిలి యభివృద్ధిఁ గాంచుగాక! దశదిశల హర్షధ్వనులు పిక్కటిల్లె.

ప్రభా :—యవనసార్వభౌమ! మీ స్నేహము తప్పక స్వీకరింపఁ దగినది. కాని నాకింకను రాజ్యము సేయవలెనను కోరిక లేదు. రాజనీతి విశారదుఁడవు. సకలసద్గుణసంపన్నుఁడవు. నీవె, ధర్మమార్గమున భరతఖండమును గూడఁ బరిపాలింపుము.

అలక :—అటులకాదు. అంతియోకుఁడా మన సైన్యముల నెల్ల మూఁడుదినములలో నీయార్యావర్తమును విడిచి స్వదేశమునకు మరలునటుల నాజ్ఞాపింపుము.

"అంతియోకుఁడు చిత్త" మని యటులనే యుత్తరువులు జారీ చేయుచుండెను.

ప్రభా :—అయినచోఁ జంద్రహాస! నీవె యీభరతసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడ వగుటకుఁ దగియుందువు. కావున రాజ్యభారమును మనమిత్రులగు యలకసుందర సార్వభౌముని భుజస్కంధముల నున్నదానిని వంచుకొని వహించి వారికిఁ గొంతవిశ్రాంతి కలుగఁజేయుము.

చంద్ర :—సేవకుఁడు సదా విధేయుఁడు.

అలక :—ప్రతాపసింహుఁడు వీరావతారుఁడు. వాని పుత్రుఁడు కాఁడా యీచంద్రహాసుఁడు. నిజముగ సింహకిశోరము. (అని చంద్రహాసుని మేను దువ్వెను. కిరీటము శిరమున నుంచెను.)

అంతి :—పాప మామహావీరుఁడు మొన్న మొన్ననే మరణించెను. మరణ శయ్యపైనుండి "ఏమి! నేనమ్మజాల. ప్రభాకరుఁడే పరాజితుఁడయ్యెనేని దేవుఁడే లేఁడనవలయును" అని చెప్పెనఁట.

ప్రభా :—కటకటా! ప్రతాపుఁడు మరణించెనా! భీష్మాచార్యునిఁబోలు నుత్తముఁడు!

వశిష్ఠుకుఁను నగస్త్యుఁడును గాషాయాంబరముల దాల్చి యోగదండముల చేతఁబూని ప్రవేశించిరి — విజయచంద్రహాస ప్రభాకరరంజనిలు వారలకు సాష్టాంగప్రణామము లాచరించిరి. అలకసుందరుఁడును లేచి నమస్కరించెను. అంతిరోకుఁడు మొదలగువారు కూడనొక్కమాఱు లేచి నమ్రతఁ జూపిరి. ఋషులు నందఱను యథోచితంబుగ నాశీర్వదించిరి.

వసి :—యువనసార్వభౌమ! నీవు ధన్యుఁడవు. ఏమనందువా భౌతికసామ్రాజ్యమును వదలుకొనుటచే మాయార్యజాతి హృదయసామ్రాజ్యమును వశముచేసికొంటివి.

అగ :—ప్రేమయందుగలశక్తి స్థూలదృష్టికగోచరము. తుదకు నీవు కనుగొన్న నీపరమరహస్యమును లోకమందలి సామ్రాజ్యకాంక్షాపరులెల్ల నెఱింగినచో వేఱే స్వర్గమేల? స్వర్గమే యీభూలోకమున కవతరింపదే?

వసి :—ఈఆర్యయువనమైత్రి లోకములో నధర్మమును నశింపఁజేయవలసి నప్పు డగ్నియు వాయువు కలసినట్లును, నిజధర్మములను సంరక్షించుకొనుచుఁ దమతమ సంఘముల సౌఖ్యములఁ బెంపొందించు

కొను యవసరములబుద్ధియు శక్తియు మేళవించినట్లును బరస్పరసహాయమునందుచు నాచంద్రార్కము వర్ధిల్లుగాక—

అందఱును మహాప్రసాదమని యాయాశీర్వాదము గ్రహించిరి.

## ఉపసంహారము

తరువాత గొప్ప యుత్సవములు జరిగెను. అందు యవనులును నార్యులును గూడ మనస్ఫూర్తిగ సంతోషపూర్వకముగఁ బాల్గొనిరి. విందులతోఁ గానుకలతో యవనుల నార్యావర్తమునుండి పెండ్లివారిని వలె సాగనంపిరి. చంద్రహాసుఁడు సింహాసన మెక్కి రాజ్యము సేయ మొదలుపెట్టెను. మణిహారము పద్మిని మెడయందు స్థిరముగ నిలిచెను. ప్రభాకరుఁడు తాపసవేషము దాల్చి వనములకుఁ బోయెను. రంజనియు వారికిని శిష్యురాలై సేవఁజేయుచు దత్త్వము గ్రహించుచుండెను. విజయసింహుఁడుకూడఁ బ్రభాకరునితోఁ బాటు తపోవనములకుఁ బోగోరెను గాని ప్రభాకరుఁడు "వలదు. చంద్రహాసుఁ డింకను బాలుఁడు. వానికి నీవు సహాయుఁడవై మంత్రివై అన్నివిధములఁ గాపాడుచుండుము. వాఁడు స్వతంత్రముగ రాచకార్యములఁ జక్కబెట్టుకొనఁ గలుగునంతవఱకు నీవు మునివృత్తి స్వీకరింపకుము" అని చెప్పుటచే విజయుఁ డటులనే యాఁగి యుండెను.

తాపసియైన వసుమతి తపోవనంబునఁ దనయాశ్రమప్రాంగణమునఁ గూర్చుని రాత్రివేళ రంజనియుఁ దానును గూర్చిన ప్రభాకరునిమీఁద పాట పాడుచుండెను—

కావునసే సామ్రాజ్యలక్ష్మి యింతవఱకెవ్వరిని వరించియుండలేదు. అందుచేతనే సముద్రమందలి తరంగములవలె భావతరంగములు లేచుచు పడుచున్నవి.—అన్యాయముగ లక్ష్మిని చంచల యని దూరుచుంటిమి. మనకర్హత లేదుగదా యని యూహింపకుంటిమి. నాఁడు చేసినబాస నేఁడుకూడ గలదు. లక్ష్మి తానాడినమాట తప్పు

సరికాదు. కాని యర్హత కలిగిన నెవ్వారాయునుపదినాలుగు మణుల హారమును గంఠమున స్థిరముగ దాల్చుకొని ధన్యులు కాఁగలరోకదా! నేటివఱకు దేశచరిత్రలన్నియు సీమహాలక్ష్మీ స్వయంవరమహోత్సవమునే వేనోళ్ళ వర్ణించుచున్నవి.

సమాప్తము

---



